

గాలి వీచినపుడల్లా ప్రకృతి సిద్ధమైన సంగీతం మనోహరంగా వినవచ్చేటట్లుగా "హార్ప్" ఆకారంతో "పాడే వంతెన"ను పశ్చిమ జర్మనీ రైన్ నదిమీద నిర్మిస్తున్నారు.






# ఫిలిప్స్ సరికొత్త రేడియోలు

మీకు కావలసిన

## కరెంటు రేడియోగాని
## ట్రాన్సిస్టరు రేడియోగాని

అందరికి అందుబాటులో నుండు ధరలతో నూతన పరిశోధనలతో తీర్చి దిద్దబడి, మీకు, మీ కుటుంబమునకు సంతోషాన్ని, తృప్తిని యిస్తూ, మీకు సేవచేయుటకు సిద్ధముగా వున్నవి. నేడే కొని ఆనందించండి.











*గుంటూరు జిల్లాకు డీలర్సు :*

Gram : VIKOS Phone : 356

# విజయ అండ్ కో.,

గుంటూరు & మాచర్ల

*మరియు*

| | | |
|---|---|---|
| పద్మ అండ్ కో | — | గుంటూరు |
| పద్మ ఏజన్సీస్ | — | ఒంగోలు |
| శ్రీనివాస స్టోర్సు | — | తెనాలి |
| రేడియో సేల్సు & సర్వీసు | — | చీరాల |
| జయ అండ్ కో | — | నిడుబ్రోలు |
| కావేపల్లి సాంబశివరావు | — | రేపల్లె |
| రాజేంద్ర రేడియో హౌస్ | — | నర్సరావుపేట |
| దేవిశెట్టి నాగేశ్వరరావు | — | సత్తెనపల్లి |
| మూర్తి అండ్ కో | — | మంగళగిరి |
| సుబ్బారావు రేడియో హోం | — | బాపట్ల |



ఛాయాచిత్ర వారి

# మంచి మనిషి

డైరెక్టర్
కె. ప్రత్యగాత్మ

ప్రొడ్యూసర్
కె. సుబ్బరాజు

మ్యూజిక్
యస్. రాజేశ్వరరావు
టి. చలపతిరావు

వాణీ రిలీజ్



## ఇంటింటి పద్యాలు

ఆరుద్ర

### కిల్లాడి

మా మామయ్య శ్రీనివాసరావు శ్రీరంగం
మామ్మూలుగా ఆడలేడు చదరంగం
ఏ మూలలు చూసే శగటు
ఆయన సూటి దృష్టికి చాలా వెగటు
తెలుగులో గుర్రం ఇంగ్లీషులో నైటు
పలు గళ్లు దాటడం కాదంటాడు ఆనైటు
ప్రజాస్వామ్య మొక్కటే ఆయనకు మోజు
బలంలో ముందు తీసేస్తాడు తన రాజు
అలా రాజు లేని వాణ్ణి ఎలా అంటాం షా
అందుకే ఆయన ఆట ఎప్పుడూ కట్టని తమాషా.

### హితోపదేశకుడు
### లేక
### చెప్పలేదంటనకపొయ్యేరు

దొంగచాటుగా మీ పెద్దబ్బాయి సిగరెట్టు కాలుస్తూంటే
  పట్టుకొని శిక్షిద్దామనుకుంటున్న ఓ వెంకటరత్నం!
తొందర పడకుండా జ్ఞాపకం చేసుకోవయ్యా నువ్వలాగ
  కాల్చే రోజుల్లో మీ నాన్నగారి ఏతత్ భయంకర యత్నం
దొంగచూపులు మీ చెల్లాయివంక చూస్తూ ప్రేమించ దలచిన
  పక్కింటి కుర్రాణ్ణి తన్నాలనుకొంటున్న అక్షయలింగం!
తొందర పడకుండా జ్ఞాపకం చేసుకోవయ్యా నువ్వలాగ
  సీ క్లాసుమేటుకమలవంకచూస్తేవాళ్ళన్న చేతిలోనీశృంగభంగం
సీనియారిటీ తప్పించి నీకన్నా జూనియర్గాడికి నువ్వు
  కోరుకుంటున్న ప్రమోషనిచ్చినందుకు మండిపడే ప్రసాదం!
సీరియస్‌గా జ్ఞాపకం చేసుకోవయ్యా అలాగే నీకు
  జూనియారిటీ పాటించకుండా ప్రమోషనిచ్చినప్పుడు
  నీ సీనియర్లు పడిన విషాదం.
ఆవురావురనే ఆకల్తో ఇంటికొచ్చి వడ్డించమంటే
  అమ్మలక్కలతో బాతాఖానీ కొట్టడంవల్ల వంట కాలే
  దని గంటసేపు ఆలస్యం చేస్తే భార్యమీద
  కారాలూ మిరియాలూ నూరే నేను మాత్రం
ఆవిడ ఏడు గంటలకే వంటొండి కూర్చుంటే స్నేహి
  తుల్తో చదరంగం ఆడుకొంటూ అర్ధరాత్రిదాకా
  అన్నానికి లేవనప్పుడు వినిపించుకోను
  నా భార్యామణి ఆత్రం.



# ఉత్తరాలు

### ఉద్యోగినులకు చిట్కాలు

''ఉద్యోగినులకు చిట్కాలు'' శ్రీమతి కొంపెల్ల సీతాబాయిగారి వ్యాసం హాస్యస్ఫోరకంగా ఉన్నది. పప్పుని అంత మెత్తగా పిండిలాగా చేసుకొని తినేవాళ్ళు ఉండ రనే నా అభిప్రాయం. కేవలం వంటచేయటమంటే తగని చిరాకు, విసుగు, కలిగి ఎలాగో ఒకలాగా చేసి పడేద్దాం అనుకునేవారికి ఏమైనా ఉపయోగిస్తా యేమో ఈ చిట్కాలు. ఇలా అంటున్నందుకు వారికి కోపం రావచ్చు. కానీ, నిజం అంతే—పప్పు ఉడికితే ఉన్న రుచి, పిండిలా నేడినీళ్లు పోస్తే వస్తుందా? మామిడి వరుగులను పిండిచేసి—ఆపిండి, ఈ పిండి కలిపితే మామిడి వరుగులు పప్పు అవు తుందా ? అలా అనుకొని తినాలన్నమాట—ఇక తిరగమోత సంగతి మరీ ఘోరంగా ఉన్నది— అప్పటికప్పుడు నూనెలో వేయించిన తిరుగమోత రుచి—వారం రోజుల కొకసారి వేయించుకుంటే వస్తుందా ? కనీసం కాస్త నూనె అన్నా లేకుండా ఉత్త మెరపకాయలు ఆవాలు వేస్తే ఏం రుచి వస్తుంది. పైగా ఉప్మా రవ్వను ఉడికించి దానిలో తిరగమోత కలుపుకొని తినమన్నారు. పళ్ళులేని ముసలమ్మ గూడా వీరు చెప్పిన చిట్కాల ప్రకారం తయారుచేసుకొని తినటానికి ఇష్టపడదు.

ఎమ్. రాజ్యలక్ష్మి, (విజయపురి నార్త్)

### ఎదురుచూసిన ఆదివారం

'ఎదురుచూచిన ఆదివారం' చాలా ఆకర్షించింది. సుగుణగారి వ్యాసం చదువుతుంటే మా ఇంట్లో మా అక్కయ్య పడే అవస్థ కళ్లకు కట్టినట్లుంది. ఈకాలంలో చేతోడులేని గృహిణులందరూ ఇదేవిధంగా గడుపుతారేమో ప్రతి ఆదివారం.

పాప (బొంబాయి)

### కథలు

మీరు 16—10—64 వ తేదీ పత్రికలో ప్రచురించిన 'అందని పూలు' అనే కథ నాకు నచ్చింది. ఉద్యోగస్థులైన భార్యాభర్తల జీవితంలో గల వాస్తవికతను యథాతథంగా చిత్రీకరించారు. రచయిత్రికి నా అభినందనలు.

సుసర్ల కృష్ణవేణి (విజయవాడ)

* * *

మా.హనుమంతరావ్‌గారి క్షంతవ్యులు చాలా బాగా ఉందండి !

ఓ. హనుమంతరావు (రూర్కెలా)

### నేను సైతాన్ చేతుల్లో ...

29 వ పేజీలోని 'క్రైటన్ కేరిన్' చిత్రము క్రింద ఆ చిత్రము గురించి వ్రాసిన పరిచయవ్యాఖ్య చదివితే నవ్వొచ్చింది. 'హాంటెడ్ డిగ్రెస్' కు కొత్త భయాలు ఎదురైంది. ఆ ఇంట్లోకి ధ్యానం చేసు కుందామని వెళ్లితేనా, లేక ధ్యానం చేసుకుందామని వెళ్లితేనా ? ఆసెక్కడ "గంచో" వాలో ఆ ధ్యాన త్రుష్టు తెలియనట్లుంగి !

డి. ఆర్. విక్టర్ (పూనా)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 6—11—'64
క్రోధి నామ సం॥ కార్తీకమాస శు॥ విదియ

సంపుటము 57 సంచిక : 10

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


ఆంధ్రసచిత్ర
వారపత్రిక
పాఠకులందరికీ
— మా —
దీపావళి
శుభాకాంక్షలు

## మనలో మాట





ప్రభంజనస్వామి  భావనారాయణరావు  రంగధామ్

ఈ సంచికలో విశేషం దీపావళి కథల పోటీ ఫలితాల ప్రకటన. పోటీకి కథలయితే ఎక్కువగానే వచ్చాయికాని మొత్తంమీద వాటి 'స్థాయి' అంత సంతృప్తికరంగా లేదనిపించేట్లు ఉన్నాయి! ఏది ఎలా ఉన్నా పోటీలో పాల్గొన్న రచయిత(త్రు)లందరికీ మా కృతజ్ఞతలు . . .

మొదటి బహుమతి కథ 'తెర వెనుక దీపం' రచయిత : శ్రీ పలాది ప్రభంజనస్వామి 1932 లో సామర్లకోట దగ్గరే ఉన్న రాగంపేటలో జన్మించారు. బి. కాం., బి. ఎ., బి. ఇడి. పట్టభద్రులు. ప్రస్తుతం పిఠాపురం పంచాయతిసమితిలో ఎడిషనల్ ఎక్స్టెన్షన్ ఆఫీసర్ (ఎడ్యుకేషన్) గా పని చేస్తున్నారు. 1953, మే 27 ఆంధ్ర వార పత్రికలో 'బికారి' అనే వారి కథ పడిందని శ్రీ ప్రభంజనస్వామి మాకు గుర్తు చేశారు!

ఇక రెండవ బహుమతి కథ 'భార్యా రూపవతీశత్రుః' రచయిత : శ్రీ చిల్లర భావనారాయణరావు నేడు సికిందరాబాదులో ఉంటున్నారు. వీరు పుట్టిన వూరు బాపట్ల. వారి వయస్సు ముప్పయితొమ్మిది. బి. ఎ. డిగ్రీ ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇచ్చింది. 'ఉమర్‌ఖయ్యాం', వేమన, శకుంతల, గుడిగంటలు మొదలయిన రచనలు చేశారు.

శ్రీ కొల్లూరు రంగధామ్‌గారు పాఠకులకి సుపరిచితులు. 1930 లో జన్మించారు. బి. ఎస్. సి., బి. టెక్. డిగ్రీలు పుచ్చుకుని తాడేపల్లిగూడెంలో ఛీఫ్ కెమిస్టుగా ఒక ప్రముఖ సంస్థలో పని చేస్తున్నారు. 'సజీవ శిల్పం' మూడవ బహుమతి అందుకుంది.

*  *  *

శ్రీ వి. ఎ. కె. రంగారావుగారు 'గంధర్వ ప్రశ్నలు' వేసి 65 రికార్డులు బహుమతులుగా పంచుతున్నారు! ఈ శీర్షిక నిర్వహణ కూడా వారిదే. . . . .

*  *  *

సినీతారలు ఇద్దరూ పండుగలని గురించే వ్రాశారు. శ్రీమతి పి. భానుమతి ఇంతకు ముందే అయిపోయిన బొమ్మలకొలువు పండగని తమ వ్యాసానికి వస్తువుగా ఎన్నుకున్నారు! శ్రీమతి టి. కృష్ణకుమారి ఎన్నో రోజులముందు జరిగిన ఒక దీపావళి అనుభవం వర్ణించారు...

*  *  *

ఇంతకుముందు చెప్పిన న్యూస్‌ప్రింటు కొరతవల్లనే ఈవారం దీపావళి ప్రత్యేక సంచికలో ఎక్కువ పేజీలు వెయ్యలేకపోయాము. ముద్రణ సంఖ్య కూడా తగ్గించాము. . . .

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : దీపావళి జ్యోతులు : బాపు


మేం అణుబాంబ్ లు చెయ్యమండీ!
వీల్లేదు మనకీ అణు బాంబుటుండాలి!
ఆశయవాది
చైనా ఆటం బాంబ్: భారత మనస్తత్వం దాని ఫలితాలు
వాస్తవవాది


మళ్లీ విజయలక్ష్మి రాజకీయాల్లో దూకింది!
ఫుల్‌పూర్ ఉపఎన్నిక!


బ్రిటన్‌లో లేబర్ పార్టీ నెగ్గింది
"మన సామరస్యం బాగుంటుంది!"


కృశ్చేవ్‌ని లాగశారు
హాయ్!-హాయ్!


కాని అతని పంథాను మార్చరట గా!
బాబోయ్!


అంటే అర్థం...
అమ్మో బాబోయ్!

# నాలుగో ప్రణాళిక లక్ష్యాలు: ధరలు!

కేంద్ర మంత్రివర్గం 21,500 కోట్ల రూపాయల ప్రణాళికని ఆమోదించింది. కావలిస్తే మరొక 1000 కోట్ల అదనపు ఖర్చుకూడా చెయ్యవచ్చునంది. ప్రయివేటు రంగానికి 7000 కోట్లు కేటాయించింది; సాలీన అభివృద్ధి (1971) కి 6.5 శాతం కావచ్చునని అనుకుంటున్నారు.

మూడవ ప్రణాళికలో కావలసినంత పెరుగుదల లేకపోవటంతో వచ్చే ప్రణాళికలో మరెంత కృషి ప్రయత్నం అవసరం అని ప్లానింగ్ కమిషన్ అంటుంది. ఈవిధంగానే, ''నిరుద్యోగ సమస్య పరిష్కారం, ప్రజలలో జీవనావసరాల విషయంలో అధికోత్కర్ష కలగటం జరుగుతాయి'' ట. ఈ ప్రణాళిక తర్వాత విదేశీద్రవ్య సహాయం రాదేమోననే భయం ప్లానింగ్ కమిషన్‌కి కలిగినట్లు తెలుస్తుంది. ''జరిగినప్పుడే కాని'' నమ్మంటున్నారు . . . . .

కమిషన్ సభ్యులు ఎదురుచూసే 'స్వర్ణయుగం' వారు చూడగలరా ? (అంటే కమిషన్ సభ్యుల జీవితం, అన్నమాట.)

చైనా దురాక్రమణ పుణ్యమా అని ప్రజలు విపరీతమయిన పన్నులు విధించినా వూరుకున్నారు. 'ఎమర్జన్సీ' అనే ''కాగితపు పులి'' (మావో పరిభాషలో !) ఏమీటా ఉపయోగించుకొనవూ లేదు ప్రభుత్వం. ఇక ప్రతిపక్షంవారు విమర్శకి సిద్ధంగా ఉన్నారు.

మార్కెట్టు అప్పులు, 'డెఫిసిట్ ఫయినాన్సింగ్'— ఈవి రెండూ ఒకేరకమయిన ద్రవ్య 'సంపద' కింద జమకట్టాను నేను. ఎందుకంటే, ఈ మార్కెట్టు అప్పుల మూలంగా ద్రవ్యోల్బణ ఎక్కువయిపోయింది. ప్లానింగ్ కమిషన్‌ని ప్రధాన మంత్రి, ''ఉత్పత్తి ఎలా పెంపొందిస్తారో నిష్కర్షగా చెప్పు'' మని అడిగినప్పుడు వాస్తవికంగా ప్రవర్తించారనే చెప్పాలి. ధరలు 1963–64 స్థాయికి తిరిగి దిగుతాయని అయినా ఆశ. ''ధరలు పెరుగుతాయి, పెరుగుతాయి'' అంటూరా అనుకుంటే వారు 'పెసిమిస్టులా' యున్నారు శ్రీ పియర్—పాల్ ష్వెయిట్జర్.

ధరలను పరిశీలిద్దాము. 1961 మార్చి నుంచి 1964 సెప్టెంబరులో ఆహారవస్తువు ధరలు 44.4 శాతం పెరిగాయని ప్లానింగ్ కమిషన్ అంటుంది. చెరుకు ధర కూడా పెరిగింది. వ్యాపారులకి సహాయం ఇస్తున్నారు. దానివల్ల ఉత్పత్తి పెరుగుతుందనుకున్నారు. ఇక 'లేబర్ మినిస్ట్రీ' వారు వేతన సంఘాలని నిర్మిస్తున్నారు. కొన్ని సందర్భాలలో ధరలు అధికంగా ఉంచేసే కాని తగిన పెట్టుబడి సౌకర్యాలు రావని అంగీకరించారు. 'పబ్లిక్ సెక్టార్' సంస్థలలో 12 శాతం లాభాలు (కనీసం) రావాలన్నారు. 1965—66 బడ్జెటు ఎలా ఉంటుంది ? ఎక్సయిజు పన్నులు, ధరలు ఇంకా ఎక్కువ అవుతాయా ? 1966 కి 1963—64 ధరలు తిరిగి వస్తాయా?

ఇక ప్లానింగ్ కమిషన్ వారివద్ద ఒక పెద్ద రహస్యాస్త్రం ఉందిట. ధరల పెరుగుదలవల్ల ఉత్పత్తిదారుల, వ్యాపారుల ఆదాయాలు పెరిగాయి కాబట్టి ఈ ఆదాయాలని 'సేవింగ్స్' గానూ, పెట్టుబడిగానూ మార్చిస్తే తప్ప ఆర్థిక పరిస్థితి చెడిపోతుందని వారు గుర్తించారుట. అంటుకని ఆదాయాలలో వ్యత్యాసాలు తగ్గితే చాలుట. ఇది ఎలా సాధ్యం ? నగరాలలో వ్యక్తుల ఆదాయాలు ఒక పరిమితిని దాటకుండా ఉండేట్లు చూడాలిట. పలుగురు కాబినెట్ మంత్రులు దానిని ఆమోదించినా మిగిలినవారేమో, ఇది కమిషన్ నిర్ణయించవలసిన విషయం కాదని తోసివేశారుట.

అయితే ఇటువంటి విధానాన్ని అమలుపరచటం ఎలాగు, అసలు ? జమీందారీ పద్ధతిని రద్దు చేసినవారు నగరాలలో ఆదాయాల పరిమితులని నిర్ణయించలేరా ? కాని జమీందారీ సంస్థ పూర్తిగా రద్దు అయిందా, అనేది ప్రశ్న.

ఇక ప్రణాళికల అమలు ఎలా జరిగిందో పరిశీలిద్దాము. మొదటి ప్రణాళికలో 65 లక్షల ఎకరాలకి నీటి పారుదల ఏర్పాట్లు జరిగాయిట. కాని వీటిలో 31 లక్షల ఎకరాలకే నిజంగా ఈ ఏర్పాట్లు వాడకం జరిగిందని ప్లానింగ్ కమిషనే చెబుతుంది. రెండవ ప్రణాళికలో 117 లక్షల ఎకరాలకి కావలసిన ఏర్పాట్లు జరిగినా 83 లక్షల ఎకరాలనే సాగుబడి చేశారుట. ఇక మూడవ ప్రణాళికలో 295 లక్షల ఎకరాలు సిద్ధంగా ఉంటాయని ఎదురుచూసినా 228 లక్షల ఎకరాలే నీటిపారుదల సౌకర్యాలని వాడుకున్నాయిట.

పునఃపరిశీలన ద్వారా పై లెక్కలు తప్పని 200 లక్షలకే ఏర్పాట్లు జరగ్గా 160 లక్షలలో సాగుబడి జరిగిందని తెలిసింది.

నాల్గవ ప్రణాళికలో అదనంగా 130 లక్షల ఎకరాలకి తగిన ఏర్పాట్లు చేస్తే 100 లక్షలకే వాడకం ఉంటుందని ఇప్పుడు అనుకుంటున్నారు.



చిన్న తరహా ఆయుధాలకు కావలసిన మందుగుండు సామగ్రిని తయారుచేసేందుకు మహారాష్ట్రలోని వరంగామ్ వద్ద నిర్మించిన కర్మాగారానికి రక్షణమంత్రి శ్రీ వై. బి. చవాన్ అక్టోబర్ 15 వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు.

# న్యూఢిల్లీ లేఖ

వీటన్నిటికీ అయ్యే కర్చు—పాత పథకాలని పూర్తి చేసేందుకు 720 కోట్ల రూపాయులు, కొత్త వాటికి 155 కోట్ల రూపాయులు.

వ్యవసాయంలో అపజయాన్ని ప్లానింగ్ కమిషన్ వారే ఒప్పుకున్నారు. అయినప్పటికీ వ్యవసాయో త్పత్తి ఎక్కువచేసే ప్రయత్నాలు ఎంతవరకు మాత్రం సాగుతున్నాయి ? ఆహారధాన్యాల పంటలకి వాడే భూమి, ఇతర పంటలకి వాడే భూమి అని ఎకరాల సంఖ్యలో తయారవుతూనే వచ్చాయి కానీ పొలాలలో పంటలు మార్చవచ్చునన్న సంగతిని గ్రహించినట్లు కనిపించదు. చెరుకునే ఉదాహరణగా తీసుకుందాము. చెరుకు పండే భూముల వైశాల్యం ఏటేటా పెరుగు తూనే ఉంది. చెరుకుపంట పెరగాలన్న ఉద్యమం ఎవరు ప్రారంభించారు ? దీనికి తోడు చెరుకు ధరలు పెంచటంలో ఇంకా ఎక్కువ చెరుకు వేస్తారు. గోధుమ పండవలసిన నేల చెరుకుకి ఉప యోగించే పరిస్థితులని ప్రోత్సహిస్తున్నారన్నమాట.

రాష్ట్రాలలో కావలసినంత కృషి, ప్రయత్నం జరగడంలేదని ప్రణాళిక సంఘంవారు అంటారు. నగరాలలో స్థిరాస్తులమీద పన్నుల పద్ధతిలో మార్పులు తీసుకురావడం, వ్యవసాయంమీద ఆదా యముమీద పన్నులని మార్చటం మొదలయిన సంస్కారాలు అమలులోకి రావాలంటారు.

గత రెండు ప్రణాళికలని పరిశీలిస్తే వాటి బాధ్యత అంతా కేంద్రం మీదనే ఉన్నట్లు గ్రహించ గలుగుతాము. రాజకీయ కారణాలవల్ల రాష్ట్ర ప్రభుత్వాలు, పైన సూచించిన మార్పులేవీ తీసుకురాలేదు. సరికదా పరోక్షంగా ఎన్నో పన్నులు విధించి ప్రజలకి ఎవరి బాధ్యతో తెలియకుండా ధరలు ఎక్కువ అయేటట్లు చేశారు.

అసలు ప్రణాళిక పథకం అంతా వూహాగానం మీద నిర్మించినట్లు కనిపిస్తుంది. ఉత్పత్తి పెరిగి, ధన సేకరణ పెరగటం, దానివల్ల పెట్టు బడి అధికం అవటం, ఇక పన్నులుకూడా ఎక్కువ అయితే ధరలు పడడం— ఇదంతా జరుగుతుం దని కమిషన్‌వారు వూహించారు. ఏమయినా 21,500 కోట్ల రూపాయల ప్రణాళిక ఖాయం.

మూడవ ప్రణాళికలోనే మన ఆర్థిక వ్యవస్థ పూర్తిగా మారిపోయి, పైపైకి ఎగసి పోగలదని శ్రీ నెహ్రూ ఒకసారి అన్నారు. ఇప్పుడేమో, 1977 దాకా ఆగమంటున్నారు.

ఇంత మంది ప్రజలని ఇంతమంది నాయ కులు బాగా ఏమారుస్తున్నారు.

* * *

కెయిరోలో గొప్ప విజయాలు సాధించామని మన నాయకులు చెప్పుకుంటూనే ఉన్నారు. చైనా వారు ఆఫ్రికాలో తమ పలుకుబడిని పెంచుకుంటూనే ఉన్నారు. కృశ్చేవ్‌ని పంపించేశారు. ఆటంబాంబుని పేల్చారు. నేపాల్‌లో కొడారినుంచి కాట్మండు దాకా రోడ్డు వేస్తారుట. నేపాల్‌లో చైనావారిలో ఎక్కువ మంది గూఢచారులు.

''రోడ్లు వేసే ఇంజనీర్లలో ఎక్కువమంది మిలి టరీ ఇంజనీర్లే'' అని వ్రాసింది బ్రిటిష్ పత్రిక డెయిలీ టెలిగ్రాఫ్ ఒకసారి (16—6—64). ఈ రోడ్ల ఇంజనీర్లు పాటించే నియమాలని పరిశీ లిస్తే నిజమేనని అంగీకరించక తప్పదు.

—శ్రీ కృష్ణ ★







## ఒలింపిక్‌లో భారత్ హాకీ గెలుపు!

ఒక్కసారి మాత్రం యింత వరకూ, ఒలింపిక్స్‌లో బంగారు పతకం పోగొట్టుకున్న భారత్ యీసారి టోక్యోలో పాకిస్తాన్ హాకీ జట్టుతో ఫైనల్స్‌లో పోటీచేసి హోరాహోరీగా సాగిన ఆటలో 1-0 గోలులతో విజయం చూరగొన్నది. భారత్ ప్రతిష్ఠ తిరిగి యీ క్రీడలో నెలకొన్నది.

# దేశవ్యాప్తంగా వెలిగే పండుగ దీపావళి!

## దీపాలు వెలిగించండి!

"ఎన్ని దీపాలు వెలిగించినా యీ సారి లోపలి చీకట్లు తొలిగేలా లేదు. శీతాహ వాతావరణం మధ్య ప్రజలు ఉత్సాహం పుంజుకుని కనుల చల్లని కాంతుల నింపుకునేలా ప్రమిదల్లో చమురునింపి మెత్తని జ్యోతులు వెలిగించండి. ఎన్ని తరాలుగానో వొస్తున్న దీపావళి రానురాను బాణసంచాల చప్పుళ్లకు విద్యుత్ దీపాల తోరణాలకు అంకితమైపోతోంది. [చైనాకుందేలు టాటాకుల శబ్దాలకి బెదరదు] ఆవేశ కావేషాల-తారాజువ్వలపోరాటాలకి పతాక సన్నివేశంగా దీపావళి అమ వాశ్యను మళ్లీ అమవాశ్య దాకా జ్ఞాపకం వుంచుకునేలా చేయకండి!

దీపాలను వెలిగించి ప్రశాంత కాంతులతో; పసిపాపలు వెలిగించే మెత్తని బాణసంచాలతోనే ఎక్కువగా దీపావళిని సార్థకం చెయ్యండి!" అంటే ఎవరు వింటారు యీ మాటలు. 'బొట్'లు 'ఆటమ్' బాంబులు పేలుస్తారు- జువ్వలు సిసింద్రీలు తగలేసి వదిలేస్తారు!

కాని ఈసారి ఎవరికీ దీపాల పండుగకి ఎక్కువ దండగ చెయ్యకండని చెప్పనక్కర్లేదనుకుంటాను. పండుగముందు చెవుల్లో 'ధన్ ధన్' మని పలికే సందడి అంత యెక్కువగా వినిపించడం లేదు. దైనందిన జీవిత సమస్యలు పేకలమీద సవారీ చేస్తూంటే పండుగ కళ సవరూ పట్టించుకునేలా లేరు.

చైనావాడు అటంబాంబ్ పేల్చాడు. హెచ్. బాంబ్ కూడా చేస్తాడట—రెండేళ్ళ క్రితం ఈ చైనా వాడు ఎదురొచ్చినందునే దీపావళి పండుగ తగు మాత్రంగా జరుపుకోవాలనే విలితి పెద్దల దగ్గ ర్నించి వచ్చింది. ఇప్పుడు ఉండిగించిన నేటలో సామాన్య మానవుడు మామూలుగానే అటంబాంబ్ లను బహిష్కరించేటట్లే ఉన్నాడు.



"కాస్త నవ్వండోయ్! బాగుంటారూ!"

## కృష్ణుడూ! సత్యభామా!

నరకాసురుడు దీపాలు పెట్టుకోకూడదనేవాడు గావోలు—వాణ్ణి కృష్ణుడు సత్యభామా సమేతుడై సంహరించిన రోజున జనం 'స్నానం చేసేసి' దీపాలు పెట్టుకున్నారు. 'బాణసంచా' కాల్చడం అప్పుడే వొచ్చిందో దరిమిలాను వచ్చిందోగాని— నెల రోజులు ముందుగా—అటు తర్వాత మరో నెల



# తారాజువ్వల పోరాటాలు: సిసింద్రీల చిందులు!

రోజులుదాకా, రోలూ—రోకలిచప్పుళ్ళూ, టపాకాయల చప్పుళ్ళూ వినిపిస్తూ ఉండటమే దీపావళి ప్రత్యేక విశేషం—నగరాల్లో ఈమధ్య వొత్తిముక్కు నలిపి చమురు పోసి దీపాలు వెలిగించడం కన్నా—చిన్న చిన్న బల్బులు తోరణాలుగా వ్రేలాడదీసి స్విచ్ నొక్కి నెలాఖరున ఎలక్ట్రిసిటీ బిల్ ఎక్కువగా చెల్లిస్తున్నారు.

బొమ్మలు, వాళ్ళ వెనుక పెళ్ళిగాని బొమ్మలు, పత్తి నలిపి వొత్తులు చెయ్యడం కథల్లో ఎక్కువ మంది రాసుకుంటున్నారు. దీపావళి పండుగ ఒక్కటే కాదు సాధారణంగా పండుగల రూపగుణాదులు, అధునికమైన స్థితిగతుల కనుగుణంగా మారిపోతున్నాయి. వీటి చరిత్రను చెప్పడంతో ప్రతిసారి వ్యాసాలు తయారవుతున్నాయి.

దీపావళి పిల్లల పండుగ అంటారు, పెద్దలు పిల్లల్లాగ ప్రవర్తిస్తా రంటారు. దీపావళి అమావాస్యనాడు బాణాసంచా కాల్చడం విషయంలో పిల్లలు పెద్దల్లాగ, పెద్దలు పిల్లల్లాగ "అమ్మో" మంటూ మర్నాడు ఆఫీసు ఉందంటూ బెదరడం కద్దు.

నరకాసురుణ్ణిచంపిన రోజుకి [ఐదో] నాలుగోరోజు నాడు నాగులచవితి అంటారు. పుట్టలోను, ఆ మిగిలినవి పెట్టెలోను పాలు పోసుకుంటారు. పట్నాల్లో పుట్టలు వెతుక్కుంటూ వెళ్ళేవాళ్ళ అవస్థలు రకరకాలుగా ఉంటాయి! కొందరికి పుట్టలో పాలు పోయడం ఆనవాయితీ కాదు—అచ్చిరాదు—వాళ్ళకి ఇంట్లో గిద్దెకట్టి పాలు పొయ్యడం అలవాటు—బహుశా యిది పుణ్యం—పాలూ, రెండూ దక్కే ఆచారం—

## దిబ్బు దిబ్బూ!

దీపావళికి చమురుపోసి వెలిగించే జ్యోతుల్లో ఉన్న స్నిగ్ధప్రశాంతసౌందర్యం మధ్య తరగతి కుటుంబాలవాళ్ళు ఉన్న వీధుల్లోను—గ్రామాల్లోను ఆ సాయంకాలం తటస్థపడతాయి—బాణసంచా తగలెట్టడం ఆరంభమయ్యాక వీటికి నూరేళ్ళు నిండతాయి. దివ్వె కొట్టి తీపి తింటేగాని మతాబా అగ్గిపుల్ల గూడా గియ్యకూడదు— కప్పగెంతు కూడా వేలు వెయ్యకూడదు— అంటూ తల్లులు పిల్లల్ని హెచ్చరిస్తూ ఉంటారు. ఉదయంనించీ తులసికోట దగ్గరా గుమ్మాలమీదా గోడలమీద పేర్చిన దీపావళి—కనీసం అరగంటసేపైనా కళకళ లాడాలనే తాపత్రయంతో తల్లులు, అక్కలు, ఈ 'అంక్ష' ను ఏడుగంటలదాకా కొనసాగిస్తారు—

ఈ రభస అయ్యేసరికి ఈ తరహా దీపావళి ముగుస్తుంది. ఆ తర్వాత పేటల్లోను—వీధుల్లో—కళాసేవ 'పేరిట' 'విధు' లా, 'సేకరణలా' చేసే జబ్బపుష్టిగల సజ్జు కొందరు తూటాలు, జువ్వలు, పట్టుకుని రెండు వేపులా నరకాసుర బృందమేనా అన్నట్లు తలపడతారు—మర్నాడు ఉదయం లెక్కెడితే వేలకొద్ది కాలిన జువ్వలు— వెయ్యి జువ్వలకి ఒక్కడేనా లెక్కన ఆస్పత్రిలో జవ్వానురాలు మిగులుతారు.

దీపావళి నాగులచవితి తర్వాత శబ్దరూపంలో సన్నగిలుతూ వొచ్చినా దీపాల రూపంలో కార్తీక పౌర్ణమిదాకా బాగా కళకళ్ళాడుతూ అగుపిస్తుంది.

మిగతా పండుగలకన్నా, సంబరాలకన్నా దీపావళి చాటున ప్రమాదాలు ఎక్కువ దాక్కుంటాయి. ప్రమిదలు, ప్రమదలు ప్రమోదాలూకూడా వుంటాయి అనుకోండి.

నైలెక్స్, టెరిలీనులు, విప్పులుచూస్తే మండుతామంటాయి— అమ్మాయిల వొంటిమీద నైలెక్సులా నైలాన్లు తప్ప— మరేవీ నిలవనటుంటున్నాయి. 'ఎత్తుకుంటే ఏడుమల్లెలెత్తు తూగుతావనే అమ్మాయిలు సాధారణంగా 'అలక విషయం' లోనే సత్యభామలు— రోడ్డుమధ్య వీళ్ళు నడుస్తూ ఉంటే ఏ బడ్డీ కిళ్ళీ దుకాణంలోనో నరకాసురులు పొంచి ఉండి సిసింద్రీని సంధిస్తారు— ఈ సత్యభామల్ని "ఏవిల్లంది" లేక రిక్షాలోనో మరోదాంట్లోనో పారిపోతారు—

దీపావళి పండుగ ప్రత్యేకంగా బాణసంచాకి పెట్టింది పేరుగా తెలుగునాట చేసుకున్నా, కొత్త బట్టలు కొనుక్కునే పండుగగా కూడా ఉంది—గుజరాతీలకు మాత్రం యిది లక్ష్మీపూజ పండుగ—గజలక్ష్మినే వాళ్ళు చాలా బ్రహ్మాండంగా పూజ చేస్తారు. మా "యింట్లో మోకాళ్ళ విరిగి పడిపోవాల" ని లక్ష్మీదేవిని ప్రార్థిస్తారని వినికిడి—

యావత్ భారతదేశానికి ప్రాంతీయభేదంలేని ఈ పండుగలోని విశేష మేమంటే—దేశవ్యాప్తంగా 'పండగ దండగ' అందరూ పంచుకోడం.

—వి. కృష్ణానంద్ ★



"ఇంటింట ఆనంద దీపావళి మా యింట ముత్యాల దీపావళి"

ఫొటోలు: ఎన్. రామకృష్ణ



# నేనూ -

## నేనూ నా బొమ్మలూ!

నాకు చిన్నప్పట్నుండీ బొమ్మలన్నా, బొమ్మలకొలువు పెట్టడమన్నా, బొమ్మల పెళ్ళిళ్ళు చేయడమన్నా చాలా సరదా! ఈ సరదా ప్రతి ఆడపిల్లకూ వుంటుంది, కాదనను... అయినా కొందరు ఆడవాళ్ళకు చిన్నప్పుడు వుండే యీ సరదా కాస్త పెద్దవాళ్ళవుతూనే సన్నగిల్లి, పెళ్ళి కాగానే వెనకబడిపోయి, పిల్లలు పుట్టగానే మూలబడుతుంది.



తన బొమ్మలకొలువులో తను...

### భానుమతి

ఇక వాళ్ళకా సరదా అజ్ఞాతంగానైనా ఏమూలో దాగివుంటే ఎవరింట్లోనన్నా కొలువు పెట్టారనగానే పేరంటానికైనా వచ్చి తనివితీరా కొలువు చూసి సరదా తీర్చుకుని తృప్తిపడతారు.....అది పిల్లలు సరిగా చూడనిస్తే—

''అబ్బ నాకూ కొలువు పెడదామని ఉంటుంది గానండి, ఈ పిల్లల్తో వేగ్గ కష్టమండీ. మా పెద్దాడున్నాడే వాడు బొమ్మ కనిపిస్తే చాలు, ముందు దాని కాళ్ళు విరగ్గొడతాడు. మా రెండోవాడు చేతులు విరిచేస్తాడు. ఇహ మా చంటాడు [illegible] దాని తల విరిచి అవతల పారేస్తాడు. ఇంక బొమ్మలెం బ్రతుకుతాయి చెప్పండి!—'' అంటుంది ఆ ఇల్లాలు......

## పిల్లల అల్లర్లు...!

ఈ లెక్కలో మనుషులే బ్రతకలేకున్నారు మరి... కాళ్ళూ, చేతులూ, తలా పొయ్యాక ఇంకేం బొమ్మ!.. ఇంకేం కొలువు!..... మనం చూట్టానికుండా [illegible] అవి వూరుకోవడం మంచిది........ఇంతెందుకూ! మొన్న మా కొత్త కోడలు కొలువు పెట్టాలని సరదా పడుతోందని మా పెద్దాడు బజారెళ్ళి అమెరికానుంచి వచ్చిన కార్లటు, విమానాలటు, మ్యూజిక్ బొమ్మలటు ఏవేవో చాలా ఖరీదులుపెట్టి తెచ్చాడు కొలువు పెడదామని..... మా చిన్న వెధవ ఏం చేశాడో తెలుసా!.... పెద్దాడింట్లో లేని సమయం చూసి వాడిష్టం వచ్చినట్లు వాటన్నిటికీ కీ తిప్పి తిప్పి అవన్నీ విరిగిందాకా తిప్పాడు.....

దాంతో అవన్నీ పూర్తిగా చెడ్డాయి. పెద్దాడొస్తే తిట్టి తంతాడనే భయంతో 'నేను మెకానిక్కుని, రిపేరు చేస్తా'నంటూ అన్నీ శుభ్రంగా ఏ పార్టు కాపార్టు వూడదీసి పెట్టాడు. మెకానిక్కు లేదూ పాడూ లేదు........ మళ్ళీ దేనికది అతికించడం రాక నానా గందరగోళం చేసి గుట్టగా పెట్టాడక్కడ ఉంది.— తీరా కొలువుపెట్టే సమయానికి మా వాడు అన్నీ బయటపెడితే ఏముంది! ఏకీలు కాకీలు వూడి కిందపట్టం మొదలెట్టాయి........ ఆ సమయంలో చిన్న వెధవ ఆ ప్రాంతాల్లో కనిపిస్తే వాడి కీళ్ళూ విరిగేవే— కాని వాడెందుకు కనిపిస్తాడు! మా అక్కగారింటికెళ్ళి మూడు రోజులదాకా ఇంటి ఛాయలకు రాలా.....ఇలా ఉంటాయి మన పిల్లల్తో కొలువులు.....'' అన్నదొకావిడ.. కాని నాకేమో పిల్లలకీ, బొమ్మల సరదాకీ సమ్బంధం లేదనిపిస్తుంది... నాకూ డజనుమంది పిల్లలున్నా నేను బొమ్మల కొలువు పెట్టకుండా ఉండలేనేమో అనికూడా అనిపిస్తుంది...ఎందుకంటే పిల్లల్తోనూ గంపెడు ఇంటి చాకిరీతోనూ సతమతమయ్యే ఆడవారికీ నాకూ ఏమీ తేడాలేదు. నేను ప్రొద్దున్న లేచింది మొదలు అష్టావధానం, కొన్ని సమయాల్లో శతావధానంకూడా చేస్తుంటాను...... ఎన్ని పనులున్నా ఎంత వోపికలేకపోయినా బొమ్మలనేసరికి చిన్నపిల్లలా సరదాపడిపోతుంటాను. దసరా ఇంకా నెల రోజులుండగానే పక్కనే ఉన్న మా స్టూడియో పనివాళ్ళను పిలిపించి కొలువుకు కావలసిన ఏర్పాట్లన్నీ చెప్పేస్తాను. ఆ తర్వాత నా బుర్రలో నేను వూహించుకొన్నట్లు కొలువంతా తీర్చిదిద్దుకోడానికి కనీసం పదిరోజులైనా పడుతుంది.

## స్టూడియోకు శలవు!

ఈ పదిరోజుల్లో ఎవరైనా షూటింగ్ పెట్టుకుంటే సాధ్యమైనంతవరకూ ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తాను. ఇక వీలులేకపోతే మేకప్ వేసుకుని, బడికి వెళ్ళినట్లు వెళ్ళొస్తు కుంటూ వెడతాను.........నా అవస్థ కనిపెట్టి మా పెద్దోళ్ళు నవ్వుకుంటూ ''అక్కయ్యా! బడి కెళుతున్నావా! పాపం అవ్వలేనన్నమాట...పోని కడుపు నొప్పనో, తల నొప్పనో మానెయ్యకపోయావా'' అంటూ గోలచేస్తారు......అసలు కడుపు నొప్పి, తల నొప్పి ఎవరూ కనుక్కోలేని వ్యాధులు.....సాధారణంగా ఈ రెండు వ్యాధులూ వాళ్ళకి రెండుసార్లయినా మా ప్రొడ్యూసర్లకు వస్తుంటాయి...ఎదురుపడి చెప్పకుండా టెలిఫోన్‌లోనే సెలవు తీసుకుంటారు. మనిషి ఎదుట ఉండి కడుపునొప్పి అంటేనే కనిపెట్టలేని వ్యాధి అది టెలిఫోన్‌లో కనిపిస్తుందా!.... అలాగే నేనూ ఓ టెలిఫోన్ చేసేస్తే!—వా.... వాళ్ళతో నేనూ అబద్ధాలాడితే ఏం బావుంటుంది!. పోని నిజం చెప్పేస్తాను— ''అయ్యా నేను బొమ్మల కొలువు పెట్టుకోవాలి. దయచేసి పదిరోజులపాటు నాకు షూటింగులు ఏమీ పెట్టకండి'' అని— అన్నా ఈ కాలంలో నిజంచెప్తే ఎవరికీ అర్థంకాదు. ''అయ్యబాబోయ్!.... చచ్చిపోతామండి ఫలానావారికి డింగీ ఫీవరొచ్చినా ఈ రోజే గంజి తీసుకుని సరాసరి మన షూటింగుకొచ్చాడు. ఫలానావారు రేపు వూరి కెళ్ళిపోతారు....ఫలానావారి కాల్‌షీట్లు ఇవ్వాళ వరకే మీరు రాకపోతే ఈ రోజు మానివి...'' అంటూ బాధపడుతుంటారు. ఏం చేస్తాం. తప్పనిసరి...బడి కెళ్ళాల్సిందే...తమాషా ఏమిటంటే అన్నిరోజులూ పూర్తిగా ఉండి నా బొమ్మల కొలువు సమయానికి అందరూ షూటింగంటూ కొంపలంటుకున్నట్లు వస్తారు ఒక్కొక్కడిగా. ప్రతి సంవత్సరం నేను

# నా బొమ్మలూ !



శివ సాన్నిధ్యం లో....

## నేనూ నా బొమ్మలూ !

**రామకృష్ణ**

పెట్టే కొలువులో ఏదో కొత్తదనం తీసుకురావడం నాకు చాలా సరదా.... ఈ సంవత్సరం నేను పెట్టిన కొలువు మద్రాసులో పెద్దపెద్ద ఇండ్ల వాళ్ళందరు పెట్టిన కొలువులకంటే చాలాచాలా బావుందనీ "ది బెస్ట్" అని అంతా ఏకగ్రీవంగా మెచ్చుకున్నారు. అబ్బ! ఎంత సంతోషం! ఫలానా పిక్చర్లో వీరు బాగా యాక్టు చేశారన్నా అంత సంతోషపడతానా అని అనుమానం. నేను స్వయంగా నా చేతుల్తో సృష్టించిన ఒక శిల్పం చూసి అందరూ బావుందని మెచ్చుకుంటే అంతకంటె ఆనందించాల్సిన విషయం ఏముంది!

"నీకెంత ఓపికమ్మా" "అయినా, ఇన్ని పనులుండి ఆవిడ సరదా చూడూ!" "ఎంత కొత్త కొత్త అయిడియాస్ వస్తాయో ఆవిడకి!".... అంటూ అమ్మలక్కల అభినందనలు......" "అసలు ఈ సరదా ఆవిడకి చిన్నప్పట్నించీ ఉండి ఉండాలి" అంటూ ఒకావిడ "అవును లేకపోతే ఇది ఈనాటి సరదాకాదు—" ఈనాడు చిన్నపిల్లను చూసి అనుకరించి చాలామంది కొలువులు పెడుతున్నారు సినిమా జీవులు. నా చిన్నప్పటినుంచి నాలో బొమ్మ లంటే, బొమ్మల పెళ్ళిళ్ళంటే బొమ్మల కొలువంటే ఉన్న ఉత్సాహం ఈనాటికి చెక్కుచెదరకుండా ఉండడమే కారణం..

### ధర్మపత్ని: బొమ్మలపెళ్లి....!

నా చిన్నాలుగో ఏట 'ధర్మపత్ని' అనే చిత్రంలో నటించడానికి మా నాన్నగారు మమ్మల్ని సకుటుంబంగా తరలించుకుని కొల్హాపూరు వెళ్ళా. ఆ వూరు చివరనున్న లాడ్జిలో మా మకాం....చుట్టు కొండలూ, మా లాడ్జిముందు పెద్ద చెరువు, ఆ చెరువు గట్టుమీద మామిడి చెట్లు, దిగువ మర్రి చెట్లూ కనుచూపుమేరకు పచ్చికబయళ్లూ ఎంతో ప్రశాంతంగా ఉండే ఆ వాతావరణంలో మేం ఎన్ని బొమ్మల పెళ్లిళ్లు చేశామో ! చెప్పలేను...అంతకు ముందే ఆ చిత్రంలో నటించడానికి వెళ్ళిన నటీ నటుల కుమార్తెలు ఇంచుమించు నా యీడు వాండ్లు నాకు స్నేహం అయినారు. అక్కడికి వెళ్లిన కొద్ది రోజుల్లోనే ఇంక ఆ మర్రి వూడల ఉయ్యాలలు వూగడం మామిడికాయలు ఒడికి కోసుకోవడం బొమ్మల పెండ్లిండ్లు చేయడం తప్పితే ఆ ధర్మపత్ని పిక్చర్లో ఏం పనిచేశానో ఏం వేషం వేశానో నాకు గుర్తులేదు. అదంతా మా నాన్నగారికే తెలుసు; అప్పట్లో నేను మాత్రం ఎన్ని బొమ్మలపెండ్లిండ్లు చేశానో గుర్తు చేసుకోగలను..

ఒకరోజు 'ధర్మపత్ని' డైరెక్టరు పి. పుల్లయ్య గారు ఆ పూట నాతో ఏదో ఒక షాటు మిగిలిపోయిందని, నేనూ మా స్నేహితురాండ్లూ ముమ్మరంగా బొమ్మలపెండ్లి చేస్తున్న సమయంలో మా నాన్నగారిని వెంటబెట్టుకొచ్చారు నన్ను మేకప్ వేసుకోమని అడగడానికి....

"అమ్మాయ్ ! మంచిదానివికదూ బంగారు తల్లివి....మళ్లీ వచ్చి బొమ్మల పెళ్లి చెయ్యొచ్చు ఒకే ఒక షాట్ తీసి పంపించేస్తాను." అంటూ బతిమాలారు పాపం....ఊహూ.... మానాన్నగారు చుట్ట కాల్చుకుంటూ నవ్వుతూ నిలబడ్డారు...."మీరైనా చెప్పండి!"— అంటూ మా నాన్నగార్ని అడిగారు పుల్లయ్యగారు.

### ఈ బంధమేనాటిదో...

"లాభంలేదు అమ్మాయికి ఇష్టంలేని పని దానిచేత చేయించలేం....మా అమ్మాయి స్వభావం నాకు తెలుసు కాబట్టే నే ముందే చెప్పాను...ఈ రోజు ఆ బొమ్మలు విడిచిపెట్టిరాదు. చూడండి మీరు కావాలంటే"....అని చెప్పేశారు మా నాన్నగారు...

"అబ్బా !.....భలే పెంకెండీ !.... బొమ్మలంటే ఇంత సరదా అనుకోలేదు !!" అంటూ పుల్లయ్య గారు వెళ్తుంటే మా బొమ్మలపెళ్లికి చేసిన లడ్డూలు ఆయన చేతికి అందించాం.... తింటూ పోతాడు కనీసం తిడుతూ పోకుండా అని. ఆ తర్వాత ఇంకెప్పుడూ నన్నడక్కుండా నా మాట తీసుకో కుండా నా బొమ్మలపెళ్లి కాల్షీట్లు ఎప్పుడో తెలుసుకోకుండా పుల్లయ్యగారు షూటింగ్ పెట్టు కోలేదు. పొరపాట్న బొమ్మలపెళ్లిగాని కొలువుగాని ఉన్నరోజు షూటింగు పెడితే కేన్సల్....అంతే అప్పటికీ ఇప్పటికీకూడా....కాకపోతే చిన్నప్పటి ఆ మూర్ఖపు పట్టుదల లేదు అంతే...కాని నాకు బొమ్మల సరదా మాత్రం ఆ నాటికీ ఈనాటికీ బహుశా ఏనాటికీగూడా ఒకే విధంగా ఉంటుందేమో! ఈనాటి ఈ బంధమేనాటిదోగా—ఆ మూగ బొమ్మలకూ, నాకూ ఏనాటి బంధమో !..... ★



బొమ్మలకొలువులో భరణేస్టూడియో

ఫొటోలు : ప్రభాకర్

# పూర్వ జన్మఫలం అమెరికన్ ఎన్నికలు



గోల్డ్‌వాటర్ నెగ్గడా ?



కెన్నెడీ వారసుడా ?

ఇటీవలే ఒక బొంబాయి దినపత్రికలో వార్త ఒకటి వెలువడింది— వాషింగ్‌టన్ పోస్ట్ పత్రిక విలేఖరి శ్రీ సెలిగ్ హారిసన్ ఢిల్లీ, బిర్లా దేవాలయం పూజారి శ్రీ గోస్వామి ద్వారా కొన్ని విషయాలు తెలుసుకున్నాడుట; పోయిన జన్మలో లిండన్ జాన్సన్ గంగానదీ తీరం వద్ద అడవిలో సన్యాసిగా తిరుగుతూ చేసిన పుణ్య కార్యాలవల్లనే అమెరికాలో మళ్లీ పుట్టి రాజయోగానికి అర్హుడయ్యాడుట ! వాషింగ్‌టన్ పోస్టు పత్రికలో శ్రీ జాన్సన్ జాతకంతో బాటు పెద్ద వ్యాఖ్య ఒకటి పడిందిట.

దాని సారాంశం, జాన్సన్ ఎన్నికలని నెగ్గగలడనీ— దీనికి గ్రహాల సాయం లేకపోలేదు!— గోల్డ్‌వాటర్ ఓడిపోగలడనీ, అపజయంతో బాటు ఆయనకు మతి స్థిమితం కూడా తగ్గవచ్చుననీ......

ఈ మాత్రానికి జోస్యమెందుకని ప్రశ్నించవచ్చు! జాన్సన్ ఆరితేరిన రాజకీయవేత్త. డెమోక్రాటిక్ పార్టీ మీద బాగా అధికారం చెలాయించగలిగే హోదాలో ఉన్నాడు. అంతేకాక, ఎన్నిక ఉద్యమం చాకచక్యంతో నడుపుకుంటూ వస్తున్నాడు. గెలవడం అంత వీలుకాని పని ఎందుకు కావాలి ?

ఇక గోల్డ్‌వాటర్ సంగతి. ఆయన విధానాలేమిటో, నియమాలేమిటో తెలుసుకోవటం, కష్టం. రిపబ్లికన్ పార్టీ 'నాయకు'డే కాని నీగ్రోల 'సివిల్ రైట్స్' బిల్ విషయంలో వారికి అనుగుణంగా ఉన్నట్లు కనిపించడు, బెదిరిస్తే రష్యా 'దారిలోకి రాగల'దనే సిద్ధాంతాలని గొంతెత్తి చెప్తాడు; వియత్నాంలో ఇంకా 'గట్టిగా' ప్రవర్తించాలని గోల్డ్‌వాటర్ అభిప్రాయం. ఒక ప్రఖ్యాత వ్యాఖ్యాత చెప్పినట్లు ఎవరికి, దేనిమీద, ఎటువంటి ద్వేషం ఉన్నా వారి ద్వేషానికి అనుగుణంగా జాతీయ విధానాలని అనుసరించ పోతున్నానని ప్రచారం చేస్తున్నాడు బారీ గోల్డ్‌వాటర్.

గోల్డ్‌వాటర్ నిజంగా తను చెప్పేవన్నీ నమ్ముతున్నాడా ? ఈ ప్రశ్నకి సరయిన సమాధానం చెప్పటం కష్టం! ఇటీవల ఒక అమెరికన్ పత్రిక ఆతని మానసిక స్థితి సంతృప్తికరంగా లేదని కొందరు మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెప్పారని ప్రకటించిందిట. ఇది కేవలం బాధ్యతారహితమయిన వ్యాఖ్య అనిపిస్తుంది. గోల్డ్‌వాటర్‌కి రాజకీయానుభవం తక్కువ అవవచ్చు, కాని పిచ్చివాడంటే నమ్మ తగ్గదికాదు. (మన దేశంలోనూ విపరీతంగా వాదించే వారికి కొదువలేదు. అటంబాంబు తయారు చెయ్యాలనే వారూ, భారత దేశాన్ని 'హైందవ దేశం'గా మార్చాలనే వారూ, ఇక్కడి మహమ్మదీయులూ, క్రైస్తవులూ పేర్లు మార్చుకుని హిందువులని పిలువునంత అనుకరించాలనే వారూ— ఇంకా ఎన్నో వింత ప్రతిపాదనలు చేసేవారు ఉన్నారు !)

## గోల్డ్‌వాటర్ వస్తే గిస్తే...

గోల్డ్‌వాటర్ అధ్యక్షుడుగా ఎన్నిక అయితే 'తన విధానా'లని అనుసరిస్తాడా ? అసలు అధ్యక్షుడుగా ఎన్నిక అయితేనే ఈ సమస్య ఉదయిస్తుంది ! ఢిల్లీ పూజారిగారు ఆయన గ్రహస్థితి బాగా లేదంటున్నారు; ప్రజలూ, ఉపరాజకీయ నాయకులూ ఆయన ధోరణిని అసహ్యించుకుంటున్నారనే అభిప్రాయానికి నిదర్శనలు వార్తా పత్రికలలో వస్తూనే ఉన్నాయి.

కాని, క్రుశ్చేవ్ నిష్క్రమణ, చైనా అటంబాంబు —ఇవి రెండూ అమెరికాలో 'తీవ్రవాదుల'కి బలం చేకూరుస్తాయని అంగీకరించక తప్పదు; ప్రజాబాహుళ్యంలో అభిప్రాయాలు ఎలా మారుతాయో పత్రిక పాఠకుల చేతులోకి వచ్చేసరికి తెలిసిపోతుంది. ఈ సందర్భంలో నయినా జన్మ సిద్ధాంతాలు పనిచేస్తాయని ఆశించాలి !

—వి. ఎస్. ఆర్. ★

**మార్గశిర మాసం: మధ్యాహ్న భోజనాలయ్యాయి. యథా ప్రకారం శ్రావ్య గంభీరమైన కంఠమెత్తి గోపాలకృష్ణయ్యగారు భాగవతంలోని దశమ స్కంధం చదువుతున్నారు.**

ధర్మపత్ని పార్వతమ్మ ఎదురుగా కూర్చొని, పద్యం, అర్థం, వ్యాఖ్యానం కుతూహలంతో వింటున్నది. బాలకృష్ణుడు చేసే వింత చేష్టల్ని మరింత రసవంతంగా వివరించి చెబుతుంటే నోరు తెరచి దవడలు నొక్కుకుంటూ "అయ్యో సిగ్గు" 'సడిపోయింది' 'భగవంతుడు గనక చెల్లిందమ్మా'! అంటూ మరీ ఇదిగా విస్తుపోతున్నది. ఆమె ఆశ్చర్యపోయే కొలదీ గోపాల కృష్ణయ్యగారు వ్యాసుణ్ణి పోతున్ననూ మించి వ్యాఖ్యాన గానం చేస్తున్నారు.

"మహానుభావుడు. చిన్నతనం నుంచీ లీలలు చూపిస్తున్నాడు" అంది పార్వతమ్మ మురిసిపోతూ.

"అవున్లే— భాగవతంలో కృష్ణుడు ఎన్ని కాని పనులు చేసినా మురిసిపోతావు గాని, మన ఇంట్లో కృష్ణుడు కొంచెం అల్లరిచేస్తే విసిగి పోతావుకదా!"

"అయితే, ఆయన భగవంతుడు గనక చెల్లుతుంది."

"ఒసే, బుల్లీ! కేవలం ఆ కృష్ణుడికే కాదే పిల్లలందరికీ అల్లరి చక్కగా చెల్లుతుంది. నిజం చెప్పాలంటే అల్లరి చెయ్యని పిల్లలు పిల్లలేకారు. మట్టి ముద్దలు. అల్లరి చేసే వయస్సులో అల్లరి చేయని పిల్లల్లో ఏదో లోపం అనారోగ్యం ఉందని వేరే చెప్పనక్కర్లేదు— అల్లరి చెయ్యమంటే నువ్వు చేయగలవా ఇప్పుడు?"

"అల్లరి మీద మీకంత మోజైతే, మీరూ మనవడితో చేతులు కలిపి 'తై' మని గెంతరాదుటండీ" అంది పార్వతమ్మ ఎగతాళిగా.

"నాకు మాత్రం నిజానికలాగే గెంతాలని ఉంది. వాడిలా గెంతుతూ కేరింత లాడుతూ ఆకతాయిలా తిరగాలనీ, చివరికి తిరపతమ్మ జామి చెట్టెక్కి కాయలు కోసుకొని— తిరపతమ్మ తిట్లతో నంజుకొని తినాలనీ ఉంది. కాని ఓపిక ఏదీ— ఉత్సాహం అయితే ఉంది గానీ"

"ఓపిక ఉంటే మీరూ. . . ."

"అః నిక్షేపంలాగ. ఈ కాలచక్రం ఒకసారి అరవై ఏళ్లు వెనక్కి తిరిగిపోతే ఎంత బావుండును? నా కప్పుడు మళ్లీ ఎనిమిదేళ్ళు. వూరూ, వాడా చెట్టూ, చేమా బలాదూరు తిరక్క పోయే వాణ్ణా? అయితే ఆ రోజులు మరి రావు" నిరుత్సాహం వ్యక్తపరిచారు గోపాలకృష్ణయ్య గారు.

పార్వతమ్మ ఏదో అనబోతూ ఉరిమినట్లు ఉలిక్కిపడింది. అది ఉరుము కాదనీ— తన జామి చెట్టెక్కి కాయలు కోసేస్తున్న పిల్లల్ని తిరపతమ్మ తిట్టే తిట్లనీ మరుక్షణంలోనే గ్రహించ గలిగింది.

గోపాల కృష్ణయ్యగారు తన్మయులై వింటున్నారు. తిరపతమ్మ కంఠం సగారాలా మోగుతోంది. తిరపతమ్మ జామిచెట్టు మొదటి కొచ్చి రెండు చేతులూ చెట్టుమీద ఉన్న పిల్లల వైపు చాచుతూ దింపుతూ అనర్గళధారతో ప్రారంభించింది. "అమ్మ! చచ్చినోళ్లోయ్. మీ జిమ్మలడి పోనోయ్. మిమ్మల్ని పెద్దమ్మోరెత్తుకుపోనూ. మీకాళ్లూ చేతులూ ఇరిగిపోనూ, మీ అమ్మ కడుపులు కాలిపోనూ!" వీరావేశంతో పెనుగాలికి వూగిపోయే పోక మొక్కలా వూగి పోతోంది తిరపతమ్మ. జుట్టు ముడి వూడి పోయింది. పైట జారిపోయింది. వళ్లంతా చెమట పట్టింది. వూపిరి అందనంతగా ఆయాసం వచ్చింది. అయినా మళ్లీ ప్రారంభించింది.

"నా జాం చెట్టంతా దిబ్బ చేసేత్తన్నారల్లోయి నా ఇల్లు గుల్ల చేసేత్తన్నారు బాబోయ్. నన్ను నిలబణ్ణిచ్చి పట్టట్టు లేరయ్యోయ్.. నన్నిలాగ ఏడిపించేత్తన్నారు మీరెప్పుడీగడ్డ పోతార్రోయ్. మీ కొంపలు కూలిపోనూ, మిమ్మల్ని మరిడమ్మ మింగెయ్య, మిమ్మల్ని గోతిలో పాతెయ్యా, మీ తలలు చెక్కలై పోనూ" వూపి రాగింది. మాట రాలేదు. విస్తుత్తువగా చతికిల బడింది. నెత్తి బాదుకొంది. కడకు ఏదీ చెయ్యలేక చెట్టుపై నున్న పిల్లల వంక కసిగా చూడ సాగింది. తిరపతమ్మ — పాపం విస్మయురాలు!

**మొదటి బహుమతి పొందిన కథ**

ఇంత రభస జరిగినా చెట్టు మీదున్న పిల్లలైదుగురిలో ఒక్కడూ చెట్టు దిగలేదు. కించెత్తు చలించలేదు. పకపక నవ్వుతూన్నారు. అందినంత వరకు జామికాయలు కోసేస్తున్నారు. పిందెలు నమిలి పిప్పిని తిరపతమ్మ మీద వూస్తున్నారు. సగం కొరికిన కాయలతో ఆమెను కొడుతున్నారు. అయినా ఆమె సాక్షాత్తు శిలా ప్రతిమలా కూర్చొని ఉంది. కళ్లు మాత్రం కసిని క్రక్కుతూనే ఉన్నాయి.

అక్కడ గోపాల కృష్ణయ్యగారు అర్ధనిమీలిత నేత్రాలతో — ఆనంద పారవశ్యంతో పైమరచి తిరపతమ్మ తిట్లు వింటున్నారు. కాని పార్వతమ్మ ఇక సహించలేక పోయింది. లేచి వెళ్లి దొడ్డి గుమ్మంలో నిలబడి చూచింది. జామిచెట్టు మీద ఐదు కోతులూ కనుపిస్తున్నాయి. గోడ కవతల నున్న తిరపతమ్మ కనుపించదు.

"ఒరే కన్నా" గట్టిగా గదిమినట్లు పిలిచింది. పార్వతమ్మ. పిల్ల లందరూ ఒకేసారి ఇటుచూచి బిలబిలమంటూ చెట్టు మీద నుండి గోడ మీదకి గోడ మీద నుండి తిరపతమ్మ పెరట్లోకి దూకి పరుపుల్లా పారిపోయారు. పార్వతమ్మ వెను దిరిగి వెళ్లింది. తిరపతమ్మ మాత్రం అలా ఎంతసేపు దిగాలు పడి కూర్చుంది మరి.

గోపాలపట్నంలో గోపాల కృష్ణయ్య గారిది కలిగిన కుటుంబం. అరవై ఎనిమిదేండ్లు నిండినా మానసికంగా నవయౌవ్వనులాయన. ఇద్దరు కొడుకులు ఆయన సంతానం. పెద్దవాడు ప్రసాదరావు. వవస్యాయంలో 'పట్టా' పుచ్చుకొని స్వంత వ్యవసాయమే వృత్తిగా స్వీకరించాడు. రెండవవాడు భాస్కరం. కాకినాడలో వైద్యం మూడుపాదాల నడిపిస్తున్నాడు. ప్రసాదరావుకు మాత్రమే వివాహమైంది. భార్య శారద. వీరికి ఒక్కడే సుపుత్రుడు. వాడే తిరపతమ్మ పాలిట గోపాలకృష్ణుడు. భర్త పేరని పార్వతమ్మ, మామగారి పేరని శారదా వాడిని "కన్నా" అని పిలుస్తారు. ఇంచుమించుగా వాడికీ పేరే స్థిరపడి పోయింది. వాడికి పట్టుమని పదేళ్లయినా లేక పోయినా గోపాలపట్నంలో పెద్ద పేరు సంపాదించుకున్నాడు. ఆవూరిలో వాడెక్కని చెట్టు గానీ, ఈదని చెరువుగానీ చక్క పెట్టని ఇల్లు గానీ లేదు. ఇంత అల్లరి చేసినా వాడి 'ముఖారవింద' ప్రభావమేమోగానీ అందరూ వాడంటే ముద్దు చూపుతారు. వీడి అల్లరిని భరించలేక సతమతమై పోయేది ముగ్గురు మాత్రమే. నాయనమ్మ పార్వతమ్మ, అమ్మ శారదా, పొరుగమ్మ తిరుపతమ్మాను. ఎక్కడ తగువులూ ప్రమాదమూ తెచ్చి పెడతాడోనని మొదటి ఇద్దరి ఆందోళన, తన ఇల్లు పీకి పందిరి వేస్తున్నాడని మూడో ఆమె ఆందోళన.

శారద అడపాదడపా భర్తకూ, మామగారికీ తెలియకుండా వాడికి దేహశుద్ధి చేస్తూంటుందిగాని అది అద్దంమీద పెసరగింజ వడ్డట్టుమాత్రం. ఇక ప్రసాదరావుకు సాధారణంగా ఇంటి విషయాలేమీ పట్టవు. వ్యవసాయం వృత్తి— చదరంగం వినోదం. ఎప్పుడైనా శారద సాహసించి కన్నగాడి కాని అల్లరి ప్రసక్తి తెచ్చి సహాయం అర్థిస్తే, "నువ్వూ కొట్టి, నేనూ కొడితే మొండికేస్తాడు. ఒక్క సంవత్సరం ఆగితే హైస్కూల్లో వడేస్తే అల్లరి తగ్గవచ్చు" అన్నాడు. గోపాలకృష్ణయ్యగారితో ఈ విషయమై తరచూ వాగ్వాదం జరుగుతూంటుంది. పార్వతమ్మ ఫిర్యాదుచేయడం ఆయన మనవడిని వెనకవేసుకుని రావటం మామూలు.

ఈ మధ్య కొంతకాలంనుండీ 'కన్న' దృష్టినంతా తిరపతమ్మ జామిచెట్టుమీదకు కేంద్రీకరించాడు. ఆమెను రచ్చకీడ్చి నానా రభస చేస్తున్నాడు.

తిరపతమ్మ పదిభై అయిదేండ్ల వితంతువు. పెళ్లి అయిన అయిదేండ్లకే భర్త గతించటం, నెల తిరక్కుండానే ఒక్కగానొక్క కొడుకు— ఒక్క రోజు జ్వరం నెపంతో శాశ్వతంగా దూరమై పోవటం. ఆమె జీవితంలో వసంతం ఇకలేదు. నిత్యం శిశిరం. మోడై పోయిన జీవితాన్ని మొండిగా సాగిస్తున్నది. గొల్లపాలెంలో ఒక్క చెల్లెలు వినా ఆమెకీ ప్రపంచంలో 'నా' అన్నవారెవరూ లేరు. రెండెకరాల పొలమూ ఇల్లూ ఆమెకు భౌతికంగా మిగిలిన అనుబంధాలు.

తిరుపతమ్మ ఇల్లు గోపాలకృష్ణయ్యగారి ఇంటి వెనక దొడ్డి కానుకుని ఉంది. ఇల్లు చిన్నదైనా పెరడు పెద్దది. పెరట్లో గోపాలకృష్ణయ్యగారి దొడ్డి సరిహద్దులో గోడకానుకుని ఒక పెద్ద జామి



చెట్టు ఉంది. దాని కొమ్మలు కొన్ని గోపాలకృష్ణయ్య గారి దొడ్డిలోకి తొంగి తొంగి చూచి 'కన్నా'దిగా గలరిగిమ్మవదుము కుర్రాళ్లనందరినీ వెక్కిరిస్తుంటాయి.

ఈ జామ చెట్టంటే తిరపతమ్మకు బహిః ప్రాణం. ఇదీమధ్య వెర్రెత్తినట్లు కాసేస్తున్నది. కొన్ని రోజులనుండీ పిల్లలందరూ నిత్యమూ దాని మీద దాడిచేస్తున్నా దాని కాయలు తరక్కపోవడం అందరికీ విచిత్రమైన విషయం. పిల్లల దాడి ఎక్కువైన కొలదీ జామచెట్టు అక్షయంగా కాయడం చూస్తుంటే— పిల్లల పాదస్పర్శగాని జామిచెట్టుకు దోహదక్రియ కాదుగదా అని సందేహం కలుగుతోంది. అది అంతే అయి ఉండాలి. ఒక సుందరి చూచి తన్నితే అశోకం, ఒక జవరాలు, కౌగలించుకుంటే గోరంట, ఒక బాలామణి ముట్టుకున్నంత మాత్రాన మామిడి, ఒక యువతి నవ్వితే సురపొన్న, ఒక కన్య చతుర సల్లాపాన కొండగోగూ, చిగురించి, మొగ్గ తొడిగి, పుష్పించి, ఫలించుతాయని 'తొల్లి' మహాకవులు వర్ణించారుగాని పిల్లలు ఎక్కి తొక్కితే జామిచెట్టు అత్యద్భుతంగా కాస్తుందని ఇతఃపూర్వం ఎవ్వరూ చెప్పినట్లులేదు.

ఈ జామిచెట్టు మూలాన ఈ మధ్య తిరుపతమ్మ ప్రాణ సంకటం వచ్చిపడింది. ప్రతిరోజూ కన్న వాయ కత్వాన పిల్లలందరూ చెట్టుమీద దాడి జరపడం— దానితో తిరుపతమ్మకు తిక్కెత్తుకొచ్చి— శివమెత్తినట్లు పిల్లల్ని చెడామడా 'దీవించటం' దిన చర్యలో తప్పని సంఘటన. తిరుపతమ్మ తిట్టే తిట్లకు పార్వతమ్మకూ, శారదకూ మనస్సు కలుక్కుమంటుంది. నయాన, భయాన, కన్నను ఆ చెట్టు జోలికి పోకుండాచేయాలని విశ్వప్రయత్నం చేశారు

# తెరవెనుక దీపం

కాని వాడుససేమిరా అన్నాడు.

"ఏమండీ, ఆ తిరపతమ్మ తిట్లు వినలేకుండా ఉన్నాం. కాస్త మీ మనవడిని మందలించరాదండీ" అంది పార్వతమ్మ మాట ఒకటోసారి.

"ఆ చెట్టు వాడిని వెక్కిరిస్తుంటే వోరు మూసుకు కూచోమని నేనెలా చెప్పేది చెప్పు. తిరుపతమ్మ తిట్టేవి తిట్లని అనుకోడం పొరపాటు. దీన్ని గురించి నువ్వేమీ కిందుమీదై పోనవసరం లేదు." గోపాలకృష్ణయ్యగారి సమాధానం.

"ఆ దిక్కుమాలిన చెట్టు ఎప్పుడు విరగబడిపోతుందో"— ఇక్కడ పార్వతమ్మకూ ప్రాణసంకటం వచ్చిపడింది. ఎన్నోరకాల పళ్లూ—కాయలు తెప్పించి మనవడికి చూపి వెధవ జాంకాయలు వద్దు అన్నది. కన్న ఆ పళ్లవంక విషఫలాలల్లే చూసాడు. పార్వతమ్మ గత్యంతరంలేక పోయింది. ఒకసారి కొంచెం తటపటాయిస్తూనే తిరపతమ్మతో అంది, "ఏమే తిరుపతమ్మా — తెలియని పిల్లలేదో జామకాయలు కోస్తున్నారని అంతలేసి తిట్లు తిట్టాల్చా— నీకు కావాలిస్తే ఆ జామిచెట్టుమ కాయలకో— మొత్తానికో మాకు అమ్మకూడదూ— నీకూ మాకూ తగువుండదూ"

"సాగిన తల్లులమ్మా మీరు. జాంచెట్టునూ కొంటారు. నన్నూ కొంటారు. నా చెట్టును నాశనం చెయ్యొచ్చునంటగానీ నేను తిడితే తప్పొచ్చిందంట" అంటూ తిప్పుకుంటూ వెళ్లిపోయింది తిరుపతమ్మ పార్వతమ్మ నిలువునా తెల్లబోయింది.

"దాంతో మీకేటి తెండక్కయ్యగారూ. అది పట్టి గాడుగంపా, తిక్కమనిదాం. ఒకరు చెబితే ఉంటుంది గనుకనా" అంది పొరుగింటి కామాక్షమ్మ.

## 2

పుష్యమాసం ప్రవేశించింది. పండుగ సెలవులకు భాస్కరం వచ్చాడు. భాస్కరానికి ఇంటి దగ్గరున్నంతసేపూ కన్నతోనే కాలక్షేపం. కవ్వించి నేర్పుగా అడిగితే వూరి విశేషాలన్నీ భూతద్దంలో చూపగలడు కన్న.

ఆ ఉదయం మామూలుగా తిరుపతమ్మ జామిచెట్టెక్కి నిక్కరు జేబులనిండా కాయలు కనుకుని ఇంట్లో అడుగుపెడుతుంటే సావడిలో భాస్కరం చదువుకుంటున్నాడు.

"ఒరే కన్నా— ప్రొద్దుటే ఎక్కడికెళ్లావురా" భాస్కరం పల్కరించాడు.

"ఆడుకోడానికెళ్లాను బాబాయ్"

"అదేరా— ఎక్కడికంట"

"తిరి ఇంటికి బాబాయ్" "తిరి"— "తిరిపి" తిరపతమ్మను పిల్లలు ఆప్యాయంగా పిలిచే—పేర్కొనే పేర్లు. ఈ రెండు పేర్లతో పిలిచినవారిని తిరుపతమ్మ ఏడేడు తరాలు తడిమి మరీ దీవిస్తుంది.

"తిరితోనే ఆడుకున్నావా ?"

"కాదు బాబాయ్, రాముా, చక్రీ, గోపీ, బండా ఇంటి కాడ ఆడుకున్నాం."

"వెధవాయ్. డొంక తిరుగుళ్లుమాని నిజం చెప్పవోయ్"

"అవును బాబాయ్ ఆడుకున్నాం"

"అదేరా, ఏం ఆటంట?"

"కోతి కొమ్మచ్చి"

"తిరి జామిచెట్టు మీదేనా ?"

"వూఁ"

"జామకాయలు తిన్నావా ?"

కన్న నిక్కరు జేబులో చేతులుపెట్టాడు అనుకోకుండా.

"ఏదీ నాకో జాంకాయ పెట్టరా"

కన్నకు ఎక్కడలేని ఉత్సాహమూ, ధైర్యమూ వచ్చాయి. ఇంతవరకూ ఉన్న ఇరకాటం వదిలింది వెంటనే జేబులోంచి రెండు జామకాయలు తీసి భాస్కరానికిచ్చి ఒకటే తను కొరకసాగాడు. భాస్కరం తనకిచ్చిన జామపండును కొరికి "బలే బావుంది రోయ్. తిరి జాంకాయ" అన్నాడు. కన్నకు ఉత్సాహం పెల్లుబికింది.

"మాంచి దోరకాయ ఇవ్వనా బాబాయ్" అంటూనే జేబులోనించి నాలుగు కాయలుతీసి వాటిలో దోరగా ఉన్నది తీసి భాస్కరానికిచ్చాడు. పరదా వెనుక నవ్వని గాజుల సవ్వడిని వినిపించింది. అటుచూసి బాబాయి వంకచూసి కళ్లు మిటకరించాడు. భాస్కరం పరదా వంక తిరిగేలోగా శారద ముందుకు వచ్చి నిలబడింది. కన్న ఇబ్బందిగా నిల్చున్నాడు.

"ఏమయ్యా, తిరపతమ్మ, జాంకాయలు నువ్వొకచి మరిగావన్నమాట"

"అదేమోగాని వదినా, తిరి జాంకాయలు బ్రహ్మాండంగా ఉన్నాయనుకో. వీటిముందు ఒకటో నంబరు రసగుల్లాలు బలాదూరు— కావాలిస్తే నువ్వొకటి తినిచూడు వదినా— ఒరే కన్నా అమ్మకొకటి ఇవ్వరా"




'హలో! దీపావళీ పండక్కి కూడా...మీ ఆవిడ రానన్నదని చెప్పావుగా! వచ్చేసిందా ఏమిటి? ...'



# తెరవెనుక దీపం

[illegible] కంఠోష్ణంతో.

"వెధవ— వాతా పెడతాడు. తెల్లవారలేదు అప్పుడే వెళ్ళి దాదా తిట్లూ తినివచ్చాడు" అంటూ శారదకన్న చెంబు పట్టుకొంది.

కన్న చిక్కమొహంపెట్టి తాప్పురం వంక చూసాడు.

"వదినా— వదినా, వాడేం కొట్టలేదు— నే చెప్తాగ" ప్రాధేయపడ్డాడు.

అంతలో భీముడు సావిట్లో ప్రవేశించాడు భీముడు భీముడే. పదహారు సంవత్సరాలే అయినా వింతుగా కనుపిస్తాడు. గోపాలకృష్ణయ్య గారి పాలంలో ప్రసాదరావుకు నీడలా తిరుగుతుంటాడు. కన్నని కంటికి రెప్పలా చూచి వాడికి సకల విద్యలూ —చదువు మినహాగా— నేర్పిన గురువు. గోపాల కృష్ణయ్య గారి కుటుంబ మంటే వాడి ప్రత్యేకపుగా కృతజ్ఞతతో ఉరక వేస్తుంది.

"నీకు తెలీదయ్యా— ఆ తిరపతమ్మ ఒట్టి అర్థమైన తిట్లూ వినలేక పోతున్నాం. తెల్లవారితే పీడు జామచెట్టు ఎక్కక మానడు. ఆ తిరపతమ్మ తిట్టకా మానదు. మధ్య మేం గొడవ పడలేక చస్తు న్నాం" అంది శారద విసుగుతో.

"ఉండు చిన్నమ్మా— ఇంక నా(శ్రో)జాలాగితే" భీముడు పూర్తి చేయకుండానే శారద రెండో తమ్ముడు రాంబాబు వీధిలో నుండి సావడిలోనికి బంతిలా దూకి "అక్కా— వచ్చేసాను" అన్నాడు పట్టరాని ఉత్సాహంతో.

తమ్ముణ్ణి చూడగనే శారద గతం మరిచి పోయింది. ఆమె ముఖం విద్యుత్కాంతితో వికసిం చింది. స్త్రీ సహజమైన పుట్టింటిపై అభి మానంతో మనసు మురిసింది.

రాంబాబు ఒక్క గుక్కలో చెప్పాడు. తను అక్కని పండక్కి ఉన్న పాటున తీసుకెళ్ళడానికి వచ్చాడట. ఏవరేమి అటంకం చెప్పినా వాళ్ళ నాన్న గారు విని పించుకో వద్దన్నారట. చిన్నక్కని తీసుకొని రావ డానికి విశాఖపట్నం చిన్నన్నయ్య తనతోనే బయలు దేరి వెళ్ళాడట. తనూ చిన్నన్నయ్యా పందెం వేసు కున్నారట— ఎవర్ని ముందు అక్కడికి తీసుకొస్తారో నని. తనను గెలిపించడానికి శారద వెంటనే నిలబడ్డ పాటున బయల్దేరాలట. కడకు తన పరీక్ష తప్పినా ఫరవాలేదుట గాని ఈ పందెంలో తను ఓడిపోవ డానికి వీల్లేదట.

"ఏం అక్కయ్యా, మనం ఇప్పుడు బయల్దేరు దామా" అన్నాడు ఎంతో ఆశతో.

"ఏడిసేవ్ నీ ఇష్టమూ— నా ఇష్టమే" అంది శారద నవ్వుతూ

"మరి" అన్నాడు రాంబాబు గుమ్మం విరుత్సాహ పడిపోయి.

వీధి మెట్లపై చెప్పుల సవ్వడి విని శారదలోనికి వెళ్ళింది. ప్రసాదరావు సావడిలోనికి ప్రవేశించాడు. నోరు జారాని భయపడ్డ భీముడు తేరుకొన్నాడు.

* * *

శారద పుట్టింటికి వెళ్ళి వారం రోజులయింది. సాయంత్రం నాలుగు గంటలైంది. తెల్లవారితే భోగిపండుగ. పిల్లలందరూ గోనె సంచులూ, బుట్టలు పట్టుకొని ఇంటింటా పిడకలు దండుతున్నారు. తిరపతమ్మ ఇంటికి వచ్చారు. "వేసినమ్మది పుణ్యం —వేయనమ్మది పాపం" అని రణగోల పెడుతూ. తిరపతమ్మ తారాజువ్వలా వచ్చింది. ఒక్క పిడక గాదు పూచిక పుల్లైనా వేయనని మొండికేసింది. "అయితే వెయ్యవా" అని మొరాయించారు పిల్లలు. వెయ్యనుగాక వెయ్యనంది తిరపతమ్మ. పిల్లలు తిరుగు ముఖం పట్టారు.

"తిరపతమ్మ గారి ఇల్లు ఇదేనా" అంటూ ఒక తలపాగా పెద్దమనిషి [illegible] వచ్చాడు.

"నేనే నయ్యోయ్. ఎవరు నువ్వు" అంది తిరపతమ్మ.

"మాది గొల్లపాలె మమ్మగారూ. ఇలా రాజా పాలెం మా అత్తారింటికి పోతున్నా— గొల్ల పాలెంలో మీ చెల్లెమ్మ గోరంట— సత్తెమ్మగోరికి చాలా సుత్తీ చేసింది. మిమ్మల్ని ఎంటనే బయల్దేరి రమ్మని ఎంకప్పగోరు చెప్పమంటే ఈడ బస్సు దిగాను. మళ్ళా బస్సుకి పోవాల" అన్నాడు.

తిరపతమ్మ ముఖ కళలు మారిపోయ్. ఆందో ళన వ్యక్తమైంది. "అయ్యమ్మో— ఏంటే జబ్బు నాయనా" చాలా ఆదుర్దాగా అడిగింది.

"నాకేటి తెల్సమ్మగోరూ! చాలా సుత్తీగా ఉంది. విన్నపాల కిందెట్టేసినారంట గండా" అన్నాడతను.

"అయ్యో—నా సత్తెమ్మోయ్" అని తిరపతమ్మ ద్వారానికి జార బడిపోయింది.

క్రమంగా గట్టిగా ఏడుపు ప్రారంభమైంది. అయిదు నిముషాల్లో ఇరుగు పొరుగు అమ్మ లక్కలు చేరి పూరడింపులు పలికి వెంటనే, తిరప తమ్మను గొల్లపాలెం ప్రయాణం కట్టించారు. కబురు తెచ్చిన పెద్దమనిషి ఎప్పుడు వెళ్ళిపోయాడో ఎవరూ గమనించలేదు.

## 3

భోగి, పెద్ద పండుగ వెళ్ళాయి. కనుమనాడు మధ్యాహ్నం బస్సు దిగి చెల్లెలు సుస్తీగా ఉందని కబురు తెచ్చిన వాడిని వెయ్యి తిట్లు తిడుతూ గాలి తీసిపోతూ బాణంలా ఇంటికి వచ్చి పెరటి తలుపు తాళం తీసి గుమ్మంలో కుప్పగా కూలిపోయింది తిరపతమ్మ. ఇంకేముంది. తను అనుకున్నంతా అయి పోయింది. కొండంత పిడకల గూడు— ఒక పిడ కైనా లేదు. దొడ్డంతా కలయజూచింది. తూర్పు వేపు గోడకు చేరవేసిన కందికంప మోపులు లేవు. మళ్ళీ చూచింది పెరడంతా. మిగతవన్నీ ఉన్నట్టే కనుపించాయి. కాని పెరడంతా ఎందుకో వెలవెల పోతోంది. ఒక్కొక్క మూలా— ఒక్కొక్క వస్తు వునూ జ్ఞాపకం తెచ్చుకుంటూ పరీక్షగా మళ్ళీ మళ్ళీ చూచింది.

"అయ్యమ్మో— నా జాం చెట్టు" గొల్లు మంది తిరపతమ్మ. ఇంకెక్కడి జామిచెట్టు! దాని స్థానే జానెడు మోడూ అక్కడక్కడా పడలిన ఆకులూ మాత్రం ఉన్నాయి. తిరపతమ్మను మూర్ఛ వచ్చినంత పనయింది. పిచ్చిదానిలా ఆ మోడు వంకే చూడసాగింది. మాటలేదు. చలనం లేదు. ప్రాణప్రదమైన వారిని పోగొట్టుకున్న వార్త హాఠా త్తుగా విన్నవారి మానసిక నిశ్చేతన్యంలో కొట్టు కొంటోంది— చాలా సేపయింది.

"ఎప్పడొచ్చావే తిరపతమ్మా" కామాక్షమ్మ పలకరించింది. పలకలేదు. భుజం మీద చెయ్యి వేసి తట్టింది గట్టిగా.

"చిన్నీ" అంటూ కామాక్షమ్మను పట్టుకొ బావురుమంది తిరపతమ్మ.

"పూరుకోవే ఇంక. కొంటె వెధవలు చేసా రంతాను. అదిగో ఆ భీముడు చేసాడిదంతా.

51 వ పేజీ చూడండి




"ఇదిగో, నువ్వు నీ పని పూర్తిచేస్తే ... నేను దూలాలకీ, కిటికీలకీ రంగులేసుకోవాలి!..."



6-11-1964 శుక్రవారము మొదలు 12-11-1964 గురువారము వరకు.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | [illegible] | | రా |
| శు | వారఫలం | | |
| | మహేష్ | | కు |
| కే | బు చం | ర | కు |

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం వృత్తి వ్యాపారాల్లో ఆదాయం పెరగవచ్చును కాని మీరు పొందిన వ్యయ ప్రయాసలతో పోల్చినప్పుడు అంత సంతృప్తి కరంగా కన్పించదు. అన్ని వ్యవహారాల్లోను వారారంభంలో కంటె వారాంతంలో అనుకూలత లభిస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాలుకూడా లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయుగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రస్తుతం బాగా ఉన్నా మీకు రావలసిన డబ్బు మీద ఆధారపడి యే వ్యవహారం ప్రారంభించడం మంచిది కాదు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబవ్యవహారాలు ఇదివరకటి కంటే బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగాఉంటుంది. బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో కొంచెం శ్రమ మీద విజయాన్ని సాధిస్తారు.

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

వృత్తి వ్యాపారాలు పైకి ప్రశాంతంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని మీరు యేమాత్రం యేమరుపాటు చూపినా నష్టం తప్పదు. సామాన్య వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయువలసిన పరిస్థితి యేర్పడడం వలన ముఖ్యమైన వ్యవహారాలను వదలుకోవలసి వస్తుంది. వృత్తిలో యథా తథ స్థితిని కాపాడుకొంటారు. ఉద్యోగంలో కొన్ని మార్పులు వచ్చే సూచనలు ఉన్నాయి. కాని వాటివల్ల మీకు కలిగే లాభ నష్టాలేమీ ఉండవు. స్థిరాస్తి వ్యవహారాల్లో చికాకులు గృహ నిర్మాణాది ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో కొన్ని అవకాశాలు లభిస్తాయిగాని మీరు వాటిని పూర్తిగా ఉపయోగించుకొనలేరు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

## మిథునం :

(మృగశిర 3, 4 పా, అరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీరు యెన్నో చికాకులను యెదుర్కోవలసి ఉన్నట్లు కన్పిస్తుంది కాని మీరు ధైర్యంగా వ్యవహరించడం వలన అన్ని ఇబ్బందులను అధిగమించడమే కాకుండా తగిన అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. వృత్తిలో ఇంతవరకు చికాకుల్లో ఉన్న వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కాగలవు. ఉద్యోగంలో మీ అభిప్రాయాలు అధికారుల దృష్టిని ఆకర్షిస్తాయి. దూర ప్రయాణాలు వాయిదా వేయుడం మంచిది. ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు మానసికాందోళన కలగవచ్చును. వారారంభంలో బంధువులతో మాట పట్టింపులు రావచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం వృత్తి వ్యాపారాలు మామూలుగానే ఉన్నా కొన్ని ఉత్సాహకరమైన సంఘటనలు జరుగవచ్చును. మీరు యెంతో దీక్షగా ప్రయత్నం చేస్తున్న వ్యవహారాల్లో అభివృద్ధి లేక పోయినప్పటికీ మీరు ఇది వరకు కృషి చేసిన వ్యవహారాల్లో ఆకస్మికంగా అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. మీకు అంతగా ఇష్టం లేకపోయినా, మిత్రులకు సంబంధించిన వ్యవహారాల్లో మధ్యవర్తిత్వం వంటి పాత్రను నిర్వహించ వలసి వస్తుంది. డబ్బు ఇచ్చి పుచ్చుకోవడాల్లో చికాకులు రావచ్చును. మీ ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది కాని కుటుంబంలో పెద్దలకు అనారోగ్యం చేయువచ్చును. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. సాంఘిక కార్యక్రమాలు బాగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం మీరు వృత్తి వ్యాపారాల్లో విశేషమైన ప్రయోజనాన్ని సాధించలేక పోవచ్చును కాని అన్ని వ్యవహారాలు మీరు ఊహించినట్లుగా నెరవేరడం వలన మొత్తం మీద పరిస్థితి సంతృప్తికరంగానే ఉంటుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది. వృత్తిలో భవిష్యత దభివృద్ధికి తోడ్పడే యేర్పాట్లు సమాలోచనలు జరుగుతాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉన్నా మీ అభివృద్ధిని సహించలేని సాటివారు కొంత మంది మీ మీద నిందా ప్రచారానికి పూనుకొనవచ్చును. స్వల్ప అనారోగ్యం చేసే సూచనలు ఉన్నాయి.

**ఈవారం ధరలు**

అపరాల ధరలు నిలకడగా ఉంటాయి. బెల్లం ధర కొంచెం తగ్గే సూచనలు ఉన్నాయి. నూనె ధరలో ఒడుదుడుకులు రావచ్చును. అలంకార వస్తువుల ధరలు తగ్గుతాయి.

సాంఘిక వ్యవహారాల్లో పలుకుబడితో పాటు బాధ్యత కూడా పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబంలో స్వల్ప భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి.

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఈ వారం చిత్రంగా ఉంటుంది. మీ శ్రేయస్సును కోరే వ్యక్తులకు వ్యతిరేకంగాను, కొంత మంది అవాంఛనీయులైన వ్యక్తులకు సన్నిహితంగాను వ్యవహరించవలసిన పరిస్థితి యేర్పడుతుంది. మీకు రావలసిన డబ్బును కూడా చేతికి వచ్చేవరకూ నమ్మడానికి వీలులేదు. వృత్తి వ్యాపారాల్లో ఆకస్మికంగా అధికవ్యయం చేయువలసిన పరిస్థితి యేర్పడ వచ్చును. భారీ యెత్తున చేసే వ్యాపారాలు కొంత కాలంపాటు వాయిదా వేయుడం మంచిది. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉండదు. సాటివారితో కలహ ప్రసంగం రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం అంతబాగా ఉండదు ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభించదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు. బంధువులకు సకాలంలో సహాయం చేయుగలరు.

## తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

ఈ వారం గతవారం కంటే కొంచెం బాగా ఉండ వచ్చును. వృత్తి వ్యాపారాలు బాగానే ఉంటాయి. వ్యాపారంలో కొంత మంది మిత్రులు, వారికి కలిగిన ఇబ్బందుల వలన తమ వాగ్దానాలను పాటించలేరు. అందుచేత మీకు కూడా కొన్ని చికాకులు కలగ వచ్చును కాని వాటివల్ల మీ కార్యక్రమాలకు భంగం కలగదు. వృత్తిలో కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయుడానికి ప్రయత్నం చేస్తారు కాని వారి ప్రయత్నాలు ఫలించక పోవచ్చును. ఉద్యోగంలో ఇదివరకు యేర్పడిన చికాకులు క్రమంగా తొలిగిపోతాయి. మీ శక్తి సామర్థ్యాలు రుజువు చేసికొనే అవకాశం లభిస్తుంది. మీ ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుతగదు.

స్త్రీలకు— ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు. అలంకార వస్తువులు కొంటారు.

# వారఫలం

## వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి వ్యాపారాల్లో కొన్ని అవకాశాలు ఇంద్రజాలం వలె చిక్కులి ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని వాటికోసం ప్రయత్నం చేయడం వలన వ్యయప్రయాసలకు గురికావడం తప్ప ప్రయోజనం ఉండక పోవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు అంతగా రాణించవు. బంధు మిత్రుల వ్యవహారాలను కొన్నింటిని మీరు నిర్వహించడం వలన మీ స్వంత వ్యవహారాల్లో దృష్టిని కేంద్రీకరించడానికి అవకాశం ఉండదు. అధికారుల వలన జరగవలసిన పనులు కొంచెం శ్రమ మీద నెరవేరి, లాభించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాల్లో మార్పులు రావలవు. ప్రయాణాలు వాయిదా పడవచ్చును.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో మీరు మొదట్లో వేసిన అంచనాకంటే అదనంగా వ్యయం జరిగినా తగిన ప్రతిఫలం ఉండడం వలన ఈ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. భవిష్యత్తులో మీ అభివృద్ధికి తోడ్పడే దీర్ఘకాలిక ప్రణాళికలు అమలులోకి తేవడానికి అనువైన సమయం. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు తోడ్పడతాయి. ఉద్యోగంలో మార్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలించగల సూచనలు ఉన్నాయి. కోర్టు వ్యవహారాల్లో ప్రతి కక్షుల వాదం బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో చెప్పతగిన మార్పులు రాకపోవచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం వారాంత మంచి బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈ వారం ఆర్థికంగా బాగా ఉన్నా మిగిలిన వ్యవహారాల్లో మీకు అంతగా ఇష్టం కాని పరిస్థితులు యేర్పడడం వలన ఈ వారం సంతృప్తికరంగా కన్పించదు. మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు ఇప్పుడు ప్రాముఖ్యత రావడం వలన వ్యాపారంలో తొట్రుపాటు కలుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిది కాదు. ఉద్యోగంలో మీ పరిస్థితి గతవారంలో కంటే బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో ఇంతవరకు ఉన్న వ్యతిరేకత తొలగి పోతుంది. ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మామూలుగానే ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

మీరు ఎంత ప్రయత్నం చేసినా వృత్తి వ్యాపారాల్లో కొన్ని వ్యవహారాలు, మీ అదుపు తప్పి వూహించని మార్పులకు గురికావడం వలన మీకు నిరాశ, నిస్పృహ కలగవచ్చును కాని క్రమంగా అన్ని వ్యవహారాలు సానుకూల పడగల సూచనలు ఉన్నాయి. భారీ యెత్తున చేసే వ్యాపారాలు ఇప్పుడు ప్రారంభించడం మంచిది. వ్యాపారంలో పెట్టుబడి చాలక అప్పుడప్పుడు కొంత ఇబ్బంది కలిగినా, యేదో ఒక విధంగా అన్ని వ్యవహారాలు సరిదిద్దు కొంటూ స్వల్పాభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. ఆరోగ్యం బాగా ఉన్నా వారాంతంలో జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. ప్రేమ వ్యవహారాల్లో కొత్త సమస్యలు తల యెత్తవచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో యేర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. సాంఘికంగా పేరు ప్రతిష్ఠలను పొందగలరు.

## మీనం :

(పూ. భాద్ర, 4 పా, ఉ. రేవతి.)

ప్రతి క్షణమూ హెూరాహెూరీగా పోరాడితేనే గాని యే కార్యమూ సాధించలేరు. వృత్తి వ్యాపారాల్లో మీరు తలపెట్టిన కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి గాని అధికారుల వలన జరగవలసిన పనులకు మాత్రం ఆటంకాలు రావచ్చును. రావలసిన డబ్బు సమయానికి అందే గల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును గాని వాటివల్ల యే వ్యవహారమూ ఆగిపోదు. వృత్తిలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగం బాగానే ఉంటుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. భిన్నాభిప్రాయాలు గల బంధువులను ఒక దారికి తీసికొని రాగలరు. ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం గతవారంలో కంటే బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి. విలాస వస్తువులు కొంటారు.

# జన్మదినఫలం

## నవంబరు-6

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశం లేదు. వృత్తి వ్యాపారాలు సామాన్యంగా ఉన్నా కొంత మంది సన్నిహితులతోనే భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. కార్యసాధనకోసం మీకు అంతగా ఇష్టంలేని పరిస్థితుల్లో కొన్ని వ్యవహారాలను నిర్వహించ వలసి వస్తుంది. మీ స్వంత వ్యవహారాలలో కంటే బంధుమిత్రుల నిమిత్తం ఆర్థికంగా అప్పుడప్పుడు ఒత్తిడికి గురి కాగలరు. వృత్తిలో సాటివారితో పోటీ కొంచెం పెరగవచ్చును. ఉద్యోగంలో మార్పుల కోసం ప్రయత్నం చేయడం మంచిది కాదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిఘటనను యెదుర్కొని విజయాన్ని సాధించగలరు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. కళాకారులకు ఆహార పదార్థముల వ్యాపారము చేయువారికి మంచి సమయం.

## నవంబరు-7

అప్పుడప్పుడు మానసికాందోళనా, కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరగవచ్చును కాని మొత్తం మీద ఈ సంవత్సరం చాలా బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఆకస్మికంగా అనుకూలమైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా ఫలించగలవు. ఆర్థికంగా ఉండే ఇబ్బందుల వలన ఇదివరకు ఆగిపోయిన వ్యవహారాలను కూడా తిరిగి సంవత్సరం మధ్యలో ప్రారంభించ గలరు. వృత్తిలో నూతనావకాశాలు లభించడం వలన ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్పు జరగవచ్చును. ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మామూలుగా జరిగిపోతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ముందడుగు వేస్తారు. విద్యార్థులు కొంచెం శ్రమ మీద మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## నవంబరు-8

ఈ సంవత్సరం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు ఉన్న అనిశ్చిత పరిస్థితి తొలగి పోయి భవిష్యదభివృద్ధికి తగిన మార్గం యేర్పడుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా పోత్సాహకరంగా ఉంటాయి. కేవలం అధికాదాయం కాకుండా సాటివారిలో గౌరవం, పలుకుబడి కూడా లభిస్తాయి. వృత్తిలో ఇదివరకు మీ పట్ల వ్యతిరేక భావంతో ఉన్న వారు కూడా మీ మంచిని, సామర్థ్యాన్ని గుర్తిస్తారు. ఉద్యోగంలో ఉన్నత స్థానం లభించగల సూచనలు ఉన్నాయి. రక్త సంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. ప్రేమ వ్యవహారాల్లో ఆకస్మికంగా చికాకులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలను ప్రారంభించి విజయాన్ని సాధించగలరు. విద్యార్థులకు క్లాసు రావచ్చును. పారిశ్రామిక వేత్తలకు, వైద్యులకు యోగవంతమైన సమయం.

## నవంబరు-9

గడచిన కొద్ది సంవత్సరాలకంటే ఈ సంవత్సరం బాగా ఉంటుంది. మీరు ఇదివరకు ప్రయత్నం చేసి లాభం లేదనుకొన్న వ్యవహారాలు కూడా ఇప్పుడు సాధ్యం కాగలవు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారుల వలన జరుగవలసిన పనులు సులువుగా నెరవేరతాయి. వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన విద్యలో ఉత్తీర్ణులు

కాగలరు. వృత్తి రీత్యా దూర ప్రయాణాలు చేయగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో ఉన్న వ్యతిరేక వాతావరణం చాల వరకు తొలగి పోతుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో విజయాన్ని సాధించగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. శుభకార్యాల విషయంలో బంధువుల తోడ్పాటు వలన అనుకూలత లభించ వచ్చును. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## నవంబరు–10

అప్పుడప్పుడు వృత్తి వ్యాపారాల్లో అవాంఛనీయమునైన పరిస్థితులు యేర్పడినా, మొత్తం మీద ఈ సంవత్సరం చాల అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించ గలరు. వ్యాపారంలో ఆకస్మికంగా కొన్ని వ్యవహారాలు సానుకూల పడడం వలన ఆదాయం పెరుగుతుంది. ఇంతవరకు మీరు రాదనుకొన్న డబ్బు కూడా, ఇప్పుడు అందగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుబడి పోవడం వలన లాభం వచ్చే వ్యవహారాలను కోల్పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. కోర్టు వ్యవహారాలు మాత్రం అంత అనుకూలంగా ఉండక పోవచ్చును. మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని సంతానానికి కించిదనారోగ్యం చేయవచ్చును. విలాస యాత్రలు చేస్తారు. విద్యార్థులు కొంచెం శ్రమ మీద కృతార్థులు కాగలరు.

## నవంబరు-11

ఈ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు వూహించని చికాకులకు గురికాగలరు. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి కాని, స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలే బాగా ఉంటాయి. గత సంవత్సరం కంటే ఈ సంవత్సరం ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి ఇది సమయం కాదు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కొంత మంది బంధువులు తమ స్వార్థం కోసం మీ కుటుంబంలో భేదాభిప్రాయాలు కలిగించడానికి ప్రయత్నం చేస్తారు. పుణ్య కార్యాలు, తీర్థ యాత్రలు చేస్తారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కావచ్చును.

## నవంబరు-12

ఈ సంవత్సరం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. ఈ సంవత్సరం మీరు జరిపే వ్యవహారాల ప్రభావం రాబోయే సంవత్సరాల మీద కూడా ఉంటుంది. కాబట్టి జాగ్రత్తగా ఆలోచించి వ్యవహరించడం అవసరం. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు మీ అభివృద్ధికి ఆటంకంగా ఉన్న వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కాగలవు. వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన పెట్టుబడి వాలని లోపం అప్పుడప్పుడు కన్పిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. గృహ నిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అప్పుడప్పుడు చికాకులు రావచ్చును. సాంఘిక వ్యవహారాల్లో నూతనమైన బాధ్యతలను వహించవలసి వస్తుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.






### జరిగిన కథ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాథను చెపుతూవుంటుంది... 'జానకి, సీత అక్కచెల్లెళ్ళు. జానకి రామారావులకు పెళ్ళవుతుంది. జానకికీ, చనిపోయిన చినమామయ్యకీ సంబంధం వుందన్న కోపంతో రామారావు ఆమెను చిన్నచూపు చూస్తాడు. భార్యాభర్తల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు రావటంతో, జానకి ఆశించిన ఆనందాన్ని పొందలేకపోతుంది. జానకిపై రామారావు అనుమానం నానాటికి పెరిగిపోతూ వుంటుంది. పండుగకు జానకి దగ్గరకెళ్ళిన సీత, అసంతృప్తాన్నంతా బాగా అర్థం చేసికొనగలుగుతుంది. సినిమా హాలులో రామారావు, విద్యార్థిని రమతో మాట్లాడటం సీతలో అనుమానానికి దారితీస్తుంది. ఆసంగతి ప్రస్తావించిన జానకికి రామారావు చేతిలో మళ్ళీ చీవాట్లు తగిలాయి. ముమ్మందు రామారావు రమను తన యింటికే తీసుకొస్తున్నాడన్న వార్త జానకి పుట్టింట్లో సంచలనాన్ని కల్గిస్తుంది. సందర్భవశాత్తు ఒకనాడు ఆ రమాదేవి ఇంటికే సీత వెళుతుంది. సీత ప్రయత్నం ఫలించి, జానకి కాపురం కుదుటబడుతుంది. రామారావు జానకిని ఆప్యాయంగా చూసుకొంటూంటాడు. భర్త తనను ప్రేమగా చూస్తున్నప్పుడు తను ఆయన నిత్యావసరాలను తీర్చేందుకు నోచుకోనందుకు చాలా బాధపడుతుంటుది. సీత రమాదేవి పుట్టినరోజు పండగకి వాళ్ళింటికి వెళ్ళి రమాదేవి వదినెగారి సూచనలకు విరుద్ధంగా తన అభిప్రాయాన్నిస్తుంది. పర్యవసానంగా రమాదేవి జానకివాళ్ళింటికి పూర్వంలా రావటానికి వీలుపడని పరిస్థితి కల్గుతుంది. సీత రమాదేవి ఊసు ఎత్తగానే అంతవరకూ ఆనందంగా మాట్లాడుతున్న రామారావు మౌనంగా అక్కడినుంచి వెళ్ళిపోతాడు. జానకి హాస్పెటల్‌లో మగపిల్లవాడ్ని ప్రసవించి శాశ్వతంగా కన్నుమూస్తుంది. అంతా దుఃఖసాగరంలో మునిగి పోతారు.

## 13

అమ్మా, నాన్న మాటలు చూస్తే నాకు చదువు చెప్పించాలని వాళ్లకు లేదల్లే ఉంది. వాళ్ల మనస్సులోని భావాలు నాకు చెప్పలేక పోతున్నారు. అయినా వాళ్ళ ఉద్దేశ్యం నన్నూ ఒకడి కిచ్చి కట్ట బెడతామని. అంతకన్న ఇంకేం ఉద్దేశ్యాలుంటయ్యి.

పి. యు. సి లో చేరాను. అమ్మా, నాన్నా ఏ ప్రస్తావనా ఎత్తలేదు. కాలేజీలో చేరినట్లుగా రమాదేవికీ, సుభద్రకీ ఉత్తరం రాశాను.

ఉత్తరాలు రాస్తుంటే నాకు మనస్సు చివుక్కుమన్నది. అక్కయ్య కనుక బ్రతికుంటే నేను కాలేజీలో చేరానని వింటే ఎంత సంతోషించేదో ? ఎన్ని శుభోక్తులు, హితోక్తులూ చెపుతూ ఎంత పెద్ద ఉత్తరం రాసేదో ! అమ్మ అన్నట్లుగా మంచిగ్గాని చెడుకుగాని తోడ బుట్టిన వాళ్ళుండాలని. అక్కయ్య పోయిన రోజున అమ్మ ఇట్లాగని గుండెలు బాదుకుని ఏడిచేది. "మీ కాపరాలు మీరు చేసుకుంటూ ఏ పండక్కో పబ్బానికో మీ భార్యా భర్త లిద్దరూ ఒక్కసారిగా ఇద్దరు కూతుళ్ళూ, ఇద్దరల్లుళ్ళూ వస్తారని అనుకునేదాన్ని. పెద్దవాళ్ళం కలకాలం ఉండం కదా! మగ పిల్లలు లేక పోయినా ఈ ఇద్దరు కూతుళ్ళ చేతుల్లోనయినా మేం వెళ్ళి పోతే బావుండును" అంటూ ఏడ్చింది. ఇప్పుడిక ఉత్తరాలు ఆప్తులయిన వాళ్ళకి ఎవళ్ళకు రాయాలి. నాకు ఆప్తులయిన వాళ్ళు రమాదేవి, సుభద్ర. బావ ఆప్తుల్లో ఒకరయినా ఆయనకు ఉత్తరం రాయలేక పోయాను. అదే ఆడదాని జీవితానికి భగవంతుడు సృష్టించిన గిరి గీత. బావతో ఎన్ని విషయాలో, ఎంతసేపో నవ్వుతూ మాట్లాడొచ్చు. ఒకరి అభిప్రాయాలు మరొకరు తెల్సుకో వచ్చు. కాని ఉత్తరాలు రాయాలంటే సాంఘిక న్యాయ సూత్రాల దృష్ట్యా అది కానిపని. తగని పని. నలుగురూ హర్షించని పని. ఏ మరదలూ ఏ బావకూ ఉత్తరాలు రాయదు. రాయ కూడదు. రాస్తే అనేక అపోహలకు దారి తీయవచ్చు. అనేక దురభిప్రాయాలూ మనస్సులో చిత్రించుకో వచ్చు. అందుకనే బావకు ఉత్తరం రాయలేక పోయాను. మాటలకూ, రాతలకూ అంత తేడా ఉంది. లక్ష మాటలు మాట్లాడినా రాని అనుమానాలు, ఒక్క ఉత్తరంతో వచ్చేస్తయ్యి.

కాలేజీ వాతావరణం నాకు చాలా కొత్తగానే ఉంది. హైస్కూలు చదువు జీవితంలో విద్యార్థుల అల్లర్లు వేరు. బ్లాక్‌బోర్డు మీద మాష్టరు బొమ్మవేసి అల్లరి చేసే రోజులవి. కాలేజీ జీవితం అట్లా కాదు. అల్లరి కూడా హుందాతనంతోనే చేస్తారు. లెక్చరర్ల చేతులో మాటలు కూడా హుందాతనంతోనే పడతారు. అంతలో అంత మార్పు వస్తుంది. కారణం మనస్సుల్లో, భావాల్లో కలిగే మానసిక పరిణామమే అది.

ఇంక ఆడపిల్ల జీవితాలూ, వాళ్ళ కట్టుబొట్లల్లోనూ తేడా కనిపిస్తుంది. హైస్కూలు జీవితంలో టిఫిన్ కారియరు పట్టుకొని, ఇంత పుస్తకాల దొంతరా గుండెల కదుముకుని నడిచి వెళ్ళే ఆడపిల్లలు కాలేజీలో చేరగానే ఇట్టే మారిపోతారు. కంటిజబ్బున్నా లేకపోయినా కళ్ళకు పెట్టుకునే రోల్డుగోల్డు ఫ్రేము కళ్ళద్దాలూ, రిస్టువాచీలతో రావటమే కాక పాపం వాళ్ళు నడవ లేరు. ఇద్దరిద్దరూ కలిసి రిక్షా ఎక్కవలసిందే.

ఒక కన్ను కన్ను కాదు. ఒక బిడ్డ బిడ్డకాదు అన్న సామెత నా విషయంలో కూడా వర్తించింది. అక్కయ్య చావుతో నా మీద కళ్ళు పెట్టుకుని అమ్మా, నాన్నా బ్రతుకుతున్నారు. కాలేజీకి వెళ్ళుతుంటే అమ్మ ఎన్నోసార్లు 'జాగ్రత్తగా వెళ్ళమ్మా' అని చెపుతుంది. నాన్న "రిక్షా చేసుకుని వెళ్ళు సీతా. జాగ్రత్తగా కూచో. రిక్షావాడ్ని జాగ్రత్తగా తొక్కమను. జాగ్రత్తగా వెళ్ళిరా తల్లీ" అంటూ పదే పదే హెచ్చరించేవారు.

పిల్లల మనోభావాలూ, అభిలాషలూ, కట్టుబాట్లూ పెద్దల పెంపకం మీదనే ఎక్కువగా ఆధారపడి ఉంటయ్యి. తల్లి దండ్రులు డబ్బుగలవాళ్లయితే ఆ పిల్లలకు ఏ కొరతా సామాన్యంగా ఉండదు. కావలసిన బట్టలూ, పుస్తకాలూ, డబ్బూ అన్నీ ఇచ్చి మా పిల్లలే కదా ఇంత కష్టపడి చదువుకుంటున్నారనుకుంటారు. దాంతో ఆ పిల్లలకు ఇంట్లో లేనిపోని ఆధిక్యత పెరిగి పెంకితనం ఏర్పడి చెడిపోయే సావకాశాలూ లేకపోలేదు.

డబ్బులేని వాళ్లకు పిల్లల మీద ప్రేమ ఉన్నా వాళ్ళకు కావలసిన అవసరాలను ఎక్కువ తీర్చలేక కేవలంగా మాటల్లోనే సానుభూతి చూపిస్తూ వాళ్ళను బళ్ళల్లోకి పంపి చదివిస్తారు.

నా పరిస్థితి అటూ ఇటూ కాకుండా ఉంది. ఉన్నది ఒక్క కూతురేనని గొప్పవాళ్ళ పిల్లలమాదిరి అన్ని వసతులూ ఏర్పరచలేము. మధ్య తరగతి కుటుంబీకులంకదాని దానికి తగినట్లుగానే ఉండామనే ఉద్దేశ్యమూ ఉండదు. గొప్పవాళ్ళ పిల్లలతో సరితూగే రీతిగా నన్ను ఉంచాలని నాన్న తాపత్రయం కారణం ఒక్కగా నొక్క పిల్లని. ఆ రీతిగా భారీతనంగా ఖర్చు పెట్టాలంటే డబ్బు, అంటే నాన్నకు వచ్చే జీతం చాలదు. కారణం ఉన్న ఎకరన్నర పొలం అక్కయ్య పెళ్ళికి అమ్మేశారు. జీతం తప్ప పొలాల మీద వచ్చే రాబడి లేక అన్ని అవసరాలూ నాన్నగారికి వచ్చే జీతంలోనే సరిపెట్టుకోవాలి.

మా ఇంటికి నాలుగిళ్ళు అవతల ఒక సేల్సు టాక్సు ఆఫీసరుగారు కొత్తగా వచ్చారు. వాళ్ళమ్మాయి జ్యోతి కూడా కాలేజీలో చదువుతోంది. అమ్మాయి బి. యస్. సి ఫస్టు ఇయరు. రోజూ రిక్షా వాళ్ళింటికి వస్తుంది. ఎంతో చక్కగా ముస్తాబై రిక్షా కోసం కూర్చుంటుంది జ్యోతి. రిక్షా రాగానే రిక్షాలో కూర్చుని మా ఇంటి ముందుగానే నన్ను చూస్తూనే వెళ్ళి పోతుంది. నేను సందు చివరిదాకా నడిచి వెళ్ళి అక్కడి రిక్షా బేరంచేసి అప్పుడు రిక్షా ఎక్కి కాలేజీకి వెళతాను. అక్కడి నుంచీ కాలేజీకి అరణాలు. ప్రతి నెలా ఏ ఇబ్బందీ లేకుండా పదిహేను, ఇరవైయ్యో తారీఖు వరకూ రోజూ నాన్న రిక్షాకి డబ్బులిచ్చేవారు. తరువాత మళ్ళీ నెలాఖరుదాకా కొంచెం ఇబ్బంది పడుతూనే ఉండేవారు. రోజూ రానూ పోనూ ముప్పావలా రిక్షాకే అయ్యేది.

ఒకరోజున నాన్న అన్నారు. "సీతా. ఇద్దరికీ అయితే రిక్షా అర్ధరూపాయి క్కడతారు. నువ్వూ ఆ సేల్సు టాక్సు ఆఫీసరు గారమ్మాయి కలిసి వెళితే వేరో పావలాతో పోతుందిగా. ఆ అమ్మాయిని అడక్కూ పోయావా." అన్నారు.

"ఆ అమ్మాయి రోజూ నావైపు చూస్తూనే రిక్షాలో వెళ్తుంది నాన్నా. నన్ను పలకరించదు." అన్నాను.

"చూడమ్మా. వాళ్ల నాన్నగారు ఆఫీసరు. నీ తండ్రి గుమాస్తా. జరుగుబాటు వుండి గనుక అంత డబ్బూ ఇచ్చి ఒక్కర్తే వెళుతుంది. అవసరం మనది కనక నువ్వే పలకరించి అడిగినందువల్ల తప్పేం లేదమ్మా." అన్నారు. నాన్నగారి భావం నాకు అర్థమైంది. రోజుకి ముప్పావలా చొప్పున నా రిక్షాకే ఇవ్వాలంటే ఆయనకూ కష్టమే మరి.

"అట్లాగే నాన్నా. ఈరోజునే అడుగుతాను." అన్నాను.

కాలేజీకి వెళ్ళేముందే వాళ్ళింటికి వెళ్ళాను. నన్ను చూచి కొంచెం ఆశ్చర్య పడింది జ్యోతి.

"రండి. కూర్చోండి. కులాసా. ఏమిటి విశేషం" అన్నది జ్యోతి.

"ప్రస్తావన ఎట్లా తీసుకురావాలో తెలీక కొంచెం తికమక పడ్డాను."

"మీరు రోజూ కాలేజీకి రిక్షా మీద వెళుతున్నారను కుంటాను" అన్నాను.

"అవునండీ. మీరు నడిచి వెళుతున్నారా" అన్నది జ్యోతి.

"లేదండి. నేనూ రిక్షాలోనే పోతున్నాను. ఇద్దరం ఒక ఒజాను వాళ్లమే కనుక కలిసి వెళితే ఖర్చు కలిసొస్తుందేమోనని. మీ ఇష్టమైతే రోజూ ఇద్దరం కలిసే ఒక రిక్షాలో వెళదాం." అన్నాను బెరుగ్గానే.

జ్యోతి కొంచెం చులకన భావంతో నవ్వుతూ "ఎంత తగ్గుతుంది లెండి. రోజుకో పావలో అరణాలో కద. దాంతో మనమేం మేడలూ మిద్దెలూ కట్టబోం కద." అన్నది.

నేనూ పేలవంగా నవ్వి వూరుకున్నాను.

"మీకు ఇష్టమైతేనే. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ పోవచ్చు." అన్నాను.

"సరే అట్లాగే. ఇవ్వాళ నుంచే పోదాం" అన్నది.

బ్రతుకు జీవుడా అని 'థ్యాంక్సు' చెప్పి వచ్చేశాను. నాన్నగారు ఎంతో సంతోషించారు. ఆ రోజునుంచే ఇద్దరం కలిసి ఒక రిక్షాలోనే కాలేజీకి వెళ్లి ఒక రిక్షాలోనే సాయంత్రం పూట వస్తున్నాము.

కోరికలు జరుగుబాటు నుంచి కలుగుతయ్యి. జరుగుబాటు డబ్బు నుంచి ఏర్పడుతుంది. కేవలం అహంభావం, దర్జా, డాబుసరి కేవలం డబ్బువల్ల రాదు. అధికారం వల్ల వస్తుంది. ఉద్యోగాన్ని బట్టి అధికారం వస్తుంది.

సహాధ్యాయిని కాకపోయినా నేనూ కాలేజీలో చదువుకునేదాన్నే. తన ఈడుదాన్నే. విద్యాజ్ఞానమూ, ఇంగిత జ్ఞానమూ కలదాన్నే. మరి నేను అధికారి కూతుర్ని కాదు.

రిక్షాలో పోతున్నా జ్యోతి ముభావంగానే ఉండేది. అడిగే దానికే సమాధానం. పాపం ఆ అమ్మాయి స్వభావమూ అనుకుంటే అదేం కాదు. ఎంతో చక్కగా, చిలిపిగా, తెలివిగా మాట్లాడుతుంది. జ్యోతి స్నేహితురాళ్ళంతా కలెక్టరు గారమ్మాయి,

48 వ పేజీ చూడండి

# నా స్మృతిపథంలో

## దీపావళి

### టి. కృష్ణకుమారి



"బాలానాం రోదనంబలం..."

ప్రొద్దుటే మొదలు పెట్టింది రాగం మా 'జిప్పీ'. జిప్పీ అంటే మా అన్న రాము ముద్దుబిడ్డే లెండి!

'తెల్లారింది అప్పుడే' అంటూ కళ్లు తెరిచాను ఆగోలకి.

"ఎయిర్ కండిషన్డ్ రూంలోకి ఎర్రటి ఎండ రావులే! మరికొ మరి!" అంటూ మమ్మీ నవ్వి లేపారు. బద్ధకం వదలక మళ్లీ కళ్ళు మూసుకున్నా.

"ఓ కృష్ణ .... పిల్లలంతా లేచికూర్చున్నారు. 'కొత్తబట్ట లంటూ' .... ఆర్మీ బటాలియన్ లాగ క్యూలో నిలబడ్డారు. త్వరగ లేవమంటు నువ్వు కూడ."

మరి [illegible]

తొందరపడి తయారైపోయాడేమో ఈ సూర్య భగవానుడు ఈవేళ—ఏంచేస్తాం? లేవక తప్పలేదు. బద్ధకంగా కళ్ళు తెరచినా 'ఆరోజు' గుర్తుకు రావడంతో గభీల్ను లేచి కూర్చున్నా.

"దీపావళి" .... నాకు చాల ముఖ్యమైన పండగ. నేను మరవాపడే పండుగ. ఎన్ని దీపావళి పండుగలు చూసినా, ఏ యేటికి ఆ యేడు ఏదో ఒక కొత్తదనం కనిపిస్తూంటుంది. ఈ పండుగయే. పిల్లలు, పెద్దలు అంతా తమ వయస్సు మరచి ఒకటైపోయే తమాషా పండుగ ఇది ....

కళ్లముందు కాకారపువ్వొత్తి వెలిగింది .... చిచ్చుబుడ్డి, "వెలుగంతా నాదే ...." అన్నట్లు కాంతిని విరజిమ్ముతోంది.—

ఇంతలోనే—కళ్ళవెనుక మసకచీకటి మసిలింది—ఆరిపోయిన మతాబులా కొడిగట్టి కూర్చుంది. సిసింద్రిలా చిన్నప్పు తియ్యని ఏనాటికో ఎగిరి వెళ్ళిపోయింది.

ఓ దీపావళి ....

డాడి ఉన్నారప్పుడు ....

ప్రమిదల్లో చమురు పోయడం, వత్తులువేసి వెలిగించడం, వరుసగా ఇల్లంతా ఆ దీపాలలంకరించడం సరదా! ప్రాకులు వేసుకున్నే వయస్సు నాకది.

డాడీ దీపాలు చూచారు.

వారి కళ్లల్లో ఏదో కాంతి తళుక్కుమనేది.

"డాడీ .... వుయ్ ఆర్ రెడీ"

అనేవాళ్లం అంతా!—

డాడీ లండన్ నుంచి వచ్చాక ఇల్లంతా ఇంగ్లీషు పద్ధతినే మార్చేశారు. కాన్వెంటు చదువులు కావడంతో తెలుగు అంత సరళంగా వచ్చేదికాదు మా కెవ్వరికీ. పిల్లల సరదా అని ఈ పండుగ మాత్రం జరిగేది మా ఇంట్లో ....

డాడీ పడక కుర్చీలోనే పడుకుని ఆ దీపాలవైపు చూస్తూ హడావిడిగ తిరుగుతున్న 'మమ్మీ' ని చూస్తూ నవ్వారు.

అర్థంగాని మమ్మీ ఆగిపోయి డాడీవైపు చూచారు.

"These Earthen lamps enquire upon whose Paths we are burning?"

అన్నారు డాడీ— ఏదో ఆలోచన పోనివ్వి .... మమ్మీ నవ్వి వెళ్లిపోయారు అక్కణ్ణుంచి.

డాడి మాటలు అర్థమయ్యే వయస్సు కాదుగా నాకు అవాడు—మా గొడవ మాది .... రంగు రంగుల బట్టలు కట్టి, రకరకాల బాణాసంచా కాల్చి రాత్రంతా జాగారం చేస్తూ గడిపేవారం!

ఆ సంబరపు తొందరలో కాలిన చేతుల మంట మరునాడు గాని తెలిసేదే కాదు.

* * *

దీపావళి ....

డాడీ అన్న మాటలు మళ్లీ మళ్లీ గుర్తుకు వస్తూంటాయి తమ వెలుగు లోకానికి .... తనలో తాను హరించిపోతున్నా, ఆ జ్యోతి అందరిని ఆనందింపజేస్తుంది—తనకు తాను చీకట్లోనే నిలబడిపోతుంది! అందుకే మనస్సును మేలుకొలిపే వైతాళికుల్లా ఆ దీపాలు మన కళ్లల్లో మెదుల్తూంటాయి .... మన మనస్సుకేమేమో పాఠాలు చెబుతుంటాయి.

అదే అర్థమయితే ఇంకేం కావలి? ఈ అనంత విశ్వపు అతి రహస్యం కొస్త పట్టుబడి పోయినట్లే! .... కమ్మని కలగా ఆనందింపజేసి వెళ్లిపోతుంటుంది—అర్థంకాకుంటే?—అదీ ఈ దీపావళి.

ఎంతో వేదాంతం ఈ పండుగలో కనిపిస్తుంది. ఆ చిన్న దీప కళికలా వెలుగుతుంటాం. అది ఎవరికైనా ఉపకరించే రోజున మన బ్రతుకు అర్థం కనిపిస్తుంది. కాకుంటే చమురులేని వత్తిలా [illegible]

"అయ్యో—చీకటి అంటూ చీకట్లో చిందులు వేసేకన్నా ఓ చిన్న దీపాన్ని (చిరా) వెలిగించుకో—చీకటి చిన్నాభిన్నం అయిపోతుంది." అంటారు విశ్వకవీంద్రులు రవీంద్రులు.

ఇన్ని దీపాలు తోరణాలుగ మన కళ్లకు విందు చేస్తున్నా ఒక దీపకళిక మన హృదయంలో వెలిగితే కావలసిం దేముంటుంది ? సార్థక జీవితమై రాణిస్తుంది !

అందుకే డాడీ మాటలు అర్థంచేసుకోవాలి అక ! .... డాడీ అన్న మాటలకు అర్థం, మాకు వారి జీవితమే చెప్పింది చివరికి—

మనస్సుతెలుసుకుని దానికి ఒకమార్గంచూపేవారు.

ఒకరి భావాల్ని గౌరవించడం, ఒకరి విశ్వాసాన్ని కాదనకపోవడం డాడీలో ఎక్కువ !

అందుకే అంతటి స్వతంత్రత—దానిలో పవిత్రత మాకు లభించగలిగా యనుకుంటా ! దాంతో పాటు వారి ఆదర్శమే సౌన్నంటి పెంచుతూ వచ్చింది మమ్మల్ని. అందుకే డాడి జీవితం మా అందరికోసం అయింది. మా భవిష్యత్తు గురించే వారు ఆలోచించేవారు. మా అభివృద్ధినే ఆకాంక్షించేవారు—

డాడి ఆదర్శం—మమ్మీ సౌజన్యం మమ్మల్ని తీర్చిదిద్దాయి.

క్రమేణా, మా అక్కా చెల్లెళ్లపై మీ అందరి ఆదరాభిమానాలు కలిగాయి!

* * *

మనలో మసకచీకటి ముసుగు బిగించుకుని ఉంటుంది.

దాన్ని తొలగించుకుంటేనే మనస్సుకు వెలుగు దిక్కుతుంది.... అందుకే ఏనాటికైనా, ఎన్ని దీపావళులు గడిచినా—ఎన్ని దీపాలతో ఇల్లంతా అలంకరించి వేడుకలు చేసుకున్నా, ఒక చిన్న దీపాన్ని మనలో వెలిగించుకుని చీకటి తెరలు చీల్చుకుని వెలుగు కిరణాలు నింపగలిగితే మన జన్మ ధన్యమై తీరుతుంది.

"Oh! Lord Lead Kindly Light!"

అని ఈ దివ్య దీపావళినాడు దీనజన రక్షకుణ్ణి అర్థించుతాం—ఆ వెలుగు చూచేవరకు శ్రమించుదాం— వెలుగు కిరణాలతో వికసిత జీవులమైన రోజున, విశ్రమించుదాం—

* * *

దీపావళి !

మమ్మల్ని లేవమంటున్నారు.

'జిప్సీ' ఏడ్పు చాక్లెట్లు చూసేసరికి బంద్ అయిపోయింది. పండుగరోజు తీపి తలపుల తలపునకలు వేద్దాం—

"మీ వెలుగులో మా దారి వెన్నెలలై ప్రకాశించాలి" అంటూ ఆ జ్యోతులు వెలిగించుదాం.

త్యాగమంటే ఏమిటో, జీవితమంటే ఏదో నివలనే మాకు తెలియాలని ఆ పర్వదినాన్ని పవిత్రంగా ఒక క్షణం ఆలోచనలో నిలుద్దాం—

ఆపైన—కళ్లముందు కాకరపువ్వొత్తి వెలుగుతుంది. చిచ్చుబుడ్డి తారాజువ్వలా ఆకాశాన్ని అంటుతుంది.

దీపావళి—

దేవతల దీవెనలను తెస్తుంది.

అందరికి శుభాలను ఇస్తుంది.



# గృహిణులకు మరికొన్ని చిట్కాలు!

(1) వర్షాకాలంలోను, చలికాలంలోను, పచ్చిమిరపకాయలు గంట గంటకు కుళ్లి చెడిపోతూ ఉంటాయి. అలాంటప్పుడు మిరపకాయలకు తగ్గ ఉప్పు, చిటికెడు పసుపు వేసి, వంచి ఒక తెల్లటి సీసాలో వేసి గాలి చొరకుండా మూతపెట్టి, సీసాను గాలి తగిలే చోటున ఉంచాలి. ఇది పది, పదిహేను రోజుల వరకు ఉంటుంది. అన్ని వంటలకు వాడుకోవచ్చు.

(2) ధాన్యం డబ్బాలలోకాని నిలువ ఉంచితే పురుగులు పడుతుంది. కొంచెం పిడక పొడి బూడిద కలిపి ఉంచితే పురుగు పట్టదు.

(3) వర్షాకాలంలో పచ్చి కొబ్బరి ఎండనివ్వాలంటే కూడ ఎండదు. అలాంటప్పుడు ఎండు కొబ్బరి కోరే పీటతో కొబ్బరి బాగా కోరి, బూరెల మూకుడుతో వేసి పదిహేను నిమిషాలు వదిలి ఐదు నిమిషాలు వేయించాలి. ఇలా ఐదారుసార్లు చేసిన, ఒకనెల రోజులవరకు నిల్వ ఉంచుకోవచ్చు.

(4) ఎండాకాలంలో హారతి కర్పూరము పెట్టిన చోటే కరిగిపోకుండా, రెండు మిరియాలు, రెండు బియ్యపు గింజలు హారతి కర్పూరపు సీసాలో వేసి ఉంచాలి.

(5) బృందావనంలోని తులసీ మొక్కలను పురుగు తినకుండా ఉండడానికి మొక్కల జతకు ఒక ఉల్లిపాయ (ఉల్లిగడ్డ) ను పాతి ఉంచాలి.

(6) రెండు మూడు స్పూనులంత కిరోసిన్ నీళ్లలోవేసి, బాగా కలిపి, కాశ్మీరు, నార చీరలు ముంచి తరువాత ఉదకాలి. ఐదారుసార్లు ఉతికినప్పుడలా చేసిన చీరలు చిల్లులు పడవు.

(7) స్వెటర్లు మూడు నెలలు ధరిస్తే తొమ్మిది నెలలు పెట్టెలో పెట్టాల్సి ఉంటుంది. పెట్టేటప్పుడు పేపర్లోకాని కవర్లోకాని వేసి పెట్టితే చిల్లులు పడవు.

(8) తరిగిన అరటిముక్కలు నల్లపడకుండా ఉండడానికి నీళ్లలో చిటికెడు పసుపువేసి ముక్కలు వేయండి.

(9) తరిగిన నిమ్మ ముక్కలు దంచిన ఉప్పుతో ఉంచితే రెండు మూడు రోజులైన చెడకుండా ఉంటుంది.

(10) మునగాకు కూర వండడానికి ఒకరోజు ముందు ఆకు (కాడలతో) పొడి గుడ్డలో చుట్టి ఉంచాలి. రెండో రోజు ఆకంతా గుడ్డలో అడుగున రాలి కాడలు మాత్రము పైన నిలిచివుంటాయి.

(11) ఉల్లిపాయ అడ్డంగా కోసి దోసెల పెనం పైన రాస్తే దోసెలు చెడకుండా వస్తాయి.

(12) మామిడి ముక్కల పులుపు దగ్గాలంటే చింత గింజంత సున్నం నీళ్లలో కలిపి ముక్కలు కడగాలి.

(13) రోజాపువ్వు రేకులు వూడకుండా ఉండడానికి పూలు తేగానే ప్రతి పువ్వు మధ్య ఒక చుక్క కొబ్బరి మానె వేయాలి.

(14) అలం తడిగుడ్డతో చుట్టి నీళ్లకుండపై ఉంచితే వారం రోజులవరకు తాజాగా ఉంటుంది.

(15) నిమ్మకాయలు ఎండకుండా ఉండాలంటే రోజుకు గంటసేపు చల్లనీటిలో వేసి తియ్యాలి.

(16) పాలు సరిగ్గా, గట్టిగా తోడాలంటే ఒక విస్తర ముక్కను పాలలో వేసి తోడెయ్యాలి.

(17) ముత్యాల నగలు షైనింగు పోకుండా ఉండాలంటే ఎరుపు పట్టు గుడ్డలో ఉంచాలి.

(18) స్టీల్‌పాత్రలు కొన్నప్పటి షైనింగ్ ఉండాలంటే రోజు చింతపండుతోనే తోమాలి.

(19) బెల్లం దీపానికి చూపిస్తే కరిగి క్రింద పడుతుంది. పడిన బెల్లం ఉండగాచేసి నోటలో ఉంచుకుంటే దగ్గు వెంటనే నిల్చిపోతుంది.

(20) పసుపు మరకలైన గుడ్డకు సోపువేస్తే ఎరుపు అవుతుంది. ఉతకడానికి ముందు ఎండలో ఆరవేస్తే పసుపు మరకలు పోతాయి.

(21) మనము రోజు వాడే అద్దాలు తళా తళా మెరియాలంటే పొడిసున్నం అద్దానికి రాసి పొడి బట్టతో తుడియాలి.

(22) సగంపిండి, సగం ముగ్గుపిండి కలిపి ముగ్గులు పెట్టితే దూరానికి కూడా అందంగా కనపడుతుంది.

(23) నైలాన్, టెర్లిన్ గుడ్డలతో ఫ్రాకులు, జాకెట్లు, కుట్టుకుంటే పోగులు పోతాయి. అలా పోకుండా ఉండడానికి జాయింట్లు మొదట రైటు సైడుకు కుట్టి తరువాత రాంగ్‌సైడులో కుట్టాలి.

(24) వేయించిన వడియాలు మిగిలిపోతే గాలికి మెత్తబడిపోతాయి. డబ్బాలోవేసి బాగా మూత పెట్టితే వారం రోజులైన తాజాగా ఉంటాయి.

(25) పాలు కుంపటిపైన ఉంచి మూతపెట్టితే పొంగుతాయి. లేక మీగడ కట్టదని భయం. మూత పెట్టకపోతే దుమ్ముపడుతుందని భయం. అలాంటప్పుడు పాలు గిన్నెపై గరిటె అడ్డంగా ఉంచి పైన మూత పెట్టాలి. రెండు భయాలూ ఉండవు.

(26) కుంపటిలోని నిప్పులను ఆర్పాలంటే కొందరు నీళ్ళు చల్లుతారు. తిరిగి వాటిని అంటించాలంటే కష్టం. నిప్పును పాత డబ్బాలోవేసి గాలిపోకుండా మూతపెట్టాలి. వెంటనే ఆరిపోతుంది.

(27) పుత్తడి డబ్బాలు నిలగనిగలాడాలంటే వారానికి రెండుసార్లు పొడి పిడక బూడిదతో తోమి, పొడి గుడ్డతో తుడిచి ఉంచండి.

(28) అరటి పూచ (దిండు) ముక్కలు నీళ్లలో వేసి, ఒక స్పూను పుల్ల మజ్జిగ వేసి, కవ్వముతో చిలకాలి. దాని వల్లని వార కవ్వానికి అంటుకుని వెంటనే వస్తుంది.

## చిట్కాలు

(29) కంట్లో ఏమైన పడితే వెంటనే మూడు అడుగులు వెనక్కు నడవండి. పడిన పదార్థము కంటి కొనలకు వస్తుంది.

(30) పప్పు ఉడికేటప్పుడు పొంగుతుంది. చిటికెడు నెయ్యి, ఒక స్పూను నూనెవేస్తే పొంగదు.

(31) [illegible] చమురంతా జాకెట్టు పైన భాగాన అంటుతుంది. నల్ల జాకెట్ అయితే మరీ ఎక్కువగా కనబడుతుంది. సోపువేసి ఉతుకు తారా జాకెట్ కళా, కాంతి పటాపంచలైపోతుంది. తిరిగి దాని మెరుపు రావాలంటే ఇలాచేసి చూడండి: ప్రత్తితోకాని గుడ్డముక్కకాని పెట్రోల్లో అద్ది జాకెట్పైన చమురున్న చోటల్లా రాయండి కొంత సేపటికి పెట్రోలు, జాకెట్ మీద నుంచి ఇంకిపోయి తిరిగి మీకు కొత్తగొల్ల జాకెట్ లభించినట్లు ఉంటుంది.

(32) మజ్జిగ (చల్ల), [illegible], [illegible] కావాలంటే గోరువెచ్చని పాలలో నిమ్మకాయ రసం పిండి, ఉప్పు వేయండి. కమ్మని, తియ్యని, మజ్జిగగా తయారవుతుంది.

—రా. వసంత ★

# వనితా వాణి

### మడి - ఆచారం

'మడి - ఆచారం' వ్యాసం చాలా నచ్చింది. 'మడి' పూర్తిగ వదలమని కాదు ఈ వ్యాసం యొక్క సారాంశం. కాని ఒకరికి హాని, మనకు నష్టం లేకుండా చెయ్యమని చెప్పడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం అని నేను గ్రహించాను.

కానుగొని సరళాదేవి (కొవ్వూరు)

[illegible] బాగున్నది. తడి బట్టతో నీళ్ళు కారుతూ పని చేస్తేనే మడి అనుకునేవారు చాలా మంది ఉన్నారు. మా చుట్టాలలో ఒకామె ఉన్నది. తలనిండా స్నానం చేసి తడి బట్టతో పని చేస్తేనే మడి అంటుంది. తడి బట్ట పిండుకున్నా. వారి మడికి భంగం కలుగుతుంది. తడి బట్టతో నీళ్ళు కారుతూ చేస్తేనే మడి అన్న మాట ఎట్లా ఉన్నా ఒంటికి ఆరోగ్యం లేకపోగా, బట్టనీళ్ళు తినే పదార్థాలతో పడి రోతగా ఉంటుంది. ఆచారము మాట మరిస్తే ఆరోగ్యముగానైనా ఉంటారు. రాధ గారు వ్రాసిన వ్యాసం నాకు బాగున్నది. మడి అనే పేరుతో మగాళ్ళ ప్రాణాలను విసిగించేవారు మా కుటుంబాలలో కొల్లలు.

డి. రోహిణి (ఉప్పిపాలెం)

### వంటలు

10—10—64 సంచిక వనితాలోకంలో "అవియల్" ఎలా తయారుచెయ్యాలో శ్రీమతి పద్మాలక్ష్మిగారో, కుమారి మణిగార్లు వ్రాశారు. చిన్న సవరణ. అవియల్ తయారుచెయ్యాలంటే ముందు అనపకాయ, గుమ్మడి, అరటికాయ, ఆలుగడ్డ, కాలిఫ్లవర్, దొండకాయ, క్యారట్, బూడిద గుమ్మడికాయ, ములక్కాయ, బీన్స్, గోరు చిక్కుడు, కారట్ మొదలగు కూరలన్నీ ముక్కలుగా కోసి, స్టవ్ పైన ఒక స్టీల్ పాత్ర ఉంచి అందులో ఈ ముక్కలన్నీ (ఒక్కమారు) వేసి మెత్తగా ఉడికించమన్నారు. పైన చెప్పిన కూరలలో కొన్ని మరీ తొందరగా, మరికొన్ని మరీ ఆలస్యంగా ఉడుకుతాయి. అటువంటప్పుడు ముక్కలన్నీ ఒక్కమారు ఉడికిస్తే ఆలస్యంగా ఉడుకుతున్న కూరలకుగాను వేచియుంటే, తొందరగా ఉడికే కూరలు మాడిపోతాయి. తొందరగా ఉడికే కూరలు మెత్తబడగానే గిన్నెను క్రిందికి దించుదా మనుకుంటే ఆలస్యంగా ఉడికే కూరలు పచ్చిగానే ఉండిపోతాయి. అందుకని ముందు ఉడికే కూరలన్నీ ప్రత్యేకంగా ఓ గిన్నెలో ఉడికించాలి. వీలయితే అన్ని కూరలూ వేరువేరుగా ఉడికించినా బాగుంటుంది. మరొక్కమాట. స్టవ్ [illegible] ఇంత ఉప్పూ, నీరూ పోసి మూతవెయ్యాలన్నారు. ఉప్పు కనుక కూరలు ఉడకడానికి ముందు వేస్తే కూరలు ఎంతకీ మెత్తబడవు. ఉప్పు నీళ్ళలో పప్పుగాని, కూరలుగాని, ఆలస్యంగా ఉడుకుతాయి. పప్పు అయితే చాలాసేపటికు ఉడకవు. కూరలు సగానికి పైగా మెత్తబడ్డాక ఉప్పు వెయ్యడం మంచిది. ఇంకా చెప్పాలంటే అవియల్ పూర్తిగా తయారయ్యాక ఉప్పు వేసినా ఫరవా లేదు. ఈ విషయం పాఠకులందరూ గమనించ ప్రార్థన.

కుమారి టి. భామాదేవి (హైదరాబాద్)

### ప్రోత్సాహం

ప్రోత్సాహం లేకపోతే మనలో ఎన్ని విద్యలున్నా అవి అభివృద్ధి చెందలేవు. ఈ వ్యాసం చదవగానే ఉత్తరం వ్రాయాలనిపించిన కారణం.. నాకు తగిన ప్రోత్సాహమిచ్చే వాళ్ళు లేకపోవడంతో నాకు అశ్రద్ధ ఏర్పడి నా సంగీతం మూలపడింది. ఈ వ్యాసం చదివిన తరువాత దుర్గకులాగా నన్ను కూడా ప్రోత్సహించే వాళ్ళు, సంగీతాభివృద్ధికి తోడ్పడే వాళ్ళు లభిస్తే, ఎంత బాగుంటుంది. అని అనిపించింది.

కుమారి జి. టి. కుమారి (మచిలీపట్నం)

### ఎదురుచూసిన ఆదివారం

"ఎదురు చూసిన— ఆదివారం" చాలా బాగుంది. అది చదువుతుంటే ఆదివారం మా అమ్మ పడే బాధ జ్ఞాపకానికి వస్తుంది.

ఎ. నరసింహులు (చిత్తూరు) ★

# వంటలు

### మైసూర్ ఖీర్

**కావలసిన వస్తువులు :** అర కిలో శనగపప్పు, అర కిలో బెల్లం, అర లీటర్ చిక్కటి పాలు, ఒక కొబ్బరికాయ, 150 గ్రాములు మంచి నెయ్యి, 100 గ్రాములు జీడిపప్పు, కిస్మిస్ పళ్ళు, యాలకులు ఇష్టమైతే పిస్తా మొదలగు పలుకులు కూడా వేసుకోవచ్చు.

**చేయువిధము :** శనగపప్పు శుభ్రపరచి, కొద్దిగా వేయించాలి. ఒక గిన్నెలో పప్పు వేసి, పూర్తిగా మునిగి ఆ పైన మూడంగుళాలుండేట్లు నీళ్ళుపోసి, మెత్తగా ఉడక బెట్టాలి. కొద్దిగా నీరుండగానే దింపి, ఆ నీటిని ప్రక్కకు తీసియుంచాలి. ఒకవేళ పప్పు మెత్తగా ఉడక్కపోతే చేతితో నలుపుతూ మెత్తగా చేయాలి. అందులో పాలు, శుభ్రపరచిన బెల్లము, సన్నగా తురిమిన కొబ్బరి వేసి, ఉడక బెట్టగా మిగిలిన నీటిని కూడా పోయాలి. బాగా కలియబెట్టి, మరగబెట్టాలి. చిక్క బడిన తర్వాత నెయ్యి, యాలకులపొడి, కిస్మిస్ పళ్ళు, తరిగి జీడిపప్పు ముక్కలు వేసి మూతవేయాలి. ఐదు నిమిషాలు మళ్ళీ మరగనిచ్చి, దించాలి.

ఈ దీపావళికి తక్కువ ఖర్చులో, చక్కని పిండి వంట తయారైందన్న మాట.

శ్రీమతి కృష్ణ మన్మోహన్. (సికింద్రాబాద్) ★



# మీ చర్మానికి తగినది




# నివియా

## ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను గోల్పోవునట్టి మీ చర్మమందలి చమురులను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్యవంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది. నివియా — ఇప్పుడే!

నివియా — వివిధోపయుక్తమైన క్రీమ్.




Nivea C-248-TEL

ఇండియాలో సోల్ డిస్ట్రిబ్యూటర్లు: జె. ఎల్. మారిసన్, సన్ & జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్,
పోస్టు బాక్సు నెం. 1746, బొంబాయి-1





### జరిగిన కథ

విభిన్న మనస్తత్వాలు గల అయిదుగురు అమ్మాయిల తండ్రి రామయ్యగారు. ఆయనకు మద్రాసులో వాచీల వ్యాపారం. రామయ్యగారి స్నేహితుని కొడుకు సుధాకర్ మద్రాసు చూడటానికి వచ్చి వాళ్లింట్లో దిగుతాడు. అమ్మాయిలందరూ అతని వాలకాన్ని రెండురోజులపాటు గమనించి త్వరగా పొగనంపటానికి పలువిధాల ప్రయత్నాలు చేస్తారు. కాని అవేవి సుధాకర్ మీద పని చెయ్యవు. కళ ముభావంగా ఉంటం చూసి సుధాకర్ కలవర పడ్డాడు. అతని మిత్రుడు మోహన్‌తో ఆలోచించి యింటికి తీసుకెళ్ళాడు. అక్కడ అతనికి గీతతో పరిచయమౌతుంది. రామయ్యగార్ని చూసిన మోహన్ పారిపోతాడు. ప్రభాకర్‌ను పేరుపొందిన హస్తసాముద్రికునిగా తనతండ్రికి పరిచయం చేస్తుంది ఉష. ఆయన ఆప్యాయంగా తమయింటికి ఆహ్వానిస్తాడు. ప్రభాకర్ ప్రయాసపైన సమ్మతిస్తాడు. రోజూ లైబ్రరీకి వెళ్లి అతి కష్టంమీద హస్తసాముద్రికం పుస్తకాలన్నీ చదివి రామయ్యగారికి నచ్చేనట్లు సాముద్రికం చెప్పాడు.

(గతసంచిక తరువాయి)

సుధాకర్ ఎడం చెయ్యి పంట్లాం జేబులో పెట్టుకుని రెండో చేత్తో పొగ్గా సిగరెట్లు దమ్ములాగుతూ రోడ్డు మీద వచ్చే పోయే కార్లను చూస్తున్నాడు మధ్యమధ్య మోహన్ మాటలకు ఊం కొడుతూ. . .

సడన్‌గా సుధాకర్ గాభరా పడటం చూసి "ఏమొచ్చిందిరా భాయ్! అలా గాభరా పడతావ్ ?" అనడిగాడు మోహన్.

సుధాకర్ చేతిలోని సిగరెట్టును హడావిడిగా రోడ్డు మీద పారేసి "[illegible]" అన్నాడు.

"హారి నీ ఇల్లు బంగారం కాను! కళే కదా ? కాళికాదేవిని చూసినంత కంగారు పడిపోతా వేమిటి ?"

"నా చేతిలో సిగరెట్టు చూసిందంటే సాక్షాత్తూ కాళికాదేవే. . .! అదీగాక ఆవిడకోసం సిగరెట్లు మానేసినట్టు కూడా చెప్పాను. . కళ్ళారా చూసిందంటే మళ్ళా మా కథ మొదటికొస్తుంది. . ."

"మీ ఇద్దరి మధ్య రాజీ కుదిరింది కదా ?. . . ట్రాన్సిస్టర్ పుచ్చుకోమంటావా ? ఆ ముసలాయన్నాడే దేవాంతకుడురా. . . చూస్తే అమాంతం పీక నొక్కుతాడు. . ."

"నాకు దాకా నువ్వెక్కడుంటావ్ ? రయ్యమంటూ గాలిలో దూసుకు పోవూ ? నాలుగు మంచి మాటలాడి మెల్లిగా ఆ ట్రాన్సిస్టర్ తీసుకుందూ. . ఏ కళ నున్నదో ఇప్పుడు మాట్లాడిందనుకో. అయినా మళ్ళా ఏ క్షణంలో కళకు కోపమొస్తుందో ఎవరు చెప్పగలరు ?. . ఆ ట్రాన్సిస్టర్ గీత దగ్గర ఉన్నంత వరకు నాకు మనశ్శాంతి ఉండదు. నీ పుణ్యమా అని గీత ఇప్పుడు రేడియో ధ్యాసలో లేదనుకో. . . అన్నట్టు మర్చిపోయానురా— వాళ్ళు రెండు, మూడు రోజుల్లో ఊరికెళ్తున్నారు. . నువ్వొప్పి తీసుకో పోయావంటే ఆ ట్రాన్సిస్టర్ నాకింక దక్కదు. . ఆ పిల్ల నా మాటే మర్చిపోయి తనతో పట్టుకుపోతుంది. . ."

కళ సరాసరి అక్కడకే వచ్చింది.

"ఇక్కడేం చేస్తున్నారు— ?" కెవ్వుమంటూ కాలు పట్టుకుంది.

"మీ మగవాళ్ళకి ఇదేం పోయేకాలం ? నడిరోడ్డు మీద కాలుతున్న సిగరెట్లు కాస్త గిరవాటేస్తారు కదా ఎవరైనా చూడకుండా అడుగేసారంటే. . అబ్బా. . ." అంటూ కళ కాలు చేత్తో పట్టుకుని వూదుకున్నది సుధాకర్ కేసి కొరకొరా చూస్తూ.

సుధాకర్ దిగులుగా చూశాడు.

మోహన్ "అబ్బే! అది వాడు కాల్చిందే ? ఆ సిగరెట్టు పీక ఎవరు పారేశారో, ఏమో ? వాడు సిగరెట్లు కాల్చటం మానేశాడు. . . ఇంక నేనంటారా ? నాకసలు సిగరెట్లు వాసనే గిట్టదు." అన్నాడు సుధాకర్ తరఫున సాక్ష్యమిస్తూ.

"పీకేమిటి ? అంటుంటేను ? మీరు కాళ్ళపోతే మరోకడు. . క్రిందా, మీదా తెలియని వెధవ. ఇలా అంటించి అలా అవతల పారేశాడు. . ." అంది కళ మధ్య మధ్యలో బాధగా 'ఉష్', 'ఉష్' అనుకుంటూ.

సుధాకర్‌కు చెవులు మూసుకో బుద్ధి వేసింది.

"పాపం! ఎందుకలా తిడతారు ? నిండా సిగరెట్టు అలా పారేసాడంటే [illegible] ఉండక పోదు. . ." అన్నాడు.

"కొవ్వెక్కిన వెధవకి కారణమేమిటి ? టపాకాయలా ఇలా అంటించి అలా పారేస్తే ఎవరికైనా కాలు చుర్రుమంటుందనే జ్ఞానం ఉండక్కర్లే!"

"చెప్పులు వేసుకోకుండా ఉత్త కాళ్ళతో నడవటం మీ తప్పు.."

"నా చెప్పులు ఇప్పుడే తెగిపోయాయి. . . అందుకే భద్రంగా కాయితంలో చుట్టి బుట్టలో పడేశాను. . . నా మాట వదిలెయ్యండి. ముందు

చంలో సగానికి సగం మంది తిండిలేక పస్తులుంటున్నారట. . . వాళ్ళు చెప్పులు వేసుకుని తిరగ్గలరా మీరిలా రోడ్డు మీద కాలూ కాస్తున్న సిగరెట్లు పారేస్తారని. . . ?”

సుధాకర్ తేలిగ్గా శ్వాస విడిచాడు.

“అమ్మయ్య ! వాళ్ళకోసమా మీరు విచారిస్తున్నది ? మీకోసమే కాబోలనుకుని కంగారు పడ్డాను. . . డబ్బులేని వాళ్ళను గురించి మీరు ఆలోచించకండి. వాళ్ళు ఈ నడిరోడ్డంట నడిచి వెళ్ళరు. ఈ రోడ్డంట సినిమా వాళ్ళ కార్లు వాయువేగంతో పరుగు లెట్టి వెళ్తుంటాయి అందుకని వాళ్లు మరో త్రోవంట నడిచి వెళ్తారు. ఒక వేళ ఏ దరిద్ర గొట్టు వెధవో ఉత్తకాళ్ళతో నడిచి వెళ్ళినా వాడి కాళ్ళు మీ అంత సున్నితంగా ఉండవు లెండి. వాడు మీలా ‘కుయ్యో’ మంటూ కాలు పట్టుకోడు. . . పాపం ? బాగా కాలిందా ? చూడనివ్వండి ?” అంటూ సుధాకర్ వంగి కళ కాలు పట్టుకుని చూశాడు.

ఎర్రగా బొబ్బ ఎక్కిన చోట చేత్తో తడమబోయేసరికి “ అమ్మో ! ” అంటూ కళ కాలు వెనక్కు తీసుకున్నది.

“ కాలు కట్టమంటారా ? ”

“ దేనితో . . . . . ? ”

సుధాకర్ ఆలోచిస్తున్నట్టుగా చూస్తూ అన్నాడు.

“ మరే ! ఆడవాళ్లయితే పమిట చెంగు పరపరా చింపి ఒట్టే కట్టు కట్టేస్తారు. . . . మేమైతే నోటితో జాలి పడాల్సిందే కాని క్రియలో చూపిద్దామంటే చిన్న గుడ్డ ముక్క కూడా దగ్గిరుండదు...”

“రుమాలుందిగా ? ” అని జ్ఞాపకం చేశాడు. మోహన్ రుమాలుతో ముక్కు తుడుచుకుంటున్న సుధాకర్‌ను చూసి.

“ఆ ముక్కు చీదుకునే గుడ్డతో నాకేం మీరు ఉపచారాలు చేయనక్కరలేదు . . . .” అంటూ కంగారు పడింది కళ.

సుధాకర్ కాస్సేపాగి షర్టు రెండు చేతులతో సాగదీసి పట్టుకుని “ఈషర్టు చింపి కట్టనా ..?” అన్నాడు.

కళ నవ్వింది.

“ కృష్ణుడు చెరుకు గడ చీల్చుకు తింటూ వేలు కోసుకున్నాడట .... రక్తం కారుతూ ఉంటే సత్యభామాది భామలు ఏం చెయ్యాలో తోచక కంగారు పడుతుంటే ద్రౌపది మీరన్నట్టు పమిట చెంగు పరపరా చింపి రక్తం తుడిచి కట్టు కట్టిందట. కృష్ణుడు ఎంతో సంతోషించి ఆ పేలికలో ఎన్ని పోగులున్నవో అన్ని చీర లిస్తానని ద్రౌపదికి వర మిచ్చాడట. అందుకే ద్రౌపదీ వస్త్రాపహరణ సమయంలో అక్షయంగా వలువ లిచ్చాడట.... అలా మీరు కూడా అక్షయంగా షర్టు లివ్వగలననుకుంటున్నారా ? నిష్కారణంగా గట్టి షర్టును పట్టుకుని బలవంతంగా చింపకండి.... అక్షయం కాకపోగా ఉన్నది కూడా క్షవరమై పోతుంది ....”

“మరేం చేద్దాం?”

“ ఏం చేయనక్కర్లేదు..... మందూ, మాకూ లేకుండా అనవసరంగా కట్టెందుకు ? అదే నే నిందాక అడిగింది ! మీరు మరోలా అర్థం చేసుకుని ఇంతసేపూ తికమక పడిపోయారు. . . . . .”

“ సరే ఏదో ఒకటి కానివ్వండి ! ఇంతకీ ఎక్కడికి వెళ్తున్నట్టు . . . . . . ? ”

కళ నీరసంగా జవాబిచ్చింది.

“ మరెక్కడికీ లేదు తిన్నగా ఇంటికే ..... మా స్నేహితురాలింటికి వస్తే అది కాస్తా ఊళ్ళో లేదు..... అందుకని ఉసూరుమని తిరిగి వెళ్తున్నాను.”

సుధాకర్ సానుభూతి చూపించాడు.

“ ఇంతటి మహా నగరంలో మీరు ఎక్కడికన్నా అకస్మాత్తుగా వెళ్తే ఇలాంటి ఆశాభంగాలు తప్పవు... ముందుగా మీరు ఒక ఉత్తరం ముక్క రాసి పడేస్తే మీకీ శ్రమ తప్పేది. . . . . ”

కళ మూతి ముడుచుకుంది.

“ అవున్లెండి. . . . ! ఇవ్వాళ నేను చేస్తున్నవన్నీ తప్పులే ! ఇందాక ఉత్త కాలుతో కాలుతున్న సిగరెట్టు మీద అడుగు వేయటం ఒక తప్పన్నారు. ఇప్పుడు చెప్పకుండా రావటం మరో తప్పంటున్నారు.”

సుధాకర్ గాభరాగా “ మీ చెప్పులు తెగిపోయాయన్నారు.... ఇలా కాస్త దూరం నడిస్తే చెప్పులు కుట్టే తెలుగు వాడున్నాడు. వాడి దగ్గర కెళ్దాం రండి.....” అంటూ ముందుకు నడిచారు.

“ కళ, మోహన్ సుధాకర్ వెంట నడిచారు.

సుధాకర్ ఉన్నట్టుండి “ మీ కాలు గొడవలో పడి మావాడిని పరిచయం చేయటమే మర్చిపోయాను. . . . వీడు మోహన్ అని నా ఫ్రెండ్ — నేటి సామాన్యుడు, రేపటి మేటి నటుడు ....” అని చెప్పాడు.

“ ఇది వరకో మాటు చూశాను లెండి .....” అని నోరుజారి కళ సుధకర్‌కు కనబడకుండా నాలుక కొరుక్కుంది.

ఈలోగానే “ ఎప్పుడు చూశారు ? ” అని అడగనే అడిగాడు సుధకర్ ఆశ్చర్యంగా చూస్తూ.

“ ఎక్కడో చూసినట్టు గుర్తు !” అని తప్పించు కున్నది. కళ.

మోహన్ కళ కేసి చూస్తున్నాడు ..... కళ ముఖం తిప్పు కున్నది. . . . ఎక్కడో ఏమిటి ? గీత, గీత పక్కన మోహన్ . . . . సినిమా హాల్లో . . . అసలు అప్పటి నుంచేగా తన మనస్సు తేలిక పడింది..!

ఒక చెట్టు నీడన చెప్పులు కుట్టేవాడు చిరిగిపోయిన పాత చెప్పులన్నీ పరుచుకుని కూర్చున్నాడు. కళ చేతికి తగిలించుకున్న ప్లాస్టిక్ బుట్టలోనుంచి చెప్పులు బైటికి తీసింది. ఒక చెప్పుకు తాడు తెగిపోయింది. చెప్పులు కుట్టేవాడు చెప్పు చేతిలోకి తీసుకుని కుట్టబోతుంటే కళ “ ముందు ఎంత కావాలో చెప్పు ! ” అంది. వాడు “ బేడ డబ్బు లివ్వండమ్మా ! ” అన్నాడు. బేడకు బేరమాడేదేమిటని సరే కుట్టమంది కళ. తీరా ఒకటి బాగయ్యేసరికి రెండోది ఊడొస్తుందేమోనని అనుమానం వేసి అది కూడా గట్టిగా కుట్టమంది. రెండు చెప్పులూ కుట్టటం అయ్యాక వేసుకు చూసింది.

“ బాగున్నాయండి ? ” అనడిగింది కళ, సుధకర్ మోహన్‌ల నుద్దేశిస్తూ.

ఒకళ్లు ఫస్టు అంటే మరొకళ్లు బెస్టు అన్నారు.

కళ సంతృప్తిగా వాడి చేతిలో పావలా పెట్టబోయేసరికి వాడు “ పావలా కాదు, రూపాయి రావాలి — ” అన్నాడు.

“ ఇదేమిటి ? ఇందాక చెప్పుకు రెండణాలే అన్నావుగా ? ” అనడిగింది విస్తుపోతూ ళ.

“బటన్‌కు పది నయాపైసలమ్మా. పైనైన చెప్పుకు ఆరు, రెండో దానికి నాలుగు ఏశాను.. మీకు కాబట్టి పావలా తగ్గిస్తున్నాను. మూడు పావలాలు చేసుకుని ఇచ్చెయ్యండి. . . .”అంటూ చిరచిర లాడాడు.

“నువ్వు బటన్ ఎవడెయ్యమన్నాడోయ్ ? కావాలంటే తీసేసుకో !” అని బెదిరించాడు సుధాకర్.

“తీయడానికి ఇప్పుడదెలా వస్తది ?. . . . మిగతా అర్థరూపాయి ఇలా పడెయ్యండి. . . .” అంటూ పేచీ పెట్టాడు.

“వీడితో మాట్లాడి ప్రయోజనం లేదు. . . మాట్లాడకుండా మనదారిని మనం పోదాం పదండి.” అని మోహన్ వాడికి తెలియకుండా ఇంగ్లీష్‌లో అన్నాడు.

వాడేమో ఎర్రగా చూస్తున్నాడు. మరో రెండణాలు వాడి ముఖాన పారేస్తే గొడవ తీరిపోతుందనుకుని కళ రెండణాలు క్రింద పడేసి కదిలింది. సుధాకర్, మోహన్ కూడా బయల్దేరారు. చెప్పులు కుట్టేవాడు పెద్ద పెద్ద కేక లేసుకుంటూ “మీ ఎత్తులు నాకాడ కాదు. . . ఆ డబ్బు లిక్కడ పెట్టి మరీ కదలండి. . .” అంటూ వెంటబడ్డాడు.

“ఏమిటోయ్ నీ దబాయింపు. . . ! పెద్ద పెద్ద కేకలేస్తే జడిసి పోతారనుకున్నావు కాబోలు !” అంటూ మోహన్ వాడికేసి కోపంగా చూశాడు.

“ఎర్రగా చూస్తున్నాడు. . . ఏం కొడతావా ? కొట్టు ! నీ వంట్లో బొమికలుంటాయేమో చూద్దాం. . . తెలుగోళ్ళు కదా అని అభిమాన పడితే మరీ లెగనీలుగు. . . !” అంటూ ముందుకొచ్చాడు వాడు.

మోహన్ షర్టు చేతులు పైకి మడిచాడు. సుధాకర్ మోహన్ రెక్క బట్టుకుని ఇవతలకు లాగాడు. కళ కంగారుగా వాడిని వదుల్చుకోవడానికి పర్సు తీసింది.

“మీరు ఒక్క నయాపైస కూడా బైటికి తీయకండి. . . వీడి అంతేమిటో కనుక్కుంటాను” అన్నాడు మోహన్.

అయినా కళ మోహన్ మాట వినిపించుకోకుండా మిగతా అరణాలు వాడి ముఖాన పడేసింది. వాడు సణుక్కుంటూ వెళ్ళి పోయాడు.

“వాడి నోటిలో నోరు పెడితే మనకే పరువు తక్కువ. . . మీ మాట వినలేదనీ మీకు కోపం వచ్చిందేమో. . .” అని క్షమాపణ చెప్పుకున్నది కళ.

“మీ డబ్బు మీరిచ్చుకున్నారు. మధ్య నా సొమ్మేం పోయింది లెండి ?” అని జవాబిచ్చాడు మోహన్ ఘాటుగా.

కళ ఏమనటానికి తోచక వూరుకున్నది. నాలుగడుగులు నడవక ముందే కళ ఇబ్బంది పడుతూ ఆగిపోయింది.

“అరే ! కుంటుతున్నారే ? ఇంకా కాలు. . .”

సుధాకర్ మాట పూర్తి కాకముందే కళ చెప్పు కాలి నుండి తీసి ఇవతల పడేసింది. స్ట్రాపు వదులుగా వ్రేలాడుతున్నది—

“భలే టోపీ వేశాడే వీడి దుంపతెగా ?” అని ఆశ్చర్య పోయాడు సుధాకర్.

“ఆ చెప్పిలా ఇవ్వండి ! దాంతోటి నాలుగు

# అయిదు రెళ్ళు

వద్దింకి వస్తాను. . . .'' అన్నాడు మోహన్ చురుగ్గా.

''ఇదేం నటన కాదు నాయనా ! మీరిద్దరూ మనిషి యుద్ధానికి దిగితే నిన్ను నిజంగా ఆస్పత్రికి మోసుకు పోవాల్సి వస్తుంది. సినిమా యుద్ధంలాగా నాజూగ్గా కొట్టుకుని వెనకాతల చెప్పుల్ని చేసు కోవటం కాదు. . . ఎంతైనా అంత కోపం పనికి రాదు. . . శాంతం వహించు. . . !''

''చెప్పులు కుట్టేవాడికి చెవులు వాయించ లేదు కాని చైనా వాడితో వీడేం యుద్ధం చేస్తాడురా? ఒడ్డూ పొడుగూ ఉన్నావు కాని ఎందుకూ పనికి రావురా ? ఎట్టి పిరికి వెధవ్వి. . . !'' అన్నాడు చిరాకు పడుతూ మోహన్.

''నాకాపిరికితనం ? వాడిని పిప్పి పిప్పి చేసె య్యనా? చూడన్నా గాని నా జబ్బ సత్తువ. . . ఏది !'' అంటూ సుధాకర్ రోషంగా వెనక్కి తిరి గాడు.

కళ గాభరాగా ''మీరు వెళ్ళారంటే వట్టే. . . వెధవ చెప్పులు బుట్టలో వేసుకుని ఇంటికి పట్టుకు పోతాను లెద్దురూ. . . అక్కడే బాగు చేయించు కుంటాను. నా చెప్పుల కోసం మీరిద్దరూ చావు దెబ్బలు తినిరావటం దేనికి ?'' అంది.

''సరే అలాగే కానివ్వండి. . మీరు వట్టికాళ్ళతో నడిస్తే మళ్ళా ఏ సిగరెట్టు పీకో గుచ్చేస్తుంది. . . వాడు అడిగినంతా ఇచ్చి మళ్ళా కుట్టించుకుని వద్దామా. . . ?'' అన్నాడు సుధాకర్.

''ఇందాకటి పరాభవం చాల్లేదా ? వీడు చేసే రిపేర్లన్నీ ఇలాగే ఉంటాయి ! మళ్ళా ఏ మొహం పెట్టుకుని వెళ్ళటం ?. . . నాకు తెలిసిన వాడొక డున్నాడు. వాడి దగ్గరకెళ్ళి కుట్టించుకుందాం రండి. . .'' అంటూ మోహన్ దారితీశాడు.

మరో రెండు మలుపులు తిరిగాక మరో చెట్టు. మరో చెప్పులుకుట్టే వాడు— కళ చెప్పులు తీసి వాడి ముందు పడేసింది.

''రెండిటికీ ఎంత కావాలో ముందే చెప్పు. . . తర్వాత తగువులాడకు. . .'' అంది కళ ఇందాకటి వాడిమీది కోపం వీడిమీద చూపించి.

వీడేమో ఆరణాలు అడిగాడు. ఇందాక ముప్పావలా, ఇప్పుడు ఆరణాలు. . . ఇంకోరూపాయి వేస్తే కొత్త చెప్పులే వస్తాయి, అనుకుంది కళ మనస్సులో బాధగా లెక్క వేసుకుంటూ.

''వద్దులే'' చెప్పులు తీసుకో బోయేసరికి అయిదణా లిద్దామన్నాడు. కళ నసేమిరా యివ్వ నన్నది.

''పావలాకు కుడితే కుట్టు. . . లేకపోతే ఆ చెప్పు లిలా పడెయ్యి !'' అంటూ ముందుకు వంగింది.

వాడు సరేనని ఒప్పుకుని ఒక చెప్పు చేతిలోకి తీసుకున్నాడు. కొత్తగా వేసిన బటన్ కాస్తా ఇట్టే తీసి పడేశాడు.

కళ ఆశ్చర్యపోతూ అంది.

''వాడేమో బటన్ చెప్పుకు అంటుకు పోయి నట్టు మాట్లాడాడు. . . ! వీడు కాస్తా నిమిషంలో తీసి ఇవతల పడేశాడు ! ఎంత మోసం. . ?''

''లోకం అంటే మోసాల పుట్ట. . . ! ఇల్లు విడిచి బైట కొచ్చామంటే చాలు ప్రతివాడు మన నెత్తిని టోపీ పెట్టాలనే చూస్తాడు. . . .'' అని

# అయిదు రెళ్ళు

బోధ పరిచాడు సుధాకర్.

చెప్పులు కుట్టటం అయ్యాక కళను ఇద్దరూ కలిసి బస్సులో ఎక్కించి వచ్చారు.

"ఎలా ఉంది. . ?" అనడిగాడు సుధాకర్.

"గట్టిగానే ఉంది. . . వాడు బాగానే కుడతాడు. నువ్వు సిఫార్సు చేసిన వెధవలా టోకరా ఇస్తాడను కున్నావు కాబోలు !"

సుధాకర్ నవ్వాడు.

"చెప్పుమాట కాదురా. . . కళ మాట. . . . ! నువ్వు ఇంతకు ముందు కళను చూడలేదుగా ? ఎలా ఉంది. . . ?"

"చూడకేం ? ఇంతకు ముందే చూశాను. . ."

"ఏడిశావులేరా నీ విట్టూ నువ్వూను. . . . ఇంతకు ముందంటే బస్సు ఎక్కబోయే ముందు వరకనేగా నీ అర్థం ?"

"అదేం కాదు ! నేను, ఆవిడా ఒకరోజున ఒకే సినిమా కెళ్ళాం. . . ."

తెల్లని సుధాకర్ ముఖం నల్లబడింది.

మోహన్ నవ్వుకున్నాడు.

"అలా కుంగిపోతావేంరా అబ్బాయ్ ! నేను, ఆవిడ కలిసి వెళ్ళలేదు. . . ఎవరి మట్టుకు వాళ్ళే వెళ్ళాం. సినిమా హాల్లో నుంచి బైటి కొస్తున్నప్పుడు కళ వచ్చిందంటే చూశాను. . అంతే. . ."

సుధాకర్ ముఖం వికసించింది.

"కళ వచ్చిందని ఎవరన్నారు ?. . . దొరికావులే దొంగవి. . ఎవరితో వెళ్ళావో చెప్పు !"

మోహన్ నిజంగా సిగ్గు పడ్డాడు. . నటన కాదు. . .

"ఆవిడే. . . ఆవిడేలేరా. . ." అన్నాడు తప్పించు కోవటానికి ప్రయత్నిస్తూ.

"ఆవిడకి పేరు లేదా ఏమిటి ?" అని సుధాకర్ నిలవదీసి అడిగాడు.

"పేరు లేకేం ? బహు చక్కని పేరు. . గీ. .త"

సుధాకర్ ఆశ్చర్యానికి మేరలేదు.

"ఓరి నీ అసాధ్యం కూలా ! ట్రాన్సిస్టర్ కోసం వచ్చి ఆ అమ్మాయిని ఎంచక్కా బుట్టలో పెట్టావ్. . . ! ఎంత నాటకం. . . ! ఇందుకే కాబోలు గీత రేడియో పెట్టుకోవటం మానేసి అశోక వృక్షం క్రింది సీతలా దిగులుగా కూర్చుంటున్నది."

"బుట్టలో పెట్టటం కాదు. . నాటకమూ కాదు. . నిజంగానే పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నాను. . . ."

"గట్టి చిక్కే ! మీ నాన్నగారితో చెప్పకుండా వచ్చేసానన్నావు కదా ? ఇప్పుడు వెళ్ళి 'నేను ఫలానా ఆవిడ్ని ప్రేమించాను' అంటే ఆయన ఎడా పెడా వాయించడూ ?" అంటూ సందేహం వెలిబుచ్చాడు సుధాకర్.

"వాయించడ మేమిటోయ్ ? ఆయన మూడో కన్ను తెరుస్తాడు. . ఆ మంటల్లో పడి భస్మం కావటం కన్నా ఆయన కంట బడక పోవటమే మంచిది. . . ."

"అయినా ఎన్నాళ్ళిలా మీ నాన్నగారికి కనబడకుండా దాక్కుంటావ్ ? హాయిగా మీ వూళ్ళో ఏదైనా ఉద్యోగం చూసుకోరాదూ ?" అన్నాడు జాలిగా సుధాకర్.

"పొద్దుటి నించి సాయంకాలం వరకు కుర్చీకి అంటి పెట్టుకుని ఫైల్సు రాస్తూ కూర్చోలేను. . నటుడ్ని కావాలనే కొండంత కోర్కెతో వచ్చాను. పట్టుదల ఉంటే సాధించలేని పనేం లేదు. . . . నేను ఎప్పటికైనా పైకి రాగలను. ఆ ధైర్యం నాకుంది. . అలాగే గీత విషయంలో కూడా. . . ఇందులో మా నాన్నగారిని ప్రాధేయపడాల్సిందేమీ లేదు. . ." అన్నాడు మోహన్ ఆవేశంతో.

సుధాకర్ నిట్టూర్చాడు.

"వూ. . . ! అంత ధైర్యం ఉంటే మంచిదే. . . ఇంతకీ గీతకు నువ్వంటే ఇష్టమో, లేదో కనుక్కున్నావా ? ఆ రోజు నిన్ను చూస్తే ఎంత మండి పడింది నేను మర్చిపోలేను— ఆ కోపమంతా ఇంతలోనే మంచులా కరిగి పోయిందంటే వింతగా ఉంది. . . ."

"ఆడవాళ్ళని అడిగితే ఏం చేస్తారో తెలుసువా? సిగ్గుపడి మాట్లాడకుండా జారుకుంటారు. . . అంటే ఇష్టమే అని చెప్పటం. . . ."

"మాట్లాడకుండా నాలికతో వెక్కిరించి వెళ్తే. . . . ?"

"ఏమిటేమిటి ? నాలికతో వెక్కిరించటమా? సిగ్గుతోనా, కోపంగానా ?"

"ఏమో ! ఆవిడకి సిగ్గేవేసిందో, కోపమే వచ్చిందో ఎవరికి తెలుసు. . . ?"

మోహన్ నవ్వాడు.

"అప్పుడే కళతో పెళ్ళిమాట కదిపావన్న మాట !"

"కదిపితే ఏం ప్రయోజనం ? ఆవిడ అవునంటేగా ? పైగా నేను అడిగానని కోపం కూడా వచ్చిందేమో. . ." అంటూ నిస్పృహను వెలిబుచ్చాడు సుధాకర్.

మోహన్ సుధాక వీపు చరిచి ధైర్యం చెప్పాడు.

"మరేం బెంగ పెట్టుకోకురా ! కళకు నువ్వంటే పంచ ప్రాణాలు. . కాకపోతే ఇప్పుడొచ్చి ఎందుకు పలకరిస్తుంది ?"

"పలకరించక పోయినా బాగుండును. . . . ఆ సిగరెట్టు కాస్తూ ఆవిడ కాలినే చుర్రుమనిపించాలి ; ఆవిడ అవులిస్తే పేగులు లెక్క పెడుతుంది. ఆ సిగరెట్టు నేనే కాల్చి పారేసానని తెలిస్తే ఆవిడ జన్మలో నా మొహం చూడదు. . . అదీగాక ఆవిడకో బావ కూడా ఉన్నాడు. . . ." అన్నాడు నిరాశగా సుధాక .

"నిరాశ పడకురా భాయ్ ! బావగాడికి మరో భామను కట్ట బెట్టొచ్చు. . మీ ఇద్దరి పెళ్ళి నా చేతుల మీదుగా చేయిస్తానుగా. . . ?" అంటూ భీష్మ ప్రతిజ్ఞ చేశాడు మోహన్.

*　　　*　　　*

"ప్రియా ! మా ఆంటీ వైజాగ్ రమ్మని రాసింది. . ."

పరిచయం ఉన్న కంఠస్వరంలా వినపడితే మోహన్ అటు తిరిగి చూశాడు.

పేవ్‌మెంటు మీద నిలబడి గీత మరొక అమ్మాయితో మాట్లాడుతున్నది.

ఆ అమ్మాయి సంతోషంతో పళ్ళన్నీ బైట పెట్టి "అలాగా ! నేను కూడా వైజాగ్ వెళ్తున్నాను. మనమంతా మళ్ళా వైజాగ్‌లో సరదాగా కాలక్షేపం చేయొచ్చు !" అంది.

"వైజాగ్‌లో ఎవరున్నారు ప్రియా ?" అనడిగింది గీత.

"మా తాతగారు, అమ్మమ్మ అక్కడేగా ఉన్నారు? మా అన్నయ్య కూడా అక్కడే ఉన్నాడు వాడీ ఏడు బి. ఎస్. సి. (ఆనర్సు) పరీక్షలు రాశాడు. . . ."

"ఏమో ! నేను వైజాగ్ వెళ్తానో, లేనో చెప్పలేను. . . మా ఆంటీకి మనసంతా కళమీదే. . . కళను మా బావకిచ్చి చేసుకుంటారు. బావ చదువు కూడా పూర్తయింది. దగ్గర్లోనే ముహూర్తాలు పెట్టుకుంటారేమో కూడా. . . ఆంటీ మాట వరుసకు మమ్మల్నంతా రమ్మన్నది కాని నేమంటే ఆవిడకేం అభిమానం లేదు. . ."

మోహన్ గుండె కలుక్కుమంది. ఈ బావెక్కడ దాపురించాడు సుధాకర్ పాలిటి విలన్‌లా అనుకున్నాడు కోపంగా. ఈ బావను తేలిగ్గా తీసిపారెయ్యటం తేలికనిపించలేదు. . .

ఇంతలో గీత ఇటు తిరిగి మోహన్ని చూసి, చూడనట్టుగా తల అటుతిప్పి "ప్రియా ! ఇంక నేను వెళ్ళిరానా ? బస్సుకోసం వెయిట్ చేసి ఇంటి కెళ్ళేటప్పటికి ఎలా లేదన్నా ఇంకో రెండు గంటలు పడుతుంది. . , చీకట్లో ఒక్కర్తినే వెళ్ళాలి. . ." అంది.



# అయిదు రెళ్లు

"నేనూ వెళ్ళాలి గీతా ! ప్రయాణం కదూ ఒకటే హడావిడిగా ఉంది. . . అన్నయ్య సాక్సేవో కావాలన్నాడు. మూర్ మార్కెట్టుకు వెళ్ళి కొనుక్కు రావాలి. . . వైజాగ్ నువ్వు కూడా రాకూడదూ ? మా మేనత్త అభిమానం ఎవరిక్కావాలి ? మనం హాయిగా గడపొచ్చు. . ."

కాస్త దూరంలో బస్సు వచ్చి ఆగింది.

"గబగబా పరిగెత్తు—" అంది గీత కంగారుగా.

"అది గాకపోతే మరొకటి వస్తుంది. ఏమిటో కంగారు. నువ్వు వైజాగ్ తప్పకుండా రావాలి. . ."

గీత మనస్సులో విసుక్కుంది.

"అలాగే ప్రయత్నిస్తాను. . . నే వెళ్ళొస్తాను.. మళ్ళా టికెట్ పడిందంటే. . ."

"టిక్కెట్టు పుచ్చుకుని రైలెక్కటానికి ప్రయత్నమేమిటి ? తప్పకుండా రావాలి. . ."

"అలాగే ! టా, టా ! ప్రియా !"

"అలాగే ! టా, టా ! ప్రియా !"

"ఛీరియో గీతా !"

ఆ అమ్మాయి కనుమరుగయ్యాక మోహన్ గీతకు దగ్గరగా వెళ్ళి "ఆ అమ్మాయి ఒక పట్టాన వదులుతుందనుకోలేదు సుమండీ. . .!" అన్నాడు.

"దానికి మాటలు కొంచెం ఎక్కువే కాని చాలా మంచి పిల్ల !" అంది గీత.

బాగానే ఉంది కాని ఆడవాళ్ళు ఆడవాళ్ళు ప్రియా అని పిలుచుకోవటం ఏమిటి ? సినిమాలోనో, నాటకంలోనో ప్రేయసీ ప్రియులు 'ప్రియా !' అని పిలుచుకున్నా, పాటలు కట్టి పాడుకున్నా అందం కాని. . ! మామూలు మనుష్యులకి మాత్రం 'ప్రియా' అని పిలుచుకోవాలని ఉండదా ఏమిటి ?

"ప్రియా !" అంటూ మోహన్ అప్రయత్నంగా గీతను సంబోధించాడు.

గీత కళ్ళు పెద్దవి చేసి చూసింది.

"మీకేం వెర్రా ఏమిటి ?"

మోహన్ నాలిక కొరుక్కుని "మరి మీరెందుకు ఆ అమ్మాయిని 'ప్రియా ? ప్రియా !' అని పిలిచారు ?" అనడిగాడు.

గీత పగలబడి నవ్వుతూ నోట మాటరాక అవస్థ పడింది.

"ఆ. . . అ. . . మ్మా. . . యి. . . పే. . .రు"

వస్తూన్న నవ్వుతో అస్పష్టంగా గొంతుకో మాట అంటూ వాక్యం పూర్తి చేయలేక ఉక్కిరి బిక్కిరైంది గీత.

మోహన్ ఆలోచనలో పడ్డాడు. . ఇంతకీ ప్రియ ఆ అమ్మాయి పేరా ? పూర్తి పేరై ఉండదు. . . సగం పేరో, ముద్దు పేరో అయి ఉంటుంది. . . ఆడవాళ్ళా చిత్రంగా ఉంటారు, వాళ్ళ పేర్లూ చిత్రంగా ఉంటాయి ! ముందు గాని, వెనకగాని ప్రియ వచ్చే ఆడపేరేమిటి . . . భలేక్విజ్ ! మోహన్ బుర్ర చకచకా పని చేసింది.

చటుక్కున గీతకేసి చూసి "మీ స్నేహితురాలి పేరేమిటో తెలిసిపోయింది లెండి. . .!" అన్నాడు పూరిస్తున్నట్టు.

గీత ఇప్పటికి మామూలు మనిషయింది.

[సశేషం]


సిగరెట్లు తాగితే... వీపు భోరేస్తానన్నాడు మానాన్న!
...... వీపు భోరేస్తే సిగరెట్లు తాగడానికేం ఇబ్బంది వుండదుగా?!


ఈ 'భిన్న మనస్తత్వాలు' నాకు చాలా బావుంది: నీకెలా వుంది మరి??


అంతటి చెత్త పుస్తకం మరోటి లేదు


ఏవిటా?! అర్థం పర్థం లేకుండా 'పార్టీ' ఇస్తున్నావే? ఏవిటో కథ?
మా ఆవిడ పుట్టింటికి వెళ్లిందోయ్!




తలమీదేవిటి బొప్పి?
మా ఆవిడ ఇప్పుడే 'బుర్రకథ' చెప్పింది


నీకసలు
మెదడులా
బుర్రలేదేమో.


ఎవడికి
లేదో
తెలుస్తూనే
వుంది




....శ్రోతలకోరికపై
ముందు ప్రకటించిన
'బాబు' గారి గానం
(రద్దు) చేస్తున్నాం....


బా॥బు


ఇది చూస్తుంటే
శ్రీకృష్ణుడు రోలును
రెండు చెట్ల మధ్యకి
తోసికెళ్ళిన సంఘటన
జ్ఞాపకం వస్తోంది
కదూ?




నేను ఫబ్బినా
పెళ్ళి చేసుకోనని
చెప్తే...మానాన్నకి
కోపం వచ్చి వెంటనే
నా పెళ్ళి చేసేసాడు
అయినా నేను
....చేసుకో లేదనుకో పెళ్ళి....

# "భార్యా రూపవతీ శత్రుః"

## చిల్లర భావనారాయణరావు

రైలుబండి బయల్దేరటానికి ఇంకా మూడు నిముషాలు మాత్రమే టైమ్ ఉంది. ఎక్కే జనం అంతా దాదాపు ఎక్కేసినట్లే. తమ బంధువుల్ని పంపించటానికి జనం కిటికీల దగ్గర, వాకిళ్లదగ్గర గుంపులు గుంపులుగా చేరారు.

ఆఖరి నిమిషంలో హడావిడిగా టిక్కెట్లు కొనుక్కొచ్చిన ప్రయాణీకుల అవస్థ చూడటానికి తమాషాగా ఉంది ప్లాటుఫారం మీదున్న జనానికి.

"దయచేసి తలుపు తెరవండి సార్— గార్డు కూతేశాడు."

కుట్బూర్ధా జనం విరగబడి నవ్వారు. తలుపు గడియ బిగించి కిటికీలోంచి తొంగి చూస్తున్న యువకులు సాపేవీ కదలటం లేదు.

"ఈ పెట్టెలో చోటులేదు. వెళ్ళండి. ఆ వెనక పెట్టె ఖాళీగా ఉంది." నిర్లక్ష్యమైన సమాధానాలు ఎక్కువైనాయి.

రైలు కూసింది. గార్డు ఈల వేశాడు. . . .

"అయ్యా— ప్లీజ్— ఇది తిరుపతి కంపార్టుమెంటు. తలుపు తెరవండి సార్." రైలు ఎక్కటానికి వచ్చిన మనిషి జాలిగొలిపేలా బతిమిలాడాడు. ఇంతలోకే వెనకాల ఉన్న అతడి భార్య ముందుకు వచ్చింది.

"తలుపు తెరవండి. బండి కదులబోతున్నది." ఆమె గద్దించి పలికేసరికి తలుపుకు అడ్డంగా ఉన్న జనం తొలిగి తలుపు తెరిచారు. బండి కదిలింది. ఆదుర్దాలో బండి ఎక్కబోతున్న ఆమె, రైలు కదలటం వల్ల తూలి పడబోయింది. ఎవరో వ్యక్తి ఆమె చేయి పట్టుకొని లోపలికి లాగివేశాడు. లేకపోతే ఆమె రైలు క్రింద పడాల్సింది. వెనగ్గా ఉన్న ఆమె భర్త చేతిలో ట్రంకు— బెడ్డింగ్‌తో బండితో పాటు పరుగెత్తుతూ తోటి ప్రయాణీకుల సహాయంతో ఎట్లాగో పెట్టెలోకి దూకగల్గాడు. రైలు ప్లాట్‌ఫారం దాటి కూతవేస్తూ వేగం హెచ్చించింది.

రైల్లో ఉన్న జనం చూపులన్నీ ఒక్కసారి ఆ దంపతుల మీద కేంద్రీకరింప బడ్డాయి. వాళ్ళు సంపన్న కుటుంబీకులుగా కనిపించారు. రైలు పెట్టెలో వెలుగుతున్న విద్యుద్దీప కాంతుల్లో ఆమె రూపం అక్కడి జనాన్ని ఆశ్చర్య చకితుల్ని చేసింది. సన్నగా నాజూగ్గా ఉన్నది. వయస్సు పాతిక లేదు. సంపెంగ పూవులాంటి ముక్కు. ఆకర్షణీయమైన కళ్ళు. అందమైన కోలముఖానికి



## రెండవ బహుమతి పొందిన కథ

మరింత శోభను కూరుస్తున్నాయి. దీపకాంతులకు మెరిసి పోతున్న ముక్కుపుడక, రవ్వల దుద్దులు. వచ్చటి పసిమితో నవనవలాడే ఆమె దేహం కట్టుకున్న గులాబీరంగు నైలాన్ చీరకు ఎంతో విలువ ఇచ్చింది. ఒక చేతిలో మరచెంబు రెండో చేతిలో చిన్న సంచీ ఉన్నాయి. జారిపోతున్న పమిటని సర్దుకొని వంటినిండా కప్పుకున్నది. ఆమె మెడలోంచి కనపడీ కనపడకుండా తొంగి చూస్తున్న బంగారు గొలుసు లైటు ముందు అప్పుడప్పుడూ చమక్‌మని మెరుస్తున్నది. తల్లో జాజిపూలతో, ముఖాన గుండ్రంగా తీర్చుకున్న వయాప్లైసా అంత కుంకం బొట్టుతో నిలబడి ఉన్న ఆ యువతిని చూడంగానే కొందరికి భగవంతుడి సృష్టి సౌందర్యం మీద భక్తి భావం పెల్లుబికింది. మరి కొందరు ఆమె వైపు నుంచీ చూపు మళ్లించుకోలేక పోయారు.

నల్లగా, బొద్దుగా, పొట్టిగా, ఉన్న ఆమె భర్త మెల్లగా జనాన్ని తోసుకు పోయి ఓ మూల నున్న ముసలమ్మ దగ్గర కాస్తంత చోటు ఉండటంవల్ల అక్కడ నిలబడ్డాడు.

"కాస్త మా వాళ్లని కూచోనిస్తారా ?" ముసలమ్మను ప్రార్థించాడు.

"మా అబ్బాయి వస్తాడు. అదిగో వాకిలి దగ్గరున్నాడు" అన్నది ముసలావిడ.

"ఫరవాలేదు. కూర్చోమనండి మీ వాళ్లని, కాసేపయ్యాక మనకు చోటు దొరక్కపోదు" అన్నాడా యువకుడు వాకిలి దగ్గర్నుంచి.

ఆమె మనస్సులోనే కృతజ్ఞత చెప్పుకుంటూ ముసలావిడ పక్కగా వెళ్లి కూర్చుంది.

"మీరుగనక ఆ అమ్మాయిని బండిలోకి లాగకపోతే ఎంత ప్రమాదం జరిగేదో ?" అన్నాడొక ప్రయాణీకుడు.

"బండి స్టేషన్‌లోనే ఉండిపోయేది. ఇంతకూ ఆవిడకి గండం తప్పింది. అయినా కాస్త ముందరగా ఇంటి నుంచీ బైల్దేరద్దూ ?" అంటూ చుట్ట వెలిగించాడో మధ్య వయస్సు ఆసామీ.

"ముందరగానే బయల్దేరాం. స్టేషన్‌కి వచ్చే బస్సు దారిలో చెడిపోయింది." అన్నాడు ఆ అమ్మాయి భర్త, తన భార్యను ప్రమాదం నుండి రక్షించిన ఆ యువకుడు ఎవరా అని అటుకేసి తిరిగి చూస్తూ. అప్పుడే స్థిమితంగా చూశాడా యువకుణ్ణి. అతడికి తన వయస్సుంటుంది. చక్కటి రూపసి. రూపానికి తగ్గ గుణగణాలు అతడిలో మూర్తీభవించాయి. అతడే గనక తన భార్యని వెంటనే చేయి పుచ్చుకు లాగకపోతే ఎంత ఘోర ప్రమాదం జరిగేదో ! పైగా అతను కూర్చున్న స్థలంలోనే తన భార్య కూర్చోగలిగింది ! అతడి ఉదారతకు అభినందనల తెల్పటం కనీస ధర్మంగా భావించాడు.

"పాపం మీరు మామూలంగా నిలబడే ఉన్నార"న్నాడతను.

యువకుడు, "ఫరవాలేదులెండి" అని చిరునవ్వుతో సమాధానం చెప్పాడు.

"మీ అబ్బాయా వారూ ?" అని ముసలావిణ్ణి ప్రశ్నించింది యువతి. "అవునమ్మాయి! మామూడోవాడు. కాలేజీలో మేష్టరుపని చేస్తున్నాడు. మూడొందలు జీతం. ఎమ్మే చదివించాం. మంచి సంబంధం చూసి త్వరగా ముడిపెట్టాలనుకుంటున్నాం. వాడికా మధ్య జబ్బు చేసింది. ఆ వెంకట రమణుడి దయవల్ల నయమయిందమ్మా. అందుకని స్వామి దర్శనానికి వెళ్తున్నాం. మాఅబ్బాయి పేరు రమణ. మీరూ తిరుపతికేనా ?"

ముసలమ్మ ధోరణి అనర్గళంగా సాగిపోతున్నది. ఆమె చెప్పే ప్రతి అక్షరం తన భార్య కుతూహలంగా వింటం గమనించాడతను. అది అనవసర ప్రసంగం అనిపించిందతడికి.

"మీది వూరేనా నాయనా ?" అంది ముసలమ్మ చిరునవ్వుతో.

"అవునండీ" అంటూ తన భార్యే సమాధానం చెప్పింది.

"మీవారేం చేస్తారమ్మాయ్" ముసలమ్మ వూరుకొనేట్టు లేదు.

"వారికి గవర్నమెంటు ఆఫీసులో పని."

"ఎంతిస్తారేం ?"

"రెండొందలు"

"ఇంతేనా ? రెండొందలూ ఏం సరిపోతుందమ్మా? ఈ మాయదారి కాలంలో వెనకేమన్నా ఉంటే తప్ప. ఉన్నవారల్లేనే కనబడుతున్నార్లే. మీ ఇంటిపేరు నాయనా ?"

"మా ఇంటి పేరు బి. అండీ"

"బీ అంటే ?"

"ఏదోహటి లెండి ?" కాస్త చిరాగ్గా సమాధానం చెప్పాడు.

"ఈ రోజుల్లో ఇంటిపేరు చెప్పుకోటమే నామోషీ— మా కాలంలో ఫలాని కుటుంబం వాళ్లం అని ఘరానాగా చెప్పుకొనే వాళ్లం బాబూ. తల్లి పేరూ, ఇంటి పేరూ చెప్పుకోటానికి నామోషీ పడరాదు నాయనా"

అతనేమీ మాట్లాడలేదు. పైగా ఆ ముసలమ్మ ఎక్కడ దాపురించిందా అని బాధ పడ్డాడు. చోటు కాస్తంత ఇచ్చి వాగుడు కాయలా ఇలా బాధపెడుతున్నదేంరా అని బాధపడుతున్న భర్తను చూచి చిన్నగా నవ్వింది యువతి. ఆవిడే ముసలమ్మ చెవిలో ఏదో చెప్పింది.

"అదా! బూడిదలవారా మీరూ ? నీ పేరూ?"

"సుందర్రావ్" వినుగ్గా సమాధానం చెప్పాడు.

"బూడిదల సుందర్రావన్న మాట" ముసలమ్మ నోటి వెంట వచ్చిన ఈ మాటకి పెట్టెలో నవ్వులు చెలరేగాయి.

"ఈ నవమన్మథుడేనుటోయ్ బూడిదలోంచి మళ్లీ జీవించింది ?" అని చాలామంది లోలోపలే అనుకున్నారు అతణ్ణి చూసి నవ్వుతూ.

" నీ పేరేమిటమ్మా " ముసలమ్మ యువతిని ప్రశ్నించింది. తన మామూలు ధోరణిలో.

" కళ్యాణి " అన్నది నవ్వుతూ ఆ యువతి.

దూరాన వాకిలి దగ్గర నిలబడి వున్న రమణ తన తల్లి మాట్లాడకుండా ఇహవూరుకునేట్టు లేదని మెల్లగా తల్లి దగ్గరగా వచ్చి నిలబడి ఆమె వంక గుడ్లెర్ర చేసి చూశాడు.

" ఏమిటిరా పేరడగటం తప్పా ? " అని దీర్ఘాలు తీసింది ముసలమ్మ. కళ్యాణికి నవ్వాగలేదు. పమిట చెంగు నోటికి అడ్డం పెట్టుకుని వచ్చే నవ్వు ఆపుకుంటున్న కళ్యాణి ముఖం ఆ నవ్వులో మెరిసిపోయింది. లేత గులాబి రేకల్లాంటి ఆమె బుగ్గలు సొట్టలు బడ్డాయి. అమృతం చిలికినట్లు అనిపించింది రమణకి. సుందరం గుండె దడదడా కొట్టుకుంది. అతడు కళ్యాణి వంక కోపంగా చూశాడు. కాని కళ్యాణి అప్పటికే తల కిటికీ వైపు త్రిప్పుకొని ఆకాశంలో వెలుగుతున్న చందమామని, వెనక్కి పరుగెత్తుకు పోతున్న చెట్లనీ చూస్తున్నది.

బండి వేగంగా పోతున్నది. ఇంజన్ భయంకరంగా కూత పెడుతున్నది. పెట్టెలో చాలామంది స్థిమితంగా సర్దుక్కూర్చున్నారు. సుందర్రావు, రమణ మాత్రం నిలబడే ఉన్నారు. కళ్యాణి పెట్టె చివర మూలలో కూర్చున్నది. ఆ పక్కనున్న ముసలమ్మను లేవగొట్టి అక్కడ తను కూర్చుంటే ఇహ రేణిగుంట దాకా హాయిగా ప్రయాణం చెయ్యొచ్చు. అది ఎలా సాధ్యమా ? అని సుందర్రావు ఆలోచిస్తున్నాడు. ఇంతలోకే కల్యాణికి ఎదురు సీటులో కూర్చున్న పెద్దమనిషి సంచీలో బట్టలు సర్దుకుంటూన్నాడు.

" అక్కడ కూర్చోరా అబ్బీ. ఆయన ఖాళీ చేస్తాడల్లే ఉంది " అన్నది ముసలమ్మ కొడుకుతో.

" అవునండీ. ఈ వచ్చే స్టేషనులో దిగి పోతాను. ఇక్కడ కూర్చోండి " అంటూ ఆ ఆసామి లేచాడు.

రమణ వెళ్లి కల్యాణికి ఎదురుగ్గా ఉన్న సీట్లో కూర్చున్నాడు. కల్యాణి ఓసారి రమణ కూర్చున్న సీటు కేసి చూసి మళ్లీ తల త్రిప్పుకుంది. వాకిలి దగ్గరగా ఉన్న సీట్లు రెండు ఖాళీ అవుతుంటం గమనించిన ముసలమ్మ

" అక్కడ ఖాళీ అవుతున్నట్టుంది. అక్కడికెళ్లి కూర్చో నాయనా " అన్నది సుందర్రావును.

సుందర్రావు కదల్లేదు. కల్యాణి తన భర్త వంక చూసింది. " ఎంతసేపని అలా నిలబడతారూ ? " అన్నది నెమ్మదిగా.

" ఫరవాలేదులే " ముక్తసరిగా సమాధానం చెప్పాడు సుందర్రావు. ముసలమ్మ ఈ మాటలు విని మూతి తిప్పుకుంది. " కాస్తంత పక్కకు జరుగు బాబూ. కాళ్లన్నా జాపుకోనీ " రుసరుసలాడింది.

బండి స్టేషన్‌లో ఆగగానే ఆ పెట్టెలోంచి ముగ్గురు దిగారన్నమాటే గాని అయిదుగురు కొత్తగా పెట్టెలోకి ప్రవేశించారు. ఆ కంపార్టుమెంటులో ఉన్న యావన్మంది తిరుపతి ప్రయాణీకులే. బండి కూత వేస్తూ కదిలింది మళ్లీ.

పై బల్ల మీద పక్క పరుచుకున్న వ్యక్తి క్రింద సీటు ఖాళీ చేయటం వల్ల ముసలమ్మ కాస్త పక్కకు జరిగింది. ఆమె వైపు కళ్యాణి జరగటం వల్ల సుందర్రావు అంతకు ముందు కల్యాణి కర్చున్న చోట్లో కూర్చో గలిగాడు.

ఆ భార్యా భర్తలకు ఎదురుగ్గా వెంకట రమణ కూర్చున్నాడు. అతడేదో పుస్తకం తీసి దీర్ఘాలోచనలో పుస్తకంలోకి చూస్తున్నాడు. ఎంతసేపటికీ పుటలు



# భార్యా రూపవతీ...

తొలగటం లేదు. సుందర్రావు చూపెంతా అతడి మీదే ఉంది. నొక్కులు నొక్కులుగా ఉన్న వత్తైన జుట్టు, కొనదేరిన ముక్కు, కాంతివంతమైన చూపులు వెంకట రమణకు భగవంతుడు ప్రసాదించిన వరం అనుకొన్నాడు సుందర్రావు.

తనకు అందమైన భార్య లభించటం తన అదృష్టం. తనకు మాత్రం ఏం వెకర ? అవయవ లోపం ఏమీ లేదు. కాకపోతే కాస్త నలుపు. పెద్దగా చెప్పుకొనే అంత పొట్టిం కాదు. తానూ బి. ఏ. చదివాడు. స్థితిపరుడు. ఏనాడూ తన భార్యా తన మాటకు ఎదురు చెప్పలేదు. తానూ కళ్యాణికి బాధ కలిగించేలా ఏనాడూ ప్రవర్తించలేదు. తమ సంసారం పెళ్లైన మూడేళ్ల నుంచీ హాయిగా సాగిపోతున్నది.

కళ్యాణి చాలా మంచిది. తనని దైవంగా చూసుకుంటుంది. తనకు అంద చందాల్లో సాటి రాలేదని ఏనాడూ చులకనగా చూడలేదు. కళ్యాణి చదువుకున్నది. సంస్కారం కలది. తనకు రెండు నెలల క్రితం జబ్బు చేసినప్పుడు నిద్రాహారాలు మాని అస్తమానూ అంటిపెట్టుక్కూర్చుంది. తనకు జబ్బు నయమైతే కొండ కొస్తామని శ్రీ వెంకటేశ్వరస్వామికి దణ్ణం పెట్టుకుంది.

అయినా, కళ్యాణి అంటే తనలో ఏదో చెప్పరాని బాధ. తను కూడా మరి కాస్తంత అందంగా ఉంటే బాగుండేది. ఏమిటో ఈ దేవుడు ! ఆ యువకుడికి ఇచ్చిన అందం తన కెందుకివ్వరాదూ ! అందమైన భార్య నిచ్చాడు. బాగానే ఉంది. కాని ఈ పని కూడా చేసి ఉంటే ఎంత బాగుండేది.

వెంకట రమణకి ఇంకా పెళ్లి కాలేదని మునసలమ్మ చెప్పింది. [illegible] ఎక్కువ సంపాదిస్తున్నాడు. ఇతడికి అందమైన భార్య దొరికితే బాగుణ్ణు. మనిషి మంచివాడుగా కనిపిస్తున్నాడు.

ఏమో ! పైకి అందరూ మంచివాళ్లుగానే కనిపిస్తారు. వీలు గానీ పరిస్థితుల్లో అందరూ బుద్ధిమంతులే. వెంకట రమణ తన భార్య చేయి పట్టుకు కాపాడాల్సి సంఘటన భగవంతుడెందుకు కల్పించాలి. ఎం[illegible]ంచి వాడయితే మాత్రం ! పెళ్లిగాని యు[illegible] ఇల్లాంటి అవకాశాల కోసరమే రైళ్లల్లో వా[illegible]గ్గర నిలబడతారు.! తన సీట్లో తాను కూర్[illegible]టు దగ్గర దేనికి నిలబడటం? తానెంత బతిమిలాడినా తలుపు తెరవలేదు గేటు దగ్గర జనం. వాళ్లల్లో ఇతను లేడులే ! వాడెవడో కళ్యాణి గద్దించేసరికి తలుపు తెరిచాడు ! తన మాట కన్నా కల్యాణి మాటకే విలువ ఉన్నదన్నమాట.

రైలు క్రింద పడకుండా రక్షించాడని, తనకు వెంటనే చోటు ఇచ్చాడని కళ్యాణికి ఇతగాడంటే గౌరవం ఏర్పడ్డది. వాడు [illegible] ఏమా అబ్బాయా? అని మునసలమ్మని కళ్యాణోగా అడిగింది ! మునసలమ్మని, రమణ, ఇందాక మందలిస్తుంటే కళ్యాణి ఆపుకోలేనంత నవ్వు వచ్చింది. దేనికి ?

సుందర్రావు ఆలోచనల్లో బుర్ర వేడెక్కింది. అతడు ఉస్సురంటూ కిటికీకి ఆనుకొన్నాడు.

"ఏమండీ మఫ్లరు తీసివ్వనా ? చల్లటి గాలి కొడుతున్నది" అన్నది కళ్యాణి.

"అక్కర్లేదు" అన్నాడు సుందర్రావు.

వెంకట రమణ చేతిలో ఉన్న పుస్తకం మూసి ప్రక్కనున్న సంచిలో పెట్టి, రెండు వారపత్రికలు బైటకి తీశాడు. వాటి మీద బొదిలు చూసి ఒక దాన్ని సంచి మీద పడేసి రెండోది తీసుకొని పేజీలు తిప్పుతున్నాడు.

కళ్యాణికి ఏమీ తోచటం లేదు. మునసలమ్మ మాట్లాడ్డం మానేసింది. తన భర్త ఆవిడ చెప్పినట్లు అటుగా వెళ్లి కూర్చోలేదని కాస్తంత ముభావంగా ఉంది. తన భర్త కూడా ఏదో దీర్ఘాలోచనలో ఉన్నాడు. వెంకట రమణ దగ్గర పుస్తకం మరోటి ఉంది. అడిగితే అతనివ్వకపోడు. మనిషి చాలా మంచివాడు. ఆయన దగ్గర పుస్తకం అడిగి తీసుకోండి అని భర్తకి కళ్లతోటే సౌజ్ఞ చేసింది కళ్యాణి. సుందర్రావు అర్థం కానట్లు ఊరుకున్నాడు. మళ్లీ, కళ్యాణి సౌజ్ఞ చేసింది. సుందర్రావు ఏమీ ఎరగనట్లు ఉండి పోయాడు. కళ్యాణి ఊరుకోలేదు.

"వారిని ఆ పుస్తకం....." భర్త వంక చూస్తూ అర్థోక్తిలోనే ఆగి పోయింది.

"తీసుకోండి. దానికేం భాగ్యం." అంటూ వెంకట రమణ పుస్తకాన్ని సుందర్రావుకు ఇచ్చాడు.

సుందర్రావు చేతిలోంచి కళ్యాణి పుస్తకం తీసుకొని పుటలు తిరగేస్తున్నది. సుందర్రావు మనస్సేమీ బాగా లేదు. అతడు సీట్లో కూర్చోలేక పోతున్నాడు.

వెంకట రమణ ఆదినుంచీ సుందర్రావు మనో భావాలు కనిపెడుతూనే ఉన్నాడు. సుందర్రావులో ఉన్న బలహీనత అతడి మొహంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తూనే ఉన్నది వెంకట రమణకి. మధ్య మధ్య అనుకోకుండానే కళ్యాణి వైపు తన చూపులు పరుగెత్తుతున్నాయి. అతడు తన చూపులు మళ్లించుకోటానికి శతధా ప్రయత్నిస్తున్నాయి. తన మూలంగా సుందర్రావు బాధ పడటం అతడికి ఇష్టం లేదు. అవతల తల్లి ఉంది. కళ్యాణి వంక తాను తదేకంగా చూస్తుంటే తల్లి మాత్రం ఏమనుకుంటుంది ! కళ్యాణి తన వైపు కృతజ్ఞతా సూచకంగా రెండుసార్లు చూసింది. కాని పదే పదే ఆమె వైపే తాను చూస్తుంటే ఆమెలో తనకు ఏర్పడ్డ గౌరవస్థానం మాసిపోదూ ! తానొక అల్పుడుగా ఆమె దృష్టికి కనపడతాడు ! వివిధ ప్రయత్నాలు చేశాడు వెంకట రమణ అందమైన కళ్యాణిని చూడకుండ ఉండాలని. కాని ప్రతి అయిదారు నిముషాలకూ తన చూపు తన కళ్లల్లోనే దుమ్ము కొట్టి తప్పించుకు కళ్యాణి దగ్గరకు పరుగెత్తేది. "ఈ అమ్మాయికి భగవంతుడు ఎంత అందం ఇచ్చాడు !" అని భగవంతుణ్ణి మెచ్చుకుంటూ, ఆ భగవంతుని విలాసంలో [illegible] కోవాలని కొంతసేపు ప్రయత్నించాడు వెంకట రమణ. కాని లాభం లేదు అనుకున్నాడు ! తాను రమణ మహర్షి కాదు. వట్టి వెంకట రమణ ! అని తేల్చుకున్నాడు !

సుందర్రావుకు కళ్యాణి పుస్తకం చదవటం ఇష్టం లేదు.

"టిఫిన్ తిందామా" అన్నాడు కళ్యాణితో.

కళ్యాణి టిఫిన్ కారియర్ తెరిచి అందులోంచి రవ్వ లడ్డూ, గారెలు తీసి అరిటాకులో అందిచ్చింది సుందర్రావుకి.

"ఒరే అబ్బీ — వచ్చే స్టేషన్లో ఏమన్నా దొరుకుతుందేమో కొనుక్కు తిను. రైల్లోకి




చెట్టు ఎక్కడం తెలిసింది కాని, దిగడం తెలియ లేదోయ్!...





# భార్య రూపవతి...

ఏమన్నా చేస్తానంటే వసేవీ ఒద్దన్నావు. మధ్యాహ్నం ఎప్పుడో తిన్న అన్నం. వది కావస్తున్నట్టుంది. దిగి తిను రైలాగంగానే'' అన్నది ముసలమ్మ.

''సరేలే—నా కిప్పుడేం ఆకలిగా లేదు'' అన్నాడు. వెంకటరమణ.

కల్యాణి భర్తవంక చూసింది. అతడేం మాట్లాడలేదు. కళ్యాణి భావం అతడు గ్రహించాడు. రమణకి తాము టిఫెన్ పెట్టాల్సినంత అవసరమేమొచ్చింది ! అతడెవరు ? కళ్యాణి మీద చాల కోపం వచ్చింది సుందర్రావుకి. గారె ముక్కతో పాటు కోపాన్నికూడా దిగమింగుతున్నాడు సుందర్రావు.

కళ్యాణి, భర్త ఏమీ మాట్లాడక పోయేసరికి, ఆయన వెంకటరమణని అడగడానికి మొహమాట పడుతున్నాడనుకుంది. ముసలమ్మ మొహంలోకి తొంగి చూసింది.

''పుచ్చుకుంటారా అవ్వగారూ !'' అంది కళ్యాణి.

''వాకెందుకులేమ్మా. ఉంటే మా అబ్బాయి కివ్వండి'' అన్నది ముసలమ్మ.

''ఏమిటి నీ పిచ్చి, అఖర్లేదండీ—నాకాకలిగా లేదు'' అన్నాడు వెంకటరమణ తల్లివంక కళ్యాణి వంకా చూస్తూ.

సుందర్రావుకి పిచ్చెత్తినట్లయింది. కాని తానూ గొప్ప సభ్యత కలవాడే. తన బలహీనత భార్య ముందు ప్రదర్శించుకొని తేలిక పడటం అతనికి కిష్టంలేదు.

''ఫరవాలేదు. ఈ కాస్త తీసుకోండి. అందరం కలిసి తిరుపతికి వెళ్తున్నాం. వచ్చేస్టేషన్‌లో ఏమన్నా దొరకొచ్చూ దొరక్కపోవచ్చు. ఏమీ అనుకోకండి'' అంటూ భార్య అందిచ్చిన మరో ఆకులోని ''టిఫెన్'' వెంకటరమణ కిచ్చాడు సుందర్రావు.

''తీసుకోరా! వచ్చే స్టేషన్లో అరటిపండ్లు ఓ అరడజను తీసుకురా! రెండు నేను నోట్లో వేసుకుంటాను. మిగతావి అందరూ తీసుకుందురు గాని'' అన్నది ముసలమ్మ.

వెంకటరమణ సిగ్గుపడుతూనే టిఫెన్ తింటున్నాడు. సుందర్రావు అతడికి మంచినీళ్లు అందించాడు.

బండి స్టేషన్‌లో ఆగింది. కళ్యాణి త్రాగటానికి మంచినీళ్లు అయిపోయినాయి మరచెంబులో. సుందర్రావు మంచినీళ్లకని దిగి వెళ్లటానికి ఇష్టపడలేదు. తాను లేనప్పుడు తన భార్య, వెంకటరమణ, అక్కడే కూర్చోటం, వాళ్లు ఒకర్నొకరు చూసుకోవటం తాను సహించరాని విషయం.

''కాసిని నీళ్లు పట్టుకొస్తారా !! అరటి పళ్ల కోసం ఎటూ దిగుతున్నారనుకుంటామా!'' అన్నాడు వెంకటరమణతో సుందర్రావు.

''అలాగేనండి. మరచెంబు ఇవ్వండి'' అన్నాడు.

వెంకటరమణ మరచెంబు అందుకుని వెళ్ళాడు.

''అతణ్ణెందుకండీ? పాపం కష్టపెట్టటం'' అన్నది కళ్యాణి. ఈ మాట సుందర్రావుకి కొరడా దెబ్బలా తగిలింది. క్షణక్షణానికీ కళ్యాణి తనకు దూరమైపోతున్నట్లనిపించింది. తాను ఆ పెట్టె ఖాళీ చేసినా బాగుణ్ణు అనిపించింది సుందర్రావుకి. అతడిలో అణుచుకుంటున్న బలహీనత, అతడి

కూడా విజయం సాధించింది. వెంకటరమణి అతడి తల్లి ఆ పెట్టె దిగిపోయే ఉపాయం ఆలోచించటం మొదలు పెట్టాడు సుందర్రావు.

గార్డు విజిల్ వూదాడు. ముసలమ్మ "అబ్బాయి రాలేదే ?" అని ఆందోళన పడ్డది. ఇంజన్ కూతేసింది. వెంకటరమణ నీళ్లపంపు దగ్గర్నుండీ పరుగెత్తు కొస్తున్నాడు. పెట్టె దగ్గరికి వచ్చాడు. అప్పటికే బండి కదిలింది. కిటికీలోంచి మరచెంబు అందిచ్చి వాకిలి దగ్గరకు పరుగెత్తి ఎక్కాలను కున్నాడు వెంకటరమణ. మరచెంబు అందుకుంటున్న సుందర్రావు చెంబును సరిగ్గా అందుకోక ప్లాటుఫారం మీదికి జారవిడిచాడు. చెంబు కోసం వెంకటరమణ వెనక్కిపోయి చెంబు తెచ్చేలోగా చేతిలో ఉన్న గ్లాసు కూడా తొందరలో ఉన్నట్టు నటించి జారవిడిచాడు. బండిలో ఆ పెట్టె ప్లాటుఫారం దాటింది. బండివేగం హెచ్చింది. చెంబూ గ్లాసూ పట్టుకొని పరుగెత్తుకొస్తున్న వెంకటరమణని.

"పరుగెత్తొద్దు. పడిపోతారు. జాగ్రత్త ప్రమాదం. ప్రమాదం" అని సుందర్రావు కేకలు పెట్టాడు.

బండిలో ముసలమ్మ గొల్లుమంది.

"నీ చేతులు విరిగిపోను. మరచెంబూ గ్లాసూ ఎందుకు వదిలేశావు ?" అని తిట్టి పోసింది సుందర్రావుని.

కళ్యాణీ, బండిలో మిగతా వాళ్ళూ ఆమెని ఓదార్చారు.

"ప్రక్క స్టేషన్‌లో బండి ఆగంగానే ఆమెని సామానూ దించి వెనక స్టేషన్‌లో దిగబడ్డ వెంకటరమణకు చెప్పించండి" అన్నది కళ్యాణి సుందర్రావుతో.

స్టేషన్‌లో బండి ఆగింది. ముసలమ్మ గొల్లుమంటూ దిగింది. సుందర్రావు స్టేషన్‌మాస్టరుకు జరిగింది చెప్పాడు. వచ్చే బండిలో వెంకటరమణ వస్తున్నాడని ముసలమ్మను స్టేషన్‌మాస్టరు ఓదార్చాడు.

*   *   *

తిరుపతిలో కళ్యాణ కట్ట దగ్గర సుందర్రావు, కళ్యాణీ ఆగి లోపలకు ప్రవేశించారు. సుందర్రావు తల నీలాలు ఇవ్వటానికి పీట మీద కూర్చున్నాడు. అతడి పొంటు, చొక్కా పట్టుకుని నిలబడ్డ కళ్యాణి తానూ ఒక టిక్కెట్టు కొనుక్కొని మంగలి ముందు కూర్చున్నది.

సుందర్రావుకు ఒళ్ళు మండింది.

"ఏమిటీ పని. నువ్వెందుకివ్వాలి జుట్టు ?" గద్దించాడు.

"ఏమో నేనూ ఇవ్వాలనుకున్నాను" ముక్తసరిగా జవాబిచ్చింది కళ్యాణి.

"తల నీలాలిస్తుంటే వద్దనరాదు సామీ" అన్నారు మంగలివాళ్ళు.

తలనీలాలిచ్చాక స్వామి దర్శనానికి వెళ్ళారు సుందర్రావు— కళ్యాణి. గర్భగుడిలో స్వామి విగ్రహం సమీపిస్తున్న కొద్దీ భక్తులు "వేంకట రమణా గోవిందా గోవింద" అన్న నినాదాలు సుందర్రావు చెవుల్లో గింగురుమంటున్నాయి.

శ్రీ వేంకటరమణుని విగ్రహాన్ని సుందర్రావు తలెత్తి తేరిపార చూడలేక పోయాడు. తల దించుకున్నాడు. కళ్యాణి స్వామి విగ్రహాన్ని తనివితీరా చూసింది. ఆనంద పారవశ్యంతో ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. ★



# తాళాధ్యాయం

లతిక

తాళమంటే భావ రాగ తాళాల లోని తాళం కావచ్చు! భద్రత కోసం ఇళ్ళకీ, బీరువాలకీ వేసేది కావచ్చు. కాని, నేను వ్రాయ బోయేది, "వృక్షవృత్తాంతం"లో తాళాధ్యాయం మాత్రమే,

తాళాధ్యాయమంటే కమ్మలుగట్టి పరిహసించడ మనే అపార్థం ఉంది. కాని, తాళ సమున్నతమై తనరారే యీ 'తాళ భూజ పురాణం' లో అపార్థాలకూ, అనర్థాలకూ తావులేదు.

తాళ చరిత్రలో ఒకే ఒక కళంకం ఉంది. ఈ ఏకైక కళంకం, కాకతాళీయం మాత్రమే. ఆ వైన మిది. "సూర్యకర సంతప్త ప్రధానాంగుడైన ఖర్వాటు డొకడు, త్వరలోఁ బరుగెత్తి, తాళద్రుమ చ్ఛాయ" చేరి నిలిచాడు. ఆ చెట్టుమీదే (మీదీ మాదీ కాదు) కాకి వాలింది! పండు పడింది. అది ఖర్వాటుని ఒట్టితలపై శబ్దయోగంబుగా పడింది. అతను దైవోపహతుడు. ఎండ వేడికి తాళలేక తాళభూజాన్నాశ్రయిస్తే, మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టయింది! ఇదే కాకతాళీయం.

తాడి సర్వజనోపయోగకరమైనది. చెట్టు రూపంలో నీడ యివ్వలేకపోవచ్చు. కాని, తాటి రాటలు పాతి, తాటి కలప వాసాలు వేసి, తాటి కమ్మ వేస్తే అది 'తాళ్ళపాక' అవుతుంది. అందులో తాటాకుల చాప పరుచుకుని, తాళవృత్తంతో విసురుకుంటూ, తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తనలు పాడుకోవచ్చు. తదనంతరం తాటిబెల్లం నైవేద్యం సమర్పించవచ్చు.

ఉండడానికి ఇళ్ళు కేటాయించిన తాటి, తిన డానికి తిండి పండించడంలో ఎలా పాటుపడు తోందో పరికించండి. పంటపొలాల్లోని నేల నూతు లలో నీరు తాటిరేకు 'శేక' (చేద) తో, తోడి, మళ్ళకు మళ్ళించడానికి దొన్నెలుగా ఉపయోగిస్తారు.



తాటిమాను మధ్యకి చీలిస్తే—దాన్ని దోనె అంటారు. చిన్నసైజు పంటకాలువలకి తాటి దూలాలే వాడుతారు. ఇవన్నీ సామాన్యోపయోగాలు.

ఇక ప్రత్యేకోపయోగాలు. (కోపం యోగం అని విడదీసి అపార్థం చేసుకోకండి. సంధి పాటించండి!) హిందువుల పర్వాలలో దీపావళి పెద్దపండుగ ఒకటి. అప్పుడు తాటాకు టపాకాయలు పేలుస్తారు. తాటాకు భూచక్రాలు కాలుస్తారు. చిన్నపిల్లలు తాటాకు గిలకలతో ఆడుకుంటారు. తాటాకుల చప్పుళ్లకి కుందేళ్లు బెదరవు. చప్పున చల్లారేది తాటాకుల మంట.

ఈ విషయాలు మీరు నమ్మకపోతే కొన్ని అబద్ధాలాడుతాను. నవాబులు పాలించే గోలుకొండలో మిరియాలు తాటికాయలంతేసి ఉంటాయి. అక్కడి దూడలకి గడ్డి కావాలంటే బోయీల బోడిగాడు తాటిచెట్టెక్కి దూడ గడ్డి తెస్తాడు.

అబద్ధాలు కట్టిపెట్టి, ప్రజాహితకాంక్షతో చేసే పారిశ్రామిక ప్రగతి పరిశీలిద్దాం. విశాఖలో ఉక్కు ఫ్యాక్టరీ నెలకొల్పుతారట. దానికి 60 మిలియన్ల గాలన్ల నీరు కావాలి. ఆ అవసరాన్ని కొంత వరకు తాటిపూడి ప్రాజెక్టు తీరుస్తుంది. (చూ. ఆంధ్రదినపత్రిక 13—8—64).

జీవితావసరాలు తీర్చుకోడమే లక్ష్యం కాదు కదా! మానవుని మనోవికాసానికి తోడ్పడేవి గ్రంథాలు. ఒకప్పుడవి తాళపత్రాలపై వ్రాసేవారు.

ఒక వరుసలో కాక, వక్రంగా ఉన్న ఏడు తాడిచెట్లని రాముడు ఒకేబాణంతో కొట్టాడట! తరవాత కొన్ని యుగాలకి శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై భద్రగిరిపై వెలిసాడు. ఆ ప్రతిమ తనకు సాక్షాత్కరించిన తొలిరోజున, తనరు బోయల దమ్మక్క అనే భక్తురాలు —

"తత్పులకిత విగ్రహంబులకు
శుద్ధి యొనర్చుచుం బూజచేసి, తా
నిలిచిన తాటిచెట్టు కడ
నే ప్రతిమల్ తనకుం బ్రకాశమై
వెలయుట తాటిపండ్లను ని
వేదన మిచ్చె" నని కే. శే. కవిశేఖర భోగరాజు

నారాయణమూర్తిగారు 'ప్రత్యక్షరాఘవం' కావ్యంలో మనోజ్ఞంగా అభివర్ణించారు.

భక్తికి మననమే ప్రధానంగాని, ఆడంబరాలతో సమర్పించే పెట్టిపోతలు గావని శబరితోపాటు దమ్మక్క మరోసారి నిరూపించింది.

# పారిజాతోపాఖ్యానం...



అది భక్తి. రక్తి కావాలంటే పారిజాతాపహరణం పఠించాలి. నారదుడు తెచ్చిన పారిజాతం తనకివ్వక సవతి రుక్మిణికిచ్చినందుకు అలిగినసత్యను పరివేష్టించిన మనఃక్షోభను సాగనంపి,

"ఈ లలితాంగి చంద మొక
యొసంగక మూసెద నంచు, భూర్జ గో
పాలుడు 'తాలవృంత' మొక
భామిని సత్యసిఖుండ నుండి మా
టాలప లీలమై విసర
నాడట గ్గ్ కొని మిచ్చె దర్పమై
కేలిత పంచసాయక శిఖిం
దరికొల్పుచు మన్న కైవడిన్."

తాడి, కృష్ణుని కానాడలా ఉపకరించింది.

ధర్మజుని పరిజ్ఞానం పరీక్షించడానికి యముడు, 'యక్షుడై తాళ సముచ్ఛ్రితాంగుడై' సాక్షాత్కరించాడు. సాక్షాత్కరించి, "తా డన నేమి ధర్మతనయా" అని ప్రశ్నించాడు. ధర్మజుడు ఆంధ్రనామ సంగ్రహం చదివి,

"తా డనంగను, తాడి నా తాళ భూరు
హంబునకు నాఖ్యలై యొప్పు ననఘ."

అని ప్రత్యుత్తర మిచ్చాడు. యముడు మళ్లీ అడిగాడు.

"దాన్ని ఆంగ్లంలో ఏమంటారు ?"

"పామ్ మైరా ట్రీ!"

"అది దేనికి ఉపమానం ?"

"తాళ సమున్నతుడైన వ్యక్తి అని పోల్చడానికి."

"మరి దేనికి ప్రమాణం ?"

"దూరం కొలవడానికి కూడా !"

"సోదాహరణంగా వివరించు !"

"కథాపూర్వోదయంలో శతతాళ ధన్వమనే జలాశయం ఉంది. దాని లోతు నూరు తాటిచెట్లు."

"తాటిచెట్టువల్ల నేర్చదగిన గుణపాఠం ఉందా?"

"ఉంది. తాడి తన్నేవాడుంటే, వాడి తల తన్నేవాడు కూడా ఉంటాడు. కాబట్టి వ్యక్తులు గర్వించరాదు."

"మరొకటి ?"

"స్వశక్తిపైనే ఆధారపడాలి. తాటిచెట్టెక్కే వాళ్ళే ఎంతకని పట్టడం ?"

"ఈతపండిచ్చి, తాటిపండు లాగడమంటే ఏమిటో కలియుగ ధర్మానుసారంగా వ్యాఖ్యానించు."

"సిగరెట్టిచ్చి, సినిమాకి తీసుకెళ్లమని వాదించడం."

తనయుని జ్ఞానానికి ధర్ముడు సంతృప్తుడై మరి ఆట్టే ప్రశ్నలు వేయకుండా, వరాలిచ్చి తిరోహితుడయాడు. వరాల వివరాలు కావాలంటే తాళానుబంధం కోసం నిరీక్షించండి. ★





# "సైతాన్ చేతుల్లో బానిసను"-3

## హోడ్ డిబ్బెన్

నేనూ, నా కుమారుడూ లోనయిన అనుభవం నిజమయినదేననీ, కేవలం మా భావ కల్పన కాదనీ తెలుసుకున్నాను.

లండన్ నుంచి మా మిత్రుడు, రెజినాల్డ్ వార్నర్, నాతో కొన్ని రోజులు ఉండి పోదామని వచ్చాడు. అతను ఒక పెద్ద 'కళా నిపుణుడు', కళకి సంబంధించిన విషయాలలో ఎందరో అతని సలహాలు పొందుతూ ఉంటారన్నమాట.

ఎందుకోగాని నేరుగా 'దయ్యాలగది'కే వెళ్లాడు. నేనూ, మైకేల్ కింద కూర్చున్నాము— త్వరలో ఏదో భయంకరమయిన కేక వినిపిస్తుంది, అనుకుంటూ గంట సేపటికిదాకా ఏదీ వినిపించక పోయే సరికి మా మా గదులకి వెళ్లిపోయాము.

రెండు గంటలు గడిచాయి. హఠాత్తుగా కేకలు వినిపించాయి. 'దయ్యాల గది'కి దవుడు తీశాను. రెగ్గీ స్పృహ లేకుండా నేల మీద పడి ఉన్నాడు. మైకేల్ అతని దగ్గర నుంచుని, "రెగ్గీ ! రెగ్గీ ! ఏమయింది ?" అని అడుగుతున్నాడు.

కొంత సేపు తర్వాత రెగ్గీ కళ్లు తెరుచుకున్నాయి. "చెయ్యి ! ఆ చెయ్యి !" అన్నాడు.

కోలుకున్న తర్వాత జరిగిందంతా చెప్పాడు. కిటికీ దగ్గర అలికిడి విని మేలుకున్నాడుట. ఏమిటో అని లేచి వెళ్లి తెరవగా, ఒక పెద్ద చెయ్యి చీకటిలో నుంచి వచ్చి మొహాన్ని గీరిందిట !

"ఆ తర్వాత జరిగిందేమిటో తెలీదు !" అన్నాడు రెగ్గీ. గదికంతా జాగ్రత్తగా పరిశీలించాము. ఈ సంఘటన నెలా అర్థం చేసుకోవాలో తెలియు లేదు.

రెగ్గీ మమ్మల్ని వదిలి లండన్‌కి తిరిగి వెళ్లి పోయాడు. నేనూ ఒక నిర్ణయానికి వచ్చాను. లైటన్ కారీని వదిలెయ్యాలనుకున్నాను. దానిలో దుష్ట శక్తులు ఆవరించాయి.

### పాట్సీ

కాని పాట్సీ మార్గన్ సంగతేమిటి ? పాట్సీ నా వ్యాపారంలో నాకు తోడ్పడేది. ఆ అమ్మాయంటే నాకు చాలా వాత్సల్యం. నన్ను తండ్రి



హోడ్ డిబ్బెన్‌ను చిక్కుల్లో పెట్టిన 'లైటన్స్' కారీ హౌస్.

కింద చూసేది. తన పేరుని పాట్సీ మార్గన్ డిబ్బెన్‌గా మార్చుకుంది కూడా. ఆమెని నాతో లండన్‌కి తీసుకు పోవటం న్యాయమా ?

నిజాయితీగా ఉండటమే 'మంచి దనుకుని ఆమె నా 'సైతాన్ సంఘం సభ్యత్వం' గురించి చెప్పాను.

నా కథనంతా సానుభూతితో విన్న పాట్సీ నాకు అన్ని విధాలా సహాయ పడతానని చెప్పింది.

లండన్‌లోని ఈటన్ ప్లేస్‌లో ఒక ఇల్లు తీసుకున్నాము. కొంతకాలం తర్వాత ఆమె ఒక క్లబ్ స్థాపించి అంతర్జాతీయ కీర్తి సంపాదించుకుంది. నేను చర్చికి సక్రమంగా వెడుతూ ఉండేవాడిని. ఇలా కొంతకాలం గడిచింది. నాలో నిరాశ తగ్గటం ప్రారంభించింది. ధైర్యంగా బయటికి వచ్చి తిరగటం మొదలు పెట్టాను.

ఒక రోజు. . .

ఇటలీ బెట్టీ అనే అమ్మాయి పటం ఒకటి ఉండేది. ఆమెతో నా పాపాల కథని చెప్పాను, ఒకప్పుడు.

ఆమె పటం నా చెయ్యి తగిలి కింద పడింది. అద్దం విరిగి పోయింది. ఆ చిత్రం వంక చూస్తూ ఉంటే నన్నొక విపరీతమయిన భయం పట్టుకుంది. ఇదొక దుశ్శకునమా ?

నేను చేసిన పాపాలకి ఆమెకా శిక్ష ? నన్ని ఆలోచన పీడించింది.

ఆమె అప్పటికి ఇటలీలో తన భర్తతో బాటు ఉంది. కాని 'సిసెరా' (పూజారిణి) చెప్పిన సంగతి నేను మరిచిపోలేక పోయాను. ప్రమాదం ఎక్కడున్నా తప్పదు ! 'తండ్రి మరణం, వీలునామాలో నా పేరు ఉండక పోవటం, ఒక ఆప్త వ్యక్తి దుర్మరణం, నమ్మినవారి వద్ద ద్రోహం' జరుగుతాయని చెప్పింది.

మొదటి మూడూ జరిగాయి. ఇక నాల్గవది ? బెట్టీ గురించి ఆలోచించటం మొదలు పెట్టాను. ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు.

ఇంకేదో పని కూడా ఉందని ఇటలీ వెళ్లాను. బెట్టీనీ, ఆమె భర్తనీ సందర్శించాను. ఇద్దరూ బాగానే ఉన్నారు. నా భయాలను వారికి చెప్పి వారి మనస్సులు పాడు చెయ్యటం దేనికని వూరుకున్నాను. లండన్‌కి తిరిగి వచ్చేశాను.

### దుర్వార్త

లండన్ విమానాశ్రయంలో ఒక పత్రిక కొన్నాను. మడత విప్పి చదవటం ప్రారంభించీ గానే బెట్టీ ఒక కారు ప్రమాదంలో చనిపోయిందన్న వార్త నా కంట బడింది.

పూజారిణి చెప్పిన నాలుగు విషయాలు నిజమయ్యాయి.

ఇక అయిదవది— "నమ్మిన వారి వద్ద నుంచి ద్రోహం!"

పాట్సీని నా నుంచి దూరంగా చేసిన వారు చాలా భయంకరంగా ప్రవర్తించారు.

ఒక నాడు ఆ పరిచయ వ్యక్తి ఎవరో వచ్చి నాతో పని ఉందన్నాడు. అతని ప్రతిపాదనలు నాకు నచ్చలేదు. కోపంగా వెళ్లిపోతూ, "డిబ్బెన్, నువ్వు నెగ్గుకు రాలేవు ! జాగ్రత్త ! !" అని హెచ్చరించాడు.

ఇంతకీ అతని ప్రతిపాదన— బెట్టీ నైట్ క్లబ్‌ని కొంటాననటం. (అతని పేరు ఆంద్రే గాబోర్ బోబోర్ మెన్కీ, ఒక పేరు పొందిన హంగేరియన్ లాయరు, బ్రిటన్‌లో స్థిరపడి పోయాడు.)

ఆ రాత్రి నా పడకగది కిటికీ నెవరో తట్టారు. ఎవరా అని బయటికి తొంగి చూశాను. ఎవరూ కనిపించలేదు కాని, "నల్ల దుస్తులు తొడిగే మా భృత్యుడు నీ పని పట్టిస్తాడు !" అన్న మాటలు వినిపించాయి.

వీరసంగా, విస్మయంగా వచ్చి నా కుర్చీలో

చూస్తున్నాను. సైతాన్ పరిహాసం నన్ను చుట్టు ముట్టేసింది !

దాని బారి నుండి తప్పించుకుందామని చూసి అనుభవిస్తున్న నరకం ఇందులా ! పాపాన్ని పూజించ టం వల్ల వచ్చిన ఫలమే నన్ను వెన్నాడుతోంది! కొత్త జీవితం తిరిగి ప్రారంభిద్దా మనుకున్న నా ఆశలు అడియాస లవుతాయా ?

వ్యాపారంలో, కుటుంబ వ్యవహారాలలో, వ్యక్తి గత సంబంధాలలో— వీటన్నిటిలోనూ నేను ఓడిపోవలసిందేనా ?

ఇంతదాకా 'పూజారిణి' చెప్పిన నాలుగు విష యాలు నిజమయ్యాయి. ఇక అయిదవదీ నిజ మయితీర వలసిందేనా ?

పాట్నీకి రానున్న విపత్తు ఎటువంటిది ? ఆమెని వదిలి ఉండగలనా ? ఆమె నాకు ద్రోహం చేస్తే నా గతేమి కావాలి ?

ఎన్నటికీ జరగని విషయం ! ఆ ధైర్యంతోనే మళ్లీ నిద్రకి ఉపక్రమించాను. (సశేషం)

# హృదయ కుసుమాలు

25 వ పేజీ తరువాయి

తాసీల్దారు గారి తనయోత్తరుడు, లలిత కోశాధ్యక్షుల గారమ్మాయిలు, పిల్లు మాస్టర్లూ, జ్యోతి నలుగురూ కలిస్తే ఎన్ని గంటల పేపయినా మాట్లాడేస్తారు. అంతా పెద్ద ఉద్యోగస్థుల పిల్లలు కాబట్టి.

రోజూ జ్యోతి, నేనూ కూడా టిఫిన్ బాక్సులో మధ్యాన్నానికి టిఫిన్ చేసుకు వెళ్ళే వాళ్ళం. జ్యోతి ఫ్లాస్కులో కాఫీ కూడా తెచ్చుకునేది. నేను మధ్యాన్నం కాఫీ తాగేదాన్ని కాదు. కారణం ఎక్కువ ఇష్టం లేకనే.

"ఇవ్వాళ టిఫినేం తెచ్చావ్ సీతా." అన్నది జ్యోతి.

"ఉప్మా"

"ఉప్మానా. మధ్యాన్నానికి చల్లారిపోయి ఏం బాపుంటుంది. చక్కగా మైసూరు పాకో, రవ్వ లడ్డూనో, అయితే ఎంతో రుచిగా ఉంటుంది. కారం ఏ మిక్చరో, బూందినో అయితే అక్కడికి స్వీటూ,కారం తినొచ్చు. నేను రోజూ స్వీటూ, హాటూ రెండూ తెచ్చుకోవాల్సిందే. కాఫీ తాగవా."

"మధ్యాన్నం పూట తాగను. కాఫీ ఎక్కువ పయించదు."

"చాలా పొదుపరివన్నమాట. చల్లారిన ఉప్మా తిని పంపులో మంచి నీళ్ళు కాఫీగా తాగుతావన్న మాట." అని హేళనగా నవ్వింది.

"మంచి నీళ్ళు కాఫీగా ఎట్లా తాగుతారు జ్యోతి. పిచ్చంతా వరి పోద్యం" అన్నాను.

"ఇడ్లీలు కూడా తెచ్చుకుంటావా."

"అవో. అప్పుడప్పుడూ అవ్వీనూ. అట్లు కూడా తెచ్చు కుంటాను. పూరీలు, పెసరట్లు, మినపట్లు. ఒక్కో రోజున ఒక్కో టిఫిన్" అన్నాను.

"అంతా చప్పగా చల్లారి పోయిన వరుకులేనే ఇష్ట మున్నమాట. అలాంటి వన్ని నేను వేడి వేడి వయితేనే తింటాను. చల్లారితే నాకు పయించవు. అయితే ఇప్పుడు ఏండి కూడా తెచ్చుకో అప్పు డప్పుడూ" అని నవ్వింది జ్యోతి.

జ్యోతి మనస్తత్వానికి, ఆహారభావానికి మన స్సులో విచార పడ్డానే కాని ఏమీ అనలేక పోయాను.

* * *

రోజులు గడిచి పోతున్నాయ్. దసరా పండుగలకు పది రోజులు శలవు లిచ్చారు. జ్యోతి గుంటూరు వెళ్ళింది.

దసరా పండుగలు తల్చుకుంటే నా మనస్సు వికలమై పోయింది. మిరుడీ రోజుల్లో దసరాకు అక్కయ్య గారింట్లో ఉన్నాను. అక్కయ్య జీవితం తీర్చి దిద్దటంలో ఆ రోజుల్లో కాలం అట్లా గడిచి పోయింది. చక్కగా, సరదాగా అక్కయ్యతో, బావతో కబుర్లు చెపుతూ, విజయవాడకు కనకదుర్గాదేవిని దర్శించటానికి వెళ్ళటమూ, రైల్లో జరిగిన, చూసిన సంఘటనలూ, బావ స్నేహితులింట్లో ఆయన భార్యతో ఎన్నో విషయాలు మాట్లాట్టమూ అన్నీ కళ్ళకు కట్టినట్లుగా సినిమా రీలులాగా నాకళ్ళ ముందు తిరిగి పోయినయ్యి. ఈ దసరాకు అక్కయ్య లేదు. అప్పుడే అక్కయ్య పోయి అయిదారు నెల లయింది. ఆ రోజులు వెన్నెల రోజులు, ఈ దసరా పండుగలు చీకటి రోజులు. వెన్నెలయినా, చీక టయినా జీవితాలు బాగుంటే అదే సంతోషం. కాపురాల్లో కష్టాలు పడుతున్నా మనస్సు విప్పి మాట్లాడుకోటానికి అక్కయ్య ఉంది. ఈ దసరాకు నేను వంటరి దాన్నయి పోయాను. నా భావాలు అర్థం చేసుకునేవారు గాని, మనస్ఫూర్తిగా మాట్లాడేవాళ్ళు కాని లేరు. నాలో నేను బాధ పడాల్సిందే. విచారంతో కుమిలి పోవల్సిందే. తోడ బుట్టినదాన్ని చంపుకుని చావలేక బ్రతుకు తున్న ఏకాకిని.

అక్కయ్య కళ్ళముందు కనబడుతుంటే ఆ దసరా ఎంతో ఆనందంగా గడిచి పోయింది. ఈ దసరా కన్నీళ్ళతో గడిచి పోయింది. బ్రతికుంటే రోజులు కనిపించవు. రోజులు గడపటానికే మనము బ్రతికున్నామా అనిపిస్తుంది.

ఆలోచిస్తూ కూర్చుంటే పోస్టుమేన్ కవర్ను కిటికీలోంచి వేసి వెళ్ళిపోయాడు. ఆత్రంగా విప్పి చదివాను. సుభద్ర రాసింది.

గుంటూరు.

సీతా!

నీకు ఉత్తరం రాసి చాలా రోజు లయింది. కాలేజీ జీవితం ఎట్లా ఉంది. ఈ రోజుల్లో చదువులూ, డిగ్రీలూ ఎట్లా ఉన్నా ఆడంబరమూ నాగరికతా లక్షణాలూ, మాట్లాడుతూనే గోతులు తీసే మనస్తత్వాలూ, ఉంటేనే మనబోటి వాళ్ళని మనుష్యులకింద జమ కడతారు. లేకపోతే ఎందుకూ పనికి రాని వాళ్ళమే. మన బడబడ వాగుడూ కల్మషం లేని మనస్తత్వాలను చూసి ఎవ్వరూ మనల్ని గౌరవించరు. రోజులు అట్లా ఉన్నయ్యి.

రమాదేవి ఇప్పుడు మన ఇంటికి వస్తున్నది. మొదట్లో సందేహిస్తూనే వచ్చింది. అమ్మ ఏమీ అనలేదు. ఆవిడకి కోడలు పోయిన దిగులుకన్న నాకు పెళ్ళి ప్రయత్నం మానాన్నగారు చెయ్యటం అన్న దిగులు ఎక్కువైంది. దానికి తోడు ఈ పెద్ద తనంలో పసివాడి పోషణ భారం ఆవిడ మీద పడ్డది. నే పుట్టిన తరువాత ఆవిడకు కాన్పు లేదు. అంటే పద్దెనిమిదేళ్ళయిందన్నమాట. ఇంత కాలానికి ఈ పసి గుడ్డు పోషణ భారం ఆవిడ మీద పడేసరికి ఆవిడకు పని తెమల కుండా ఉంది.

తెల్లవారు ఝామున బాబుకు కడుపుకు పెయ్యాలి కదా. ఆవిడకు నాలుగు నొప్పులు. లేవలేదు. వాడా అముదం తాగేవేళకి లేచి ఏడుస్తాడు. ఈ లోగా రాత్రి తెల్లవార్లూ వాడి ఉచ్చ గుడ్డలు అవి తీసి ఆరేస్తుండాలి. తెల్లవార్లూ నాలుగయిదు సార్లు లేచి పాలుకలిపి పట్టాలి. పెద్దది అమ్మ లేవలేదు. ఆవిడ విసుక్కుంటుంటే మధ్య మధ్య నేనూ, అన్నయ్యా లేచి వాడికి పాలుపట్టి నిద్రపుచ్చుతున్నాం. పాలయితే సరేతాం గాని వాడికి నీళ్ళు పొయ్యాలి కదా! పొద్దున పూట వాడికి నీళ్ళు పొయ్యాలంటే నడుం వంగాక ఆవిడ ఎంతో ఇబ్బంది పడుతుంది. కోపంతోనే వదినను తల్చుకుని విచారపడి, ఈ పెద్ద తనంలో తను ఈ పసివాణ్ణి సాకాల్సొచ్చిందని విసుక్కుంటుంది. వాడికి నీళ్ళు పోసి నేను పోద్దా మంటే తొడల వరకూ చీరె పైకి ఎగ్గట్టి వాణ్ణి కాళ్ళ మీద పడుకో బెట్టుకుని నీళ్ళు పొయ్యటం మంటే నాకు చచ్చే సిగ్గేస్తుంది. ఆ పోషణ కాని ఆ ముద్దు ముచ్చట్లు గాని, ఆ అవస్థలు కాని కన్న తల్లికి బాధ్యత ఉంటుంటం చేత పడాల్సిన అవసరం ఉన్నది గాని, ఇతరులకు అంత బాధ్యత ఉండదు కదా!

మొన్నీ మధ్య వాడికి నీళ్ళు పోస్తుంటే కాసిని నీళ్ళు నోట్లోకి పోయి మింగాడు. వాడికి జలుబు చేసి జ్వరం తగిలింది. ఆ రోజున అన్నయ్య పిచ్చివ విడిన్ని తల్చుకుంటే, వాడిని చూస్తుంటే నాకిప్ప టికీ కళ్ళంట నీళ్ళు తిరుగుతున్నయ్యి. ఆ రోజున అమ్మ, అన్నయ్య కొంచెం ఘర్షణ పడ్డారు. అన్న య్యని మళ్ళీ పెళ్ళి చేసుకుని బాబు పోషణ భారం తనకి తగ్గించమన్నది. అమ్మ అన్న మాటలు తల్చు కుని అన్నయ్య ఆ రోజల్లా కుమిలి పోయాడు. అన్నయ్య మనస్తత్వం పూర్తిగా మారి పోయింది.

రమాదేవి అంత గొప్పింటి పిల్లయినా, చదువు కుంటున్నా దురుసా పని పాటల్ని తెల్సు. తను మన ఇంటి కొచ్చినప్పుడు అస్తమానం బాబుని ఎత్తు




'ఆకాశవాణి!...కొద్ది క్షణాలలో దీపావళి ప్రత్యేక కార్యక్రమం వింటారు......'

కేవలం విక్స్ వేపోరబ్ మాత్రమే జలుబు బాధిత ప్రాంతాలు మూడింటి మీద వెంటనే పనిచేస్తుంది ...

# రాత్రికిరాత్రే జలుబును తొలగిస్తుంది




విక్స్ వేపోరబ్ తక్షణమే మీకు ఉపశమనాన్ని కలిగిస్తుంది. సులభంగా శ్వాస పీల్చుకొనుటకు...రాత్రంతా హాయిగా నిద్రపోవుటకు మీకు సహాయపడుతుంది...

గొంతునొప్పి, ముక్కునుండి నీరు కారుట, ఛాతీ బిగలాగుట, క్రమతో శ్వాసపీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనపడగానే జలుబు బాధిత ప్రాంతాల మూడింటి మీద...ముక్కు, గొంతూ, ఛాతీల మీద విక్స్ వేపోరబ్‌ను పులమండి. కొద్ది నిముషాలలోనే విక్స్ వేపోరబ్ మీ చర్మాన్ని వెచ్చచేయడం...మీకు ఉపశమనాన్ని కలిగించడం మీరు గమనిస్తారు. నివారణగలిగించే వేపోరబ్ ఆవిరితెరలు ముక్కు మరియు ఛాతీలలోని కఫాన్ని త్వరగా విడలగొట్టి మీ గొంతునొప్పిని తగ్గిస్తాయి.

విక్స్ వేపోరబ్ జలుబుతో రెండు విధాలుగా పోరాడుతుంది. రాత్రంతా మీరు సుఖంగా నిద్రించే సమయంలో యీ అద్భుతమైన ద్వివిధ చర్య కొనసాగుతూ ఉంటుంది. ఉదయానికల్లా మీ అతి పెద్ద జలుబు కూడా పూర్తిగా పోయి మీరు సంతోషంగాను, ఆరోగ్యంగాను వుంటారు.




## విక్స్ వేపోరబ్ యొక్క అద్భుతమైన ద్వివిధ చర్య



**వెలుపలి చర్య:** చర్మమును వేడిపరచె వేపోరబ్ యొక్క చర్య మీకు తక్షణమే ఉపశమనమును గలిగించును. వేపోరబ్ యొక్క గుణకరమైన ఔషధము చర్మము మీద పనిచేసి బిగలాగిన ఛాతీ మరియు వీపును సడలించును. కండరముల నొప్పిని తొలగించును.



**లోపలి చర్య:** మీ శరీరపు వేడే వేపోరబ్‌ను త్వరగా ఔషధపు ఆవిరి తెరలుగా మార్చును. ఈ ఆవిరి తెరలను ప్రతి శ్వాసతో రాత్రి పొడవునా మీరు లోపలికి పీలుస్తారు. యీ లోపలి చర్య ముక్కులోనూ ఛాతీలోనూ వున్న కఫమును తొలగించును...గొంతునొప్పిని ఉపశమింప జేయును.

తీవ్రమైన జలుబులకు. ఆవిరినుండి లేచి వచ్చే విక్స్ వేపోరబ్ ఔషధపు ఆవిరి తెరలను పీల్చండి

# విక్స్ వేపోరబ్




3 సైజులలో

# హృదయ కుసుమాలు

కునే ఉంటుంది. ఎన్నోసార్లు వాడి తడిగుడ్డలు తీసి ఆరేసింది. నాలుగయిదు సార్లు నీళ్ళుపోసి, పౌడరు రాచి, బొట్టు పెట్టి, పాలుపట్టి వాణ్ని ఉయ్యాల్లో పడుకో పెట్టి వూగించి నిద్రపుచ్చేది. వాణ్ని చూస్తూ ఎన్నోసార్లు కంట తడి పెట్టింది. అక్కయ్య, బావ ఉన్న ఫోటో ఒకటి తమ ఇంటికి తీసుకు వెళ్ళింది. ఇంత సహాయకారిగా ఉన్న అన్నయ్య రమాదేవితో మాట్లాడరు. రమాదేవికూడా అన్నయ్యతో మాట్లాడదు. నాతో ఎంతో అప్యాయంగా మాట్లాడుతుంది. ఆదరణగా మాట్లాడుతుంది. ఎన్నో కబుర్లు చెపుతుంది. అన్నయ్య ఉన్నా నాతోనే మాట్లాడుతూ కూర్చుంటుంది. ఏమిటో రమాదేవి చర్యలు తల్చుకుంటే నాకు నవ్వూ, సానుభూతి కలుగుతున్నయ్యి.

ఒక్కొక్కరి జీవితాలు తమాషాగా ఉంటయ్యి. ఇతర్లను సుఖ పెడదామని అనుకుని ఆ ఆచరణలోనే తామూ సుఖ పడదామని అనుకుని, సుఖపడక పోయినా, సుఖపడుతున్నట్లుగానే భావించి సంతోష పడతారు. రమాదేవి ఈ తరహాకు చెందినది.

అన్నయ్య అంతర్యం అర్థం కానిది. మనస్సులో అనేక ఆలోచనలు. అమితమైన ఆదుర్దా. మనస్సు విప్పి ఎవ్వరికీ చెప్పడు. ఎప్పుడూ బాబుని చూసుకునే విచార పడతాడు.

గేదె చస్తేనే గాని పాడి బయట పడదన్నట్లుగా వదినె పోయింతరువాతనే ఆవిడ మంచితనం అన్నయ్యకి ఇప్పుడు అర్థమైంది. ఏమిటో ! చాలా రాశాను. ఇంక ముగిస్తా. నాకూ నువ్వు ఇంత పెద్ద ఉత్తరం రాయాలి సుమా ! రాస్తావుగా !

సుభద్ర.

ఉత్తరం చదువుతుంటే నా మనస్సులో అనేక ఆలోచనలతో పాటు కన్నీళ్ళు ఉత్తరాన్ని తడిపేసినయ్యి. తల్లిలేని పసిగుడ్డు అవస్థ ఇట్లా ఉంటుంది. బావ అంతర్యం ఏమిటో ? పెళ్ళి చేసుకోవాలని లేదా ? అప్పుడు నాకేమీ తోచలేదు.

*　　　*　　　*

జ్యోతి గుంటూరు నుంచి వచ్చింది. దసరా శలవు లయ్యాయి. కాలేజీ తెరిచారు. యథాప్రకారంగా జ్యోతి నేనూ రిక్షాలో వెళదామనే ఉద్దేశ్యంతో ఇంట్లో కూర్చున్నాను. సరిగ్గా తొమ్మిదిన్నరకు జ్యోతి వాళ్ళ జవానుచేత కబురు చేసింది. తను ఒంటరిగానే రిక్షాలో వెళతాననీ, నన్ను వేరే రిక్షాలో వెళ్ళమనీ. ఈ మాట వినేసరికి నాకు ఆశ్చర్యం కలిగింది. ఆ మాట తనే చెప్పొచ్చుగా. జ్యోతి ఈ విధంగా ఎందుకు మారిపోయిందో నా కర్థంకాలేదు. నేను గుమాస్తా కూతురునయినా, తనతో ఏమయినా తగాదా పెట్టుకున్నానా. ఏమీ లేదే ? ఎందుకీ మార్పు. సాటి విద్యార్థినితో రిక్షాలో పోవటానికే తనకు అంత కష్టంగా ఉంటే నేను మాత్రం బతిమాలి జ్యోతి మనస్సు మార్చగలనా ?

నేను ఇంకో రిక్షా చేసుకుని కాలేజీకి వెళ్ళాను. దార్లో ఇద్దరి రిక్షాలూ పక్క పక్కనే పోతున్నా జ్యోతి మాట్లాడలేదు. తప్పు తనమీదే ఉందిగా ! ఎట్లా మాట్లాడుతుంది.

**మధ్యాహ్నం కాలేజీ వదిలారు. టౌన్ హాల్**

కొంత మంది భోజనం చేస్తున్నారు. కొంత మంది టిఫిన్ చేస్తున్నారు.

అనుకోకుండానే నేనూ జ్యోతి పక్కనే కూర్చొని టిఫిన్ తింటున్నాం. వాకే మనస్సుండ బట్టక జ్యోతిని పలకరించాను.

''జ్యోతి''

అదోలా నావైపు చూసింది.

''నా మీద అంత కోపం దేనికి. రిక్షాలో నాతో రావటానికి నీకు నామోషీగా ఉంటే నన్ను పిల్చి చెప్పొచ్చుగా. మీ జవాను ద్వారా కబురు చెయ్యటం ఎందుకు. నేనే మయినా తప్పుమాట అన్నానా''

''అంటే మాత్రం ఈ రోజుల్లో పడేవా ళ్ళెవరూ లేదు. అయినా మాటలతో పనేముంది. నాకు ఇష్టం లేదు. అంతే'' అన్నది. ఇంక నేను జ్యోతిని పలకరించ లేదు.

వారం రోజులు గడిచినయ్యి. జ్యోతి పూర్తిగా నాతో మాట్లాట్టం మానేసింది. అకారణమైన ఈ మార్పుకు నేను మొదట్లో బాధ పడ్డా తరువాత అలవాటయిపోయింది.

మా కాలేజీలోనే ప్రమీల అనే అమ్మాయి ఉన్నది. అమ్మాయి బి. కాం. చదువుతోంది. అందరి తోనూ కలుపుకోలు తనంగా ఉంటుంది. చక్కగా నవ్వుతూ విప్పారిన ముఖంతో అందర్నీ కవ్వించి నవ్విస్తూ మాట్లాడుతుంది. ప్రమీల నాన్నగారు సర్కిలినస్పెక్టరు. ఆ తండ్రి పోలికే ఈ కూతురుకీ వచ్చిందేమో ? కాలేజీలో ఉన్న ఆడపిల్లల నందరినీ ఒక కంట కనిపెడుతూనే సి. ఐ. డి. పని చేస్తుంది. అందరి మనస్తత్వాలూ ప్రమీలకు బాగా తెల్సు.

ఒక ఆదివారం నాడు ప్రమీల నన్ను వాళ్ళింటికి రమ్మన్నది. పిల్చింది కదాని వెళ్ళాను. సాయంత్రం నాలుగయింది. అక్కయ్య పోయాక ఇతర్ల ఇంటికి వెళ్ళటం అదే మొదలు. ప్రమీల గదిలో ఇద్దరం కూర్చున్నాము.

''జ్యోతి పూర్తిగా మాట్లాట్టం మానేసిందా.'' అన్నది ప్రమీల.

''అవును''

''కారణం''

''నాకు తెలీదు ప్రమీలా''

''జ్యోతి వాళ్ళది కొంచెం గడుసు సాంప్రదాయం'' అన్నది ప్రమీల.

''వాళ్ళ సాంప్రదాయం ఎట్లాంటి దయితే మనకేం ప్రమీలా. వాళ్ళ గొప్ప వాళ్ళకే ఉంటుంది'' అన్నాను.

ప్రమీల నవ్వుతూ కూర్చుంది.

''నవ్వుతావేం''

''గొప్పల విషయం చెపుతుంటేను''

''డబ్బు గర్వమేమో అనుకున్నాను''

''కొంత వరకూ. కాని అసలు కారణం అది కాదు.''

''మరి''

''నువ్వే''

''నేనా'' అదిరి పడ్డాను.

''జ్యోతిని నేనేమీ అనలేదే'' అన్నాను మళ్ళీ.

''జ్యోతి గుంటూరు వెళ్ళొచ్చింది తెల్సుగా''

''అవును''

''వాళ్ళ అక్కయ్య ఆ వూళ్ళో ఉన్నది''

''ఉంటే''

''ఆవిడ నిన్ను ఎరుగున్నదిట''

''ఎవరావిడ''

''ఏమో''

''ఇంత తెల్సుకున్నదానివి ఆవిడ పేరు తెలీదా''

''తెలీదు''

''జ్యోతిని అడగలేదా''

''అసలు జ్యోతి నాకీ విషయం చెపితేగా''

''మరి నీకెట్లా తెల్సు''

''మన విజయకుమారి లేదూ''

''అదే పోలీసు సూపరెన్టెంటుగారమ్మాయి''

''అవును. విజయకుమారితో జ్యోతి చెపుతుంటే అంతవరకే విన్నాను''

''ఏమిటో నాకేం అర్థం కావటం లేదు. గుంటూర్లో నాకు తెల్సిన వాళ్ళు ఇద్దరుకన్న ఎక్కువ లేరు. జ్యోతి బావగారేం చేస్తుంటారో''

''ఏమీ లేదు. చాలా ఆస్తిపరులుట. పెద్ద మేడా తోటా ఉన్నయ్యిట బ్రాడీపేటలో''

''ఎవరబ్బా''

''ఏమో''

''ఇంకా ఏం చెప్పింది జ్యోతి''

''ఏమీ లేదు. అంతక్రితం వాళ్ళే మాట్లాడుకున్నారో తెలీదు. ఉండు చెప్తాను. ఆ, జ్యోతి అక్కయ్యపేరు కృష్ణవేణి''

''చంపావ్ పో. కృష్ణవేణి జ్యోతి అక్కయ్యా. ఇంకేం తెలుస్తూనే ఉంది. మంచి కుటుంబమే. సరే ఇంక చెప్పక్కర్లేదు. అంతా తెల్సింది'' అన్నాను.

''ఏమిటది పోనీ నాకు చెప్పుదూ''

''ఆ రోజు వస్తే అప్పుడే చెప్తాను.''

మరో గంటసేపు కూర్చుని వచ్చేశాను.

(సశేషం)

## తెర వెనుక దీపం

20 వ పేజీ తరువాయి

మీ సత్తెమ్మకు మస్తీ చేసిందని దొంగ కబురు పెట్టి విన్ను పంపేసి ఆ రాత్రి ఈఅఘాయిత్యం చేసారే— పోనీ పిడకల గూడూ, కందికంపా వేస్తే వేస్తారు కల్ప వృక్షం లాంటి జాంచెట్టును మొదలంటా తెగ్గోసి మంటలో పడేశారమ్మా— కోతి వెధవలు. పెద్దవారెవరికి తెల్సినా ఇంత పని జరిగేది కాదమ్మా, పాపం గోపాలకృష్ణయ్యగారూ, పార్వతమ్మగారూ ప్రసాదరావూ ఎంతో ఇదై పోతున్నారు. ఎవర్నీ పల్లెత్తి మాటైనా అనని ప్రసాదరావు భీమున్ని పట్టుకొని చావగొట్టాడు కూడాను. ఏం లాభం? పోయిన వస్తువు వస్తది గనకనా. మరీ ఇంత ఇదై పోకు మరి''

తిరపతమ్మ దృష్టిని జామిచెట్టు మోడు నుండి మరల్చలేదు. ఆమె మళ్ళీ వెర్రిలో పడి పోతున్నది.

''సత్తెమ్మా పిల్లలూ బాగున్నారా'' తిరపతమ్మను మాటల్లోకి దించి, ప్రస్తుతాన్ని మరపించాలని కామాక్షమ్మ ప్రయత్నం.

తిరపతమ్మ మా ట్లాడలేదు. దృష్టి జామి చెట్టు మోడు నుండి మరల్చలేదు.

''ఏమే మాట్లాడవ్'' కుదిపింది కామాక్షమ్మ.

కామాక్షమ్మ కళ్ళల్లోకి వచ్చిదానిలా చూచింది.

''సత్తెమ్మా, పిల్లలూ బాగున్నారా అంట''

''బాగున్నారు పిన్నీ'' అతి నీరసంగా సమాధానమిచ్చింది.

''అదే పదివేలు— లే— ఈ వేళకు మా ఇంటి కాడ కాస్త ఎంగిలి పడుదువు గాని—రా'' కామాక్షమ్మ అతి ప్రయత్నం మీద తిరపతమ్మను వాళ్ళింటికి తీసుకెళ్ళింది.

* * *

పండుగ వెళ్ళి నెల అయింది. తిరపతమ్మలో ముప్ఫైఏండ్ల తరవాత వచ్చే విస్సత్తువా, నీరసమూ కనుపించాయి. మునుపటి శక్తీ, చైతన్యమూ లేవు. ఒక పూట తినీ— ఒక పూట తినకా— నానాటికి నీరసించి పోతున్నది. ఇల్లు విడిచి ఎక్కడకూ పోవడం లేదు. మునుపైతే వూరంతా దుమారంలా తిరిగి ఏదో సాకుతో అందరినీ తిట్లతో జల్లించి వచ్చేది.

ఇప్పుడొక్కకుర్రాడు అటు, రావటం లేదు. ఇదివరకు గడియకొకడు వచ్చి ''తిరి'' అని పల్కరిస్తే సరికొత్తదీవెనలతో వెంటనే సత్కరించేది. తిరపతమ్మను చూచి పిల్లలూ, పిల్లల్ని చూచి తిరపతమ్మా రెచ్చిపోయే వారు. ప్రతిరోజులోనూ ఇది తప్పని కార్యక్రమం. కామాక్షమ్మ వినా ఎవ్వరూ ఇప్పుడామె ఇంటికి రావటమే లేదు.

తిరపతమ్మ 'ఇది' అని చెప్పకోలేని వెలితితో వేదనతో బాధ పడుతోంది. తను అందరికీ దూరమైపోయినట్లు మెరుపులా తోచిందామెకు. అందరూ తన వంక సానుభూతిగా చూచి తొలగిపోతున్నారు. ఏమి చెయ్యడానికీ తోచటం లేదు. అసలు చెయ్యడానికేమీ పని లేదు. పిల్లలు తన పెరట్లో తిరిగినంత కాలం చేతినిండా పని. ఎక్కడివస్తు వక్కడే ఎప్పుడూ ఉండేదే కాదు. ప్రొద్దున్నే అద్దంలా తీర్చి దిద్దిన పెరడును, ఒక్క క్షణంలో పెంటపోగులా తయారు చేసి వెళ్ళేవారు. వారిని నోరారా తిట్టుకుంటూ మళ్ళీ ఎక్కడి దక్కడ సర్దుకునేది. ఇప్పుడు పెరడంతా పట్టి పల్లకాడులా కనుపిస్తోంది. ఏ వస్తువుకూ కదలిక లేదు. అశాంతి మయమైన తిరపతమ్మ పూర్వ జీవితంలో పోల్చి చూస్తే— ఇది శాంతి, కాని ఆమె కిట్టి శాంతి అక్కరలేదు.

ఇది వరకే ఒకసారి పార్వతమ్మా, శారదా వచ్చారు. పార్వతమ్మా చాలా ఇదైపోతూ తమకే అఘాయిత్యంలో భాగం లేదనీ. తమ కెవరికీ తెలియకుండా దుడుకు భీముడింత చేసాడనీ చెప్పుకొంది. అంత ఇదిగా పార్వతమ్మ చెబుతుంటే తిరపతమ్మ నిర్లిప్తంగా విన్నది. తిరపతమ్మ వేదన మరొక చోట. అది ఎక్కడో— ఎందుకో ఆమెకే తెలియదు. ఒరులకెలా చెప్పగలదు. తిరపతమ్మను పరీక్షగా చూచిన పార్వతమ్మకూ, శారదకూ ఆశ్చర్యం కలిగింది. వారాశించిన తిరపతమ్మ— ప్రవర్తన వేరు. మునుపటి తిరుపతమ్మ ఇప్పటి తిరుపతమ్మకూ ఎక్కడా పోలికే లేదు.

''ఏమీ బాధ పెట్టుకోకమ్మా తిరపతమ్మా'' ముగింపుగా అంది పార్వతమ్మ.

''దానికి నాకేం బాధ లేదు పిన్నీ. . .'' ఇంకా ఏమో చెప్పాలని చెప్పలేక పోయింది.

పార్వతమ్మా— శారదా వెళ్ళారు.

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.



# తెరవెనుక దీపం

ఒక నాటి సాయంత్రం తిరపతమ్మ పెరటి గుమ్మంలో కూర్చుంది. కన్నా మరో నలుగురు పిల్లలూ అటు కేరింతా లాడుతూ వచ్చారు. వారిని చూచిన తిరపతమ్మలో విచిత్రమైన కదలిక కలిగింది. ముఖంలో గూడు కట్టుకొన్న బెంగ, నైరాశ్యం తొలగి వాటి స్థానే సంతోషంతో ముఖం వెలిగింది. పిల్లలు తిరపతమ్మను చూసారు. గిరుక్కున వెను దిరిగారు. తూనీ గల్లా పారిపోయారు. తిరపతమ్మ అప్రయత్నంగా 'కన్నా' అని పిలిచింది. దిక్కుల కందిన దీనమైన ఆ పిలుపు పిల్లల కందలేదు.

తిరపతమ్మ నిలువునా కృంగి పోయింది. ముఖం మరింతగా ముకుళించుకు పోయింది. మనసు తీవ్రంగా గాయపడింది.

ఆ రాత్రి తిరపతమ్మకు ఉధృతంగా జ్వరం వచ్చింది. మరునాడు సాయంత్రం కామాక్షమ్మ వచ్చి. చూచేటప్పటికి చీకటి గదిలో కుక్కి మంచం మీద ముడుచుకొని మూటలా పడి మూలుగుతున్నది. వళ్ళు కాలిపోతున్నది. పలకరిస్తే "ఊఁ" అన గలిగింది. రెప్పలు బలవంతాన ఎత్తి కామాక్షమ్మను చూచి మళ్ళీ మూసుకొన్నది. కళ్ళు చెమ్మగిల్లడం కామాక్షమ్మ గమనించ లేదు.

"జ్వరం ఎప్పుడొచ్చిందే తిరపతమ్మా"

"నిన్న రాత్రి పిన్నీ"

"రాత్రి అన్నం తిన్నావా"

"లేదు పిన్నీ"

"అయ్యో వెర్రిదానా– నాకు కబురంపక పోయావటే. మందూ మాకూ లేకుండా పడున్నావా ఉండు. శాస్త్రుర్లుగారికి కబురంపుతాను. కాఫీ గాని పుచ్చుకుంటావా"

"వద్దు పిన్నీ"

ఇదేమిటే. గొల్లపాలెం నుండి వచ్చి నప్పటి నుండీ ఇలాగై పోయావు. ఆ దిక్కుమాలిన జామ చెట్టును గురించి గాని బెంగెట్టుకున్నావటే. పిచ్చిదానా లేచి కూర్చో. ఏదీ ఇలా చూడు" కామాక్షమ్మ తిరపతమ్మను లేవదీసి కూర్చో పెట్టింది.

తిరపతమ్మ నేరుగా కామాక్షమ్మ కళ్ళల్లోకి చూడలేక పోయింది తలదించి కూర్చున్నది. ఆమెలో ఏదో మార్పు—ఏదో బాధ మొదలౌతున్నట్లు కామాక్షమ్మ గ్రహించగలిగింది. కాని యిదమిద్ధమని ఆమెకే తెలియదు.

ఏమే— నీ బాధేమిటే— నాతో చెప్పమ్మా"

"పిన్నీ..." తిరపతమ్మ కంఠం వణికింది.

"ఏమిటే బెంబేలు పడతావు. ఏమిటో చెప్పు."

"నేనందరికీ దూరమై పోయాను పిన్నీ... నన్నందరూ వెలేసారు" కామాక్షమ్మ తల దిమ్మెత్తినంత ఆశ్చర్యపోయింది. జ్వరం తీవ్రతలో అంటున్న మాటలేమోనని కాసేపటికి సమాధాన పడింది.

"అదేమిటే ! ఎవరికి దూరమై పోయావు ఎవరు వేలేసారు నిన్ను"

"అంతే పిన్నీ" తిరపతమ్మ తిరిగి మంచం మీదకు వాలి కళ్ళు మూసుకొంది.

అసలేమిటో అర్థమవలేదు కామాక్షమ్మకు. అంతకంటె వివరంగా చెప్పలేక పోయింది తిరపతమ్మ. శాస్త్రిగారికి కబురంపడానికి వెళ్ళిపోయింది కామాక్షమ్మ.

వారం, గడిచింది. తిరపతమ్మకు జ్వరం తగ్గలేదు. సరికదా బాగా ఎక్కువై పోయింది. దానితో సంధీ, సలవరింతలూ, కూడా ప్రారంభమైనాయి.

ఎన్నో పలవరించింది. ఏమేమో గొణిగింది. అప్పుడప్పుడూ తనలో తిట్టుకున్నది. 'కన్నా' వచ్చావా. రా నాయనా జాంకాయలు పెట్టనా" అన్నదోసారి. కామాక్షమ్మ కంగారు పడింది. కొంతసేపటికి 'ఓహో' అనుకున్నది.

వారం రోజులై కోడలినీ, మనవణ్ణీ వెంట బెట్టుకుని తమ్ముడింటికి ఏదో శుభకార్యానికని వెళ్ళిన పార్వతమ్మ వచ్చిందని తెలిసి కామాక్షమ్మ వెళ్ళి తిరపతమ్మ పరిస్థితి చెప్పింది. పార్వతమ్మ గోపాలకృష్ణయ్య గారితో చెప్పింది. గోపాలకృష్ణయ్య గారు ఒక్క క్షణం ఆలోచించి, తలపంకించి "పదవెళ్ళి వద్దాం. కన్నని కూడా తీసుకురా" అన్నారు.

పార్వతమ్మ ఆశ్చర్య పడింది. గోపాలకృష్ణయ్య గారూ, పార్వతమ్మా కన్నను తీసుకొని తిరపతమ్మ ఇంటికి వెళ్ళారు. అప్పటికే అక్కడ కామాక్షమ్మ— మరో ఇద్దరు ముత్తైదువలూ ఉన్నారు. తిరపతమ్మ మగతలో ఉంది.

"అమ్మా, తిరపతమ్మా" అని పలకరించారు గోపాలకృష్ణయ్యగారు.

నెమ్మదిగా కళ్ళు తెరచింది. ప్రక్కనున్న కన్నను ఎదురుగా తీసి తిరపతమ్మ ముందు నిలబెట్టారు. కన్నవంక తదేకంగా చూచింది. ముఖం వికసించింది. అంతలోనే మగత క్రమ్ముకొని వచ్చింది. కళ్ళు మూసింది. పార్వతమ్మా, కామాక్షమ్మా పలకరించారు. మాట్లాడలేదు. అంతలో శాస్త్రిగారు వచ్చి తిరపతమ్మ చెయ్యి తీసుకొని వంగి నాడి పరీక్షిస్తున్నారు.

గోపాలకృష్ణయ్య గారు పార్వతమ్మ వైపు తిరిగి "చూడు ఇది కేవలం జ్వరం కాదు. ఇన్నాళ్ళూ మనం తిరపతమ్మను సరిగా అర్థం చేసుకోలేదు. కొంటె పిల్లలు చేసే అలవి మాలిన అల్లరికి తట్టుకోలేక విసిగిపోయి ఆమె తిట్టే తిట్లనిమాత్రమే విని అసహ్యించుకొన్నాం. కాని కృంగి పోయి మూలుగుతున్న ఆమె మనస్సును చూడలేక పోయాం. అమృతం లాంటి ఆమె మనస్సు— వయస్సులో భర్తా, ఆ వెనుకనే ఒక్కగా నొక్క కొడుకూ పోవడంతో— బండబారి పోయింది. ఇదే ఆమె మొండితనానికీ, నోటి దురుసుతనానికీ కారణం. ఇప్పుడు జామచెట్టు లేదు. పిల్లల అల్లరిలేదు. ఆమె నోటి దూకుడు లేదు. ఇవన్నీ నల్లని తెరలు. ఆ తెరల వెనుకనున్న దీపాన్ని మనమింత వరకూ చూడలేకపోయాం అందరి తల్లుల వలెనే ఆమెలోనూ పిల్లలంటే సహజమైన ప్రేమా, వాత్సల్యమూ, మమతా దాగి ఉన్నాయి. జామిచెట్టు నెపంతో పిల్లలందరూ ఆమె చుట్టూ చేరి విసిగించినప్పుడా వెలితి కనుపించలేదు. కాని ఇప్పుడు పిల్లలెవరూ తన ఇంటికి రాకపోవటంతో, మునుపటి నెయ్యి జ్ఞాపకాలతో మంచ మెక్కింది. పదిమంది పిల్లల అల్లరితో

చెప్పుడూ కలకల్లాడే ఆమె ఇల్లు ఇప్పుడు ఒక్కడూ రాకపోవటంతో బావురుమన్నది. నిజంగా ఇల్లు కాదు. ఆమె మనస్సు. పరిస్థితులామెకు మొదటి నుండీ ఎదురు తిరిగి పండంటి కాపురాన్ని నాశనం చేసాయి గాని స్త్రీ సహజమైన ప్రేమను— తాత్కాలికంగా కప్పి పుచ్చినా— తొలగించలేక పోయినాయి.

తిరపతమ్మ పిల్లల్ని [illegible] తిట్టలేదు. అన్నీ తిట్ల రూపంలో దీవనలు''

గోపాలకృష్ణయ్య గారు పూర్తి చేయలేదు. తిరపతమ్మ నాడి పరీక్షిస్తున్న శాస్త్రిగారు తిరపతమ్మ చెయ్యిని మెల్లగా మంచం మీద పెట్టి

"బాబూ, గోపాలకృష్ణయ్యగారూ. . . . ." అన్నారు. శాస్త్రిగారి [illegible] వ్యక్తమైంది. గోపాలకృష్ణయ్య గారు గుర్తించారు.

"ఏమండీ! శాస్త్రిగారూ"

శాస్త్రిగారు తూష్ణంగా చూశారు.

గోపాలకృష్ణయ్యగారి కనుకొలకుల నుండి రెండు కన్నీటి బిందువులు నేల రాలాయి. ★

**ప్రేమకు ముసలితనం లేదు. అది యౌవ్వనంలో ఎంత ఉధృతంగా వుంటుందో వయసు పెరిగిన కొద్దీ అంత గాఢంగా గంభీరంగా పరిణామిస్తుంది.**

అందుకు నిదర్శనం రామనాథమేనూ !

''అడుగోనోయ్ ! మన వృద్ధ రోమియో !'' అన్నాడు ధనరాజ్ తన స్నేహితులతో, మెయిలు రాగానే తమలాగే పెట్టెలలోని ప్రయాణీకుల్ని పరిశీలిస్తూ నడుస్తున్న రామనాథాన్ని చూసి. అతని మిత్రులు కూడా అటు చూశారు.

''నిజమేనోయ్, ఇంకా అమ్మాయిల్ని ఆకర్షిద్దామనే ఆశ, పాపం ! మొన్న ఒక అమ్మాయి ఈయన్ని చూసి 'తాతగారూ ! మంచినీళ్ళెక్కడ దొరుకుతాయి ?' అని అడిగింది. అయినా సిగ్గులేదు.'' అని సూర్యం అన్నాడు. ఆ యువకులు మెయిలు పెట్టెలలోని ప్రయాణీకుల్ని విమర్శగా చూస్తూ అటూ ఇటూ నడుస్తూ జోకులు విసురుతున్నారు.

అతని వయస్సు ఏభై ఆరు. తెల్లని పంచెమీద తెల్ల చొక్కా, నల్లని కోటూ వేసుకుని, పచ్చని శరీరచ్ఛాయతో బక్కపల్చగా ఉండే వ్యక్తి. బంగారు ఫ్రేము కళ్లజోడుతో అతని మొహం ప్రశాంతంగా ఉంటుంది.

రోజూ సాయంకాలం ఆరింటికి రామవరం రైలు స్టేషనుకు విధిగా హాజరవుతాడు. మెయిలు వచ్చాక పెట్టెలన్నీ వెదుకుతాడు. రైల్లో వస్తానని రాసిన అప్తు లెవరో రైలులో రాకపోతే ఎంత బాధ పడతాడో అంత బాధపడి చివరకు రైలు వెళ్లిపోయాక నిస్పృహతో ప్లాటుఫారంమీద ఒక సిమెంటు బెంచీ మీద కూలబడి ఆలోచిస్తూండేవాడు.

సుమారు రెండు నెలల నుంచి ఇది అతని దిన చర్యలో ముఖ్యమైన భాగమైపోయింది. అందుకు కారణం ఒక ఉత్తరం !

అది శారద దగ్గర్నుంచి వచ్చింది. తను రామవరం వస్తున్నాననీ, మెయిలు వద్దకు వచ్చి తనను కలుసుకోమనీ రాసింది. ఆ ఉత్తరం వచ్చిన దగ్గర్నుంచీ అతనిలో ఆమెను కలుసుకోవాలనీ ఆతృత పెరిగిపోయింది. ఆనాటినుండి రోజూ మెయిలుకు రావటం మొదలెట్టాడు. ఆ లేఖ అతని హృదయాన్ని పులకింపజేసింది. ముప్పై ఏళ్ల వయసుని మాయంచేసి అతన్ని గతం లోకి, అంటే ఇరవై ఆరేళ్ల ప్రాయంలోకి తీసుకుపోయింది. శారద హృదయం అతనిముందు విప్పిచెప్పుకుంటున్నట్లూ, తను ఆమెను పరిగ్రహిస్తున్నట్లూ వూహింపజేసింది. అతని మనసులో, ప్రతి క్షణం అతనిలో ఆమె తలంపే రేపింది.

ఈ వయసులో మళ్లీ అతనిలో ఒక కొత్త ఆవేశం కలిగింది. ఈసారి ఏమైనా సరే శారదను విడిచి ఉండ కూడదనే నిర్ణయానికి వచ్చాడు. మునుపు తమ ఇద్దరికీ అనుభవంలేని ఉద్రేకం, ఏది మంచో ఏది చెడో తెలియని మనసులు తమవి. పెద్దవాళ్ల మాట వింటే ఏదో ఒరిగిపడుతుందన్న భ్రాంతిలో పడ్డ రోజులు. ఇన్నేళ్ల అనుభవంతో అందులోని సత్యం తనకు తెలిసింది. పెద్దవాళ్లు గతించారు. తనలోని అశాంతి మిగిలిపోయింది.

తను శారద గురించి ఆలోచిస్తున్నట్లే, శారద కూడా తన గురించి ఆలోచిస్తుందా లేదా ? అన్న ప్రశ్న చాలాకాలం అతనిని బాధిస్తూండేది. ఆ ప్రశ్నకు సమాధానంలా ఆ ఉత్తరం వచ్చింది. తనని కలియడం కోసం ఆమె ఎంతో తహతహలాడుతూండడంబట్టే ఆవిధంగా రాసింది. ఈసారి, ఎవరేమనుకున్నా సరే తనూ, శారదా కలిసి, శేష జీవితం గడపాలి. అసలు ప్రస్తుతం తను ఒంటరి ఉంటున్నాడు; అందుకని శారదను ఆహ్వానించడానికి ఎంతమాత్రం అభ్యంతరంలేదు.

అసలు తను ఒకరి గురించి ఎందుకు భయపడాలి. ఇన్నాళ్లూ తను ఆమెను కలుసుకోకపోవడం ఇతరు లేమనుకుంటారో ? అనే కదూ? అది ఎంత వ్యర్థపు ఆలోచనో ఇన్నాళ్లకు తెలిసి వచ్చింది. ఆనాడే, తను తన తల్లిని ఎదురించి శారదను వివాహం చేసుకుని ఉంటే, తన జీవితగతే మరోకవిధంగా మారిపోయి ఉండేది. తన జీవితానికి దూరంగా ఉన్నా, శారద తలంపే తన కానందం ఇచ్చేది, ఆమె సాన్నిహిత్యం ఎంత మాధుర్యంగా ఉంటుందో !

కొన్నాళ్ల క్రిందటి వరకూ అప్పుడప్పుడు, తను శారదను పూర్తిగా మర్చిపోయా ననుకున్నాడు. కాని, ఇప్పుడు తెలుస్తోంది.... ఆమె తన కెన్నటికీ మరుపురాదని. అసలు తన మనసులో భవిష్యత్తులో ఎప్పుడో ఆమెను కలుసుకోగలుగుతాననే ఆశతోనే జీవితం ఇన్నాళ్లూ గడిపాడు.

శారద ఆవూరి కరణంగారి అమ్మాయి. పద్దెనిమిదేళ్ల మిసమిసలాడే యౌవనంలో ఆమె నవ్వితే మల్లెపూలు కుప్ప పోసినట్లుండేది. పొగరైన ఆమె కళ్లలోంచి చూపులు ఆదారంట వెళ్లేవాళ్ల కాళ్లకు మెత్తని బంధాలు తగిలించినట్లుండేవి.

రామనాథం స్కూళ్ల ఇన్‌స్పెక్టరుగా ఉద్యోగం చేస్తూ ఆ వూరు బదిలీ అయి వచ్చాడు. అప్పటి కతను పాతికేళ్ల బ్రహ్మచారి. అతని తల్లితో సహా కరణంగారి ఇంటి కెదురింట్లో దిగాడు. రామవరంలో రెండేళ్లున్నాడు. తరువాత అతనికా వూరు నుంచి బదిలీ అయిపోయింది. అతను ఆ రెండేళ్ల లోనూ శారదను గాఢంగా ప్రేమించాడు. ఏమైనా సరే ఆమెను వివాహం చేసుకుందా మనుకున్నాడు. కాని, అతని తల్లి ఒప్పుకోలేదు.

ఆమెను రహస్యంగా చాలాసార్లు కలుసుకుని తను ఆమెను ప్రేమిస్తున్నానని చెప్పాడు. తనని వివాహం చేసుకుంటాడేమో ననుకుంది శారద. కాని, ఆ విషయంలో అతని తల్లి ఒప్పుకోవటంలేదని తెలుసుకున్నాక కరణంగారు శారదకోసం వేరే సంబంధాలు వెతకనారంభించారు. చాలా సార్లు తల్లిని ఎదురిద్దామనుకున్నాడు కాని రామనాథం, ఆమె కంట నీరు పెట్టుకుని తన తమ్ముడి కూతుర్ని చేసుకోవాలని పట్టుబట్టడం వలన అతను శారదను వివాహం చేసుకోలేక పోయాడు.

అతను ఆ వూళ్లో ఉంటూండగానే శారదకు వివాహమైపోయింది. ఆమె అత్తవారింటికి వెళ్లిపోయింది. తను ఆ వూరునుండి మరో వూరు వెళ్లిపోయాడు. ఆమెను మాత్రం మర్చిపోలేకపోయాడు.

ఆమెను మళ్లీ మళ్లీ కలుసుకోవాలని తను చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. కాని ఆమె గురించి వివరాలు మాత్రం ఎప్పటికప్పుడు తను తెలుసుకుంటూనే ఉన్నాడు. ఆమెకు వివాహమైన పదేళ్ల తరువాత ఆమె భర్త చనిపోయాడు. ఆమె జీవనాధారం కోసం ఉద్యోగంలో చేరింది. రామవరంలో ఇల్లుంది కాబట్టే తరుచూ రామవరం వస్తూండేది.

తనకు శారద విషయాలు చెప్తున్నవాళ్ళే, శారదకు కూడా తన విషయాలు తెలియజేస్తున్నారని రామనాథానికి తెలిసింది. శారద పినతండ్రి సత్యనారాయణ, అతని ఆఫీసులో గుమాస్తాగా పని చేసేవాడు. అతని ద్వారా తనకి శారద గురించి వివరాలు తెలిసేవి. అతనే రామనాథం గురించి శారదకు కూడా తెలియజేస్తుండేవాడు.

ఉద్యోగ జీవితమంతా రామనాథానికి హాయిగా వెళ్లిపోయింది. ప్రమోషన్లు సకాలంలో లభించడంవలన త్వరగానే డి. ఇ. ఓ. అవడం జరిగింది. భార్యా బిడ్డల విషయంలో కూడా ఏ లోటూ లేదతనికి. అనుకూలవతి అయిన భార్యా, బుద్ధిమంతులైన ముగ్గురు మగపిల్లలూ అతనికి ఏనాడూ కొంచెం కూడా చికాకు కల్పించకుండా మసలుకునేవారు. కాని, జీవితంలో అతనికి చాలా వెలితి కనిపించింది.

ఆ వెలితి అప్పుడప్పుడూ శారద రూపంలో జ్ఞాపక మొచ్చేది.

జీవితంలో ప్రేమించనే కూడదు గాని, ప్రేమించిన తరువాత అది ఫలించకపోతే జీవితం అంతా నరకప్రాయంగా గడుస్తుందని రామనాథం అనుకునేవాడు. తన భార్యను ప్రేమించలేకపోయాడు. ఉద్యోగం, హోదా, సంపదా అన్నీ అనుభవిస్తున్న అతన్ని చూసినవారందరూ అతని జీవితం వడ్డించిన విస్తరి అనుకుంటుండేవారు. కాని, అతనికి ఆ జీవితం నిస్సారంగా కన్పించేది. ఎప్పుడైనా, ఇవన్నీ వదిలేసి తను ప్రేమించిన వ్యక్తి దగ్గరకు పారిపోదామనిపించేది.

అనేకసార్లు ఈ ఆలోచన వచ్చినప్పటికీ, దాని నాచరణలో పెట్టలేక పోయాడు రామనాథం. ఏవో బాధ్యతలు నెత్తి మీద పడి అతన్ని ఆ పని చెయ్యనీయకుండా చేసేవి. ఒక్కొక్కప్పుడు తను ఇతరులను సంతృప్తి పరచడం కోసం, తన సుఖాన్ని చేతులారా పాడుచేసుకుంటున్నా ననుకునే వాడు.

శారద భర్త చని పోయాడని తెలిసినప్పుడు, ఆమెనవెళ్లి చూడాలని విశ్వ ప్రయత్నం చేశాడు. కానీ అదే సమయంలో తన భార్యకు జబ్బు చేయటం వలన, ఆమెను ఆస్పత్రిలో చేర్పించవలసి రావడం వలనా, ఎక్కడికీ కదల లేక పోయాడు. తను ఎంత బాధ పడిందీ సత్యనారాయణకు చెప్తే, అతను శారదకు ఉత్తరం ద్వారా తెలియ జేశాడు.

ఆ తరువాత శారద ట్రైనింగు పాసయి టీచరు ఉద్యోగంలో చేరిందని తెలిసింది. తను, డి. ఇ. ఓ.గా చేసిన ఇన్నేళ్ల సర్వీసులోనూ ఆమె



...ని చేస్తున్న జిల్లా తప్ప, తక్కిన జిల్లాలన్నీ తిరిగాడు. అందుకని ప్రతీసారీ, ఆ జిల్లాకు ట్రాన్స్‌ఫరు అవుతుందనీ, ఆమెను కలుసుకో వచ్చుననీ ఆశ పడడం తీరా ఆర్డర్లు మరో జిల్లాకు రావటంతో, ఆ ఆశ నిరాశ కావటం జరుగుతూ కాలం గడిచి పోయింది.

తను రిటైరయ్యే దాకా కూడా, సత్యన్నారాయణ ద్వారా శారద విషయాలు తనకు తెలుస్తూనే ఉన్నాయి. అంతే కాక తను రిటైరై రామవరంలో ఇల్లు కట్టుకోవడం, అక్కడే స్థిర పడ దల్చుకున్నట్టూ సత్యన్నారాయణ ఆమెకు తెలియబర్చాడు. అప్పుడే తను రామవరం వచ్చి పది నెలలయింది. కుటుంబం విశాఖపట్నంలో పెద్దవాడి దగ్గర ఉన్నారు. తను వంటరిగా ఉంటున్నాడు.

ఆమె కోసం తను వచ్చినప్పటి నుండీ ఎదురు చూస్తున్నాడు. తన ఆశకు బలంగా, ఒక నాడు ఉత్తరం వచ్చింది. అందులో రెండే ముక్కలు రాసున్నాయి. 'మెయిలుకు వస్తున్నాను. స్టేషను దగ్గర కలుసుకోండి'— శారద.

ఆ ఉత్తరం వచ్చిన దగ్గర్నుంచీ అతను ప్రతి రోజూ విధిగా రైలు ఫ్లాటుఫారము మీదకి, మెయిలు ఇంకొక గంటకు వస్తుందనగా వచ్చి, మెయిలు వెళ్ళిపోయిన మరొక గంట దాకా ఉండి వెళ్ళి పోయే వాడు. ఈ సమయంలో అతను ఎంతో ఉద్రిక్తతను పొందేవాడు. ఆమె కోసం ఎదురు చూడటంలో ఎంత హాయి ఉంటుందో గ్రహించాడు.

అసలు తన ప్రేమ కథను ఎవరితోనైనా చెప్పుకుని తన ఆనందాన్ని పంచుకోవాలనిపిస్తూండేది అతనికి ఒకొక్కప్పుడు. ఆ మెయిలుకు అతని లాగే విధిగా రోజూ కొందరు యువకులు కూడా వచ్చేవారు. వాళ్ళకు అదొక కాలక్షేపం మెయిలు రాగానే, అన్ని పెట్టెలలోని వ్యక్తుల్నీ పరిశీలించడం వాళ్ల

# సజీవ శిల్పం

కొక సరదా. కాస్త అందంగా కన్పించే అమ్మాయిల వైపు ఆశగా చూడటం, తమలో తాము ఏవేవో చెప్పుకుని వెకిలిగా నవ్వటం, ఏవో జోక్సు విసురుకోవటం, ఒకొక్కప్పుడు పరుగు లెత్తటం లాటి కుర్ర తనపు చేష్టలెన్నో చేసేవారు.

మెయిలు వెళ్ళాక వాళ్ళు కూడా ఒక సిమెంటు బెంచీ మీద చేరేవారు. వాళ్ళు ముగ్గురూ పాతికేళ్ల లోపు వాళ్ళు. అందులో ఒకతను తన ప్రేమ గురించి తక్కిన వాళ్లతో చెప్తూండే వాడు. వాళ్ళు కూచునే బెంచీ, రామనాధానికి దగ్గరలోనే ఉండేది. అందుకని వాళ్ల మాటలు అతనికి విన్పిస్తూ ఉండేవి.

యువకుడి పేరు ధనరాజ్. "ఇవాళ మనం ఇచ్చిన పూలు ఎంతో ఆప్యాయంగా పెట్టుకుందోయ్" అన్నాడు.

"మాకు తెలుసయ్యా, ఆ అమ్మాయి అలాటి పని చేస్తుందని. నువ్వు చేసిన పనికి, పూల ఖర్చు రోజూ జుల్మానా వేసిందన్న మాట. నువ్వు జాగ్రత్తగా ఉండాలి." అన్నాడు సూర్యారావు.

"ఇహ వాళ్ల నాన్న నడిగేస్తాను, వాళ్లమ్మాయిన్నాకిచ్చి పెళ్ళి చెయ్యమని."

"అయితే నీకు యావజ్జీవిత ఖైదు తప్పదు"

"ఎక్కడ ?"

"ఆమె చేతుల్లో."

"ఎంత మధురమైన శిక్ష !"

అంత వరకూ మౌనంగా ఉన్న, సుబ్బారావు. "చూడు బ్రదర్ ! ఆ చేసేదేదో తొందరగా చెయ్యి' అన్నాడు.

"ఏం ?"

"మనవాడు కొద్దిగా కవిత్వం వ్రాస్తాడు. ఎవడో ఒక కవి రాశాడు. నువ్వెక్కవలసిన రైలు ఒక జీవితం లేటు — అని. అందుకని అలా కాకుండా...." అని సూర్యారావు అనగానే ముగ్గురూ నవ్వారు.

తను కూడా మానసికంగా వాళ్ల మాటల్లో పాల్గొనే వాడు రామనాథం. వాళ్ళు ఆ చిన్న విషయాలకు అంత ఉద్రేక పడిపోవడంలో ప్రేమ యొక్క ప్రభావం విస్పష్టంగా కన్పించేది రామనాధానికి. వాళ్ళు కాస్సేపు మాట్లాడుకుని వెళ్ళి పోతూంటే తను ఒంటరితనం అనుభవించేవాడు. వాళ్లతో తనూ కలిసి మాట్లాడాలనిపించేది— ప్రేమ గురించి. కాని సిగ్గేసేది.

ఒంటరిగా కూర్చుని పాత దృశ్యాలను గుర్తుకు తెచ్చుకునే వాడు. తన కొకసారి జ్వరం వచ్చి మూడు రోజులు కదలకుండా పడుకున్నాడు. అప్పుడు శారద ఎన్నోసార్లు వచ్చి, తన తల్లిని, తనకెలా ఉందో అడిగింది. చివరికి మూడో రోజు సాయంకాలం తిన్నగా తన గదిలోకే వచ్చేసింది. తను కళ్ళు మూసుకుని పడుకుంటే, నుదురు మీద చెయ్యేసింది. ఆ స్పర్శలోని సుఖం తను ఇప్పటికీ మర్చిపోలేడు. అప్పుడామె కళ్లల్లోని జాలి, తన మనస్సు లోతుల నాక్రమించుకుంది.

స్త్రీని అర్థం చేసుకోవడం ఎంత కష్టమో ఇంత కాలానికి తను తెలుసుకో గలిగాడు. ఆమె హృదయం యొక్క అగాధమైన లోతుల్లో అణగారి పోయే అవ్యక్త భావాల్ని గ్రహించడానికి పురుషుడికి ఒక జీవితమంతా కూడా చాలదనిపించింది.

ఏదో చెప్పాలనే ఆమె చూపులలోని భావం గురించి తనెన్నడూ ఆలోచించలేదు. అది ఆమె ప్రేమను వ్యక్తపరిచే భాష అని తను ఇప్పుడు గుర్తిస్తున్నాడు. తను ఎప్పుడూ ఉద్రేకంతో, ఆమె కావాలనుకునేవాడు. ఆమెను పొందలేక పోయాననే విరక్తితో ఆమెను మర్చిపోదామని ప్రయత్నించాడు కాని ఆమె అత్తవారింటికి వెళ్ళిపోతూ తన తల్లి వద్దకు వచ్చి మెల్లిగా సెలవు తీసుకుంటూ తన వైపు ఒకసారి చూసిన చూపు గుండెల్లో ఇప్పటికీ ఆక్రోశిస్తూనే వుంది.

మళ్లీ ఇప్పుడు ఆమెను కలుసుకో బోవడం భగవన్నిర్ణయంలా కనిపిస్తోంది. తనలోని వ్యక్తిత్వం పరిణామం పొందటానికి తన వయస్సు దోహద మిచ్చింది. చిన్న తనంలో తను ప్రపంచాన్ని మసక వెలుతురులో చూసేవాడు. రంగుటద్దాలతో వ్యక్తుల్ని పరిశీలించేవాడు. అప్పటికీ ఇప్పటికీ తన దృక్పథంలో ఎంతో తేడా వుంది. ఇప్పుడు ప్రతి వ్యక్తిలోని మంచిని చూడ గల్గుతున్నాడు.

* * *

సాయంకాలం ఏడు గంటలకు రావలసిన మెయిలు గంటన్నర లేటుగా వచ్చింది. ప్లాటుఫారం మీదకి మెయిలు వచ్చి ఆగగానే, ఒక్కసారి ప్రయాణీకులు హడావిడిగా ఇటూ అటూ తిరగ నారంభించారు.

ఎక్కేవాళ్లు దిగేవాళ్లను తోసుకుంటూ ఎక్కుతున్నారు. దిగేవాళ్ళు సామాన్లు, జనాన్ని తప్పించుకుని లాఘవంగా దిగుతున్నారు. ఆడవాళ్ల కంపార్టుమెంటు లోంచి ఒక ఏభై ఏళ్ల స్త్రీ దిగింది. ఒక పెట్టె బెడ్డింగుతో సహా. ఆమె తలంతా నెరిసి పోవడమే కాకుండా ముఖం మీద స్ఫోటకం మచ్చ



'మరోలా భావించక! మా బంధువుల అబ్బాయిదికూడా ఇదే మోస్తరు ఫాషన్! వాడు ఔనో...కాదో అని చూశా...'

అజీర్ణము వల్ల ఎందుకు బాధ పడతారు?

# హ్యూలెట్స్ మిక్స్చర్

## వాడి త్వరగా నివారణను పొందండి

ఎడతెరిపిలేని పని మరియు చింత జీర్ణశక్తిని చెడగొట్టి ఆకలిని పోగొట్టి మందకొడితనాన్ని కలిగిస్తాయి. హ్యూలెట్స్ మిక్స్చర్ అతిత్వరగా చిర నివారణను కలిగించును. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే అమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును. హూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకు కూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిసిన హూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.

**హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.**




C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ 86/A నయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3

JWT/CJH 2820 A



తలనొప్పి



నడుమునొప్పి



పంటినొప్పి



బహిష్టు రోజులలో నొప్పి



జలుబు




# ఒకే ఒక సారిడన్ 'రోష్'

## నొప్పులను పోగొట్టును!

### నొప్పిని పోగొట్టును, ఖేదదేర్చును, సనోత్సాహమును కలిగించును

నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన సారిడన్ నొప్పులనుండి త్వరితముగా, నిరపాయముగా మరియు నిశ్చయముగా ఉపశమనము కలిగించును. తలనొప్పి, పంటినొప్పి, ఒంటినొప్పి, జ్వర చిహ్నములు మరియు జలుబులకు సారిడన్ వేసుకోండి. పెద్దవారికి ఒక బిళ్ల పూర్తియైన మోతాదు. పిల్లలకు ¼ నుండి ½ బిళ్ల వరకు చాలును.

'రోష్' తయారు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్లెస్ లిమిటెడ్







ఒకే సారిడన్ బిళ్ల చాలును

ఒక బిళ్ల ఖరీదు 13 నయా పైసలు

JWTVT.1845-RT

ంతో, సన్నగా జబ్బు దానిలా వుంది. కొన్ని పళ్ళు కూడా ఊడినట్లు కనిపిస్తున్నాయి. మొహం మీద బొట్టు లేక పోవడం వల్ల ఆమె విధవ అని తెలుస్తోంది. ఆమె కూలీ కోసం అయిదు నిమిషాలు ప్లాటుఫారం మీద నిలబడింది.

రామనాథంగారు వోపికగా అన్ని కంపార్టుమెంటులూ తనిఖీ చేశారు. ఆమె దిగిన కంపార్టుమెంటు వద్దకు కూడా వచ్చి, ఆమెను చూచి, ఆమె కాక మరెవరైనా దిగుతారేమో చూచి, మరెవరూ దిగక పోవడం వలన, నిరాశతో ముందుకు వెళ్లి పోయారు. తరువాత అటు వైపు రెండుసార్లు తిరిగారు. గాని ఆమె వైపు మళ్లీ చూడలేదు.

ఆమె మాత్రం ఆయన్ని గుర్తించింది. కాని అక్కడ పలకరించడం బాగుండదని వూరుకుంది. మొయిలు వెళ్లి పోగానే ఒక లైసెన్సు కూలీని పిల్చి కరణం గారింటికి పదమంది. ఆమె స్టేషను నుంచి వెళ్లిపోతూ ఆఖరు సారి రామనాథం వైపు చూసి, తనను అతను గుర్తించనేలేదని నిశ్చయం చేసుకుంది — శారద !

మామూలుగా రోజూ లాగే ఆయన సిమెంటు బెంచీ మీద కూర్చుని, శారద రైల్లో దిగనందున విచారిస్తున్నారు రామనాథంగారు. తను ముప్ఫై ఏళ్ల క్రిందట చూసిన సౌందర్య రాసి — శారద రూపం — అలాగే వుంటుందని భావించారాయన. అది ఒక అద్భుతమైన శిల్పి శిలలో మలచిన సౌందర్యమై, నిర్జీవ ప్రతిమగా వుండి వుంటే, ఎన్ని సంవత్సరాలకైనా మారకుండా వుండేదేమో !

సృష్టి కర్త, చైతన్యంతో నింపిన, సజీవశిల్పమైన మానవ రూపం మీద, కాలం ఎన్ని మార్పుల్ని తెస్తుందో, రామనాథంగారి వూహకంద రానిది. అందుకే ఆయన శారదనుగుర్తించ లేకపోయాడు. ఇన్నేళ్ల తరువాత !

ఆ రాత్రి కూడా ఆయనకు తియ్యని కలలు వచ్చాయి. శారదా తనూ ప్రేమ లోకంలో విహరిస్తున్నట్లు, ఆమె పసిడి బుగ్గలూ, తళుకు కన్నులూ తనను మైమరపించినట్లూ దృశ్యాలు కన్పించాయి. అదే సమయంలో కరణంగారింట్లో శారద తన చెల్లెలితో కబుర్లు చెప్తూ, “ రామనాథంగారిలో బాగా ముసలి వాలకం వచ్చేసింది సుమా ! ” అని అంటోందని ఆయనికి తెలియదు.

మర్నాడు ప్రొద్దున్న రామనాథం గారు స్నానం చేసి హాల్లో కూర్చుని శారద గురించి తీవ్రంగా ఆలోచించ సాగారు. రెండు నెలల క్రిందట వస్తానని రాసిన ఆమె ఇంత వరకూ రాక పోవడానికి కారణమేమిటో తెలుసు కోవాలని నిశ్చయించారు. ఆమెకు ఏదైనా ఆపద సంభవించిందేమోనని శంకించారు. అదేమిటో తెలుసుకునేదాకా ఆయనకు తోచదు. సత్యన్నారాయణ పేర ఒక ఉత్తరం రాయ దల్చారు.

ఒక కవరు తీసి దానిపై సత్యనారాయణ అడ్రసు వ్రాశారు. ఉత్తరం ప్రారంభించారు. రెండు నెలల క్రిందట శారద తన కొక వుత్తరం రాసిందని వ్రాస్తూ, ఆమె వుత్తరం లోని అంశాలు వ్రాయడం మొదలెట్టారు.

ఇంతలో “ సార్ ! ” అని కేక వేసుకుంటూ పోస్టుమాను వచ్చాడు. తన చేతికి ఒక కార్డు ఇచ్చాడు. తీరా అది చదివే సరికి తనది కాదా వుత్తరం వెంటనే పోస్టుమాన్‌ను వెనకకు పిల్చి, “ పేరు నా దానిలా వుంది గాని ఉత్తరం నాది కాదు.” అని చెప్పి ఇచ్చేశారు.



“ ఓహో ! అయితే ఆ ఎదురింటాయనకొచ్చి ఉంటుంది సార్ ! ” అని ఆ ఉత్తరం తీసికెళ్లి ఆయకిచ్చాడు. ఆయన కూడా వీధిలో నిలబడి వుండి ఇది చూస్తున్నాడు. పోస్టుమాన్ ఇచ్చిన ఉత్తరం తీసుకున్న తరువాత తన నుద్దేశించి, “ మీ పేరూ నా పేరూ ఒకటవడం మూలాన ఉత్తరాలు తారు మారవుతున్నాయి.” అన్నారు. రామనాథం గారు చిరునవ్వు నవ్వారు.

“ రెండు నెలల క్రితం తను ఈ వూరు వస్తానని స్టేషనుకు వచ్చి కలుసుకోమని నా భార్య రాసిన ఉత్తరం నాకందనే లేదు.” అన్నారు ఎదురింటాయన.

రామనాథం గారు గతుక్కుమన్నారు. “ ఆమె పేరు ? ” అని అడిగారు. ఏదో భయపడుతున్నట్లు.

“ శారద.” అన్నారాయన అదోకలా చూస్తూ.

“ ఓ హో ! ” అంటూ లోపలికి వెళ్లిపోయారు రామనాథం గారు.

కొద్ది నిముషాల తరువాత సత్యన్నారాయణకు రాసే వుత్తరాన్ని చింపేశారాయన.



# సస్యాలకు సరిగమలు

* వాడ్రేవు పతంజలి *



"పంటలు పెంచడానికి సంగీతాన్ని వినియోగిస్తున్నారు!"

డెస్కుదగ్గరి సబ్ఎడిటర్‌కి ఇది మురిగిపోయిన 'స్టోరీ'; 'చంపి' చెత్తబుట్టలో పారేయాల్సిన రిపోర్టు! పాఠకులకికూడా ఇది అర్నెల్లక్రితం దొంగలు పడినవార్త!!

అయితే ఇటీవల ఈ వార్త తిరిగి హెడ్‌లైన్సుకి ఎగబ్రాకింది. కారణం : కోయంబత్తూరులో ఉన్న వ్యవసాయక పరిశోధనా కేంద్రం కొత్తగా కనుగొన్న విషయం : మద్రాసు వ్యవసాయమంత్రి రాష్ట్ర శాసనసభలో చేసిన ప్రకటనం— వరిపంటల అభివృద్ధికి సంగీత కార్యక్రమాలు అంతగా ప్రయోజనకరం కాలేదట. పంట పెరగడంలేదు. సరికదా, పొలాలలో గడ్డిమాత్రం పుష్కలంగా ఎదుగుతోందిట. మనుషులే తిండికి కటకట పడుతూ ఉంటే, పశుగ్రాసం పుష్కలంగా లభిస్తోందనేమాట చెవికి అట్టే అంత ఇంపుగా వినబడకపోవడం సహజం.

పోతే చెప్పుకోవాల్సింది ఒక్క విషయం. నిన్న మొన్నటిదాకా 'చక్కని ఫలితాలు' నిచ్చిన ఈ సంగీత ప్రయోజనాలు అందునా సంగీతాది కళలకు కాణాచి అయిన మద్రాసు రాష్ట్రంలో సఫలం కాలేదంటే పైకి కనబడే కారణాలకంటే గుప్తమైనవీ, గూఢమైనవీ మరేవో హేతువులు ఉండి తీరాలి.

కోయంబత్తూరు కర్షకులు వరిచేలకు వినిపించింది గాత్ర సంగీతమో, వాద్య సంగీతమో మనకు తెలియలేదు. గాత్ర సంగీతం వినిపిస్తామంటే తెలుగులో ఉన్న త్యాగరాయ కృతులకూ, సంస్కృతంలో ఉన్న దీక్షితార్ కీర్తనలకూ అర్ధంకాకపోయి ఉండొచ్చు. లేక ఆ పాడేవారి కంఠం పాటకీ అంత రుచించకపోవచ్చు, లేక రాగాల ఎంపికలో తేడా వచ్చి ఉండొచ్చు. అందుచేత వాద్య సంగీతమయితే వేణుగానమయితే మరీ మంచిది. ప్రయోజనం ఉండొచ్చు. ఘన రాగాలు కాకుండా అతి మధురమైన, అతి లలితమైన రాగాలు వినిపించితే బాగుండొచ్చు.

వేణుగానమంటే జ్ఞాపకం వస్తోంది— సంగీతాన్ని ఆవులకికూడా వినిపించి, పాలు దిగుబడిని బాగా పెంచారట. అయితే దీనికి కొంత వెనక గ్రంథం ఉంది. కృష్ణుని నాటినుంచి ఆవులకు సంగీతం వినడం, చక్కగా తలలూపడం, ఉత్సాహంతో బిస్సగ్గా మేతమేసి, పొదుగులు కుండల్లా చేసుకుని ఇళ్లుచేరి క్షీరభాండాలు నింపడం అలవాటు అయింది. అదిగాక, శాస్త్రకారుడు చెప్పినట్టు "శిశుర్వేత్తి, పశుర్వేత్తి గాన రసం ఫణిః—" పశువులకు సంగీతం మహా బాగా రుచిస్తుందట. దీని ప్రకారం ఆవులూ, గేదెలూ మొదలైన పశువులకు కేవలం వేణుగానమే వినిపించాలని విధి ఏమీలేదని, ఏ వాద్యమైనా లేక గాత్ర సంగీతమైనా సరిపడుతుందని అనుకోవాలి.

పోతే కోయంబత్తూరు మొక్కలు సంగీతాన్ని అంతగా ఆదరించకపోవడం, దానికి తగిన ఫలితాన్నివ్వకపోవడం, ఈ విధంగా మొరాయించి సర్కారువారు చేసే వేలకువేల ఖర్చునూ బూడిద పాలు చేయడం— చూడగా చూడగా ఒకటనిపిస్తోంది. శిశువులూ, పశువులూ, పాములూ సంగీతమంటే చెవికోసుకుంటాయని సిద్ధాంతంచేసిన శాస్త్రకారుడు తమ వృక్షజాతిని పేర్కొనక పోవడంలో గొప్ప అన్యాయంచేశాడనీ, తమ అభిరుచులను క్రిందచూపు చూశాడనీ, దానికి ప్రతిగా చక్కని సంగీతం విన్నా కిక్కురుమనకుండా ఊరుకోవాలనీ ఏ శుభ సమయాన ఏకగ్రీవ నిర్ణయానికి వచ్చాయేమో! ఇది కాజాలదు. ఏమంటే కందులూ, మినుములూ, పండే చేలు సంగీతానికి బాగా 'రెస్పాన్సు' చేశాయట. కోయంబత్తూరు కందిచేలుకూడా (అక్కడ కందిచేలు ఉంటే గింటే) బాగానే కాసి ఉండొచ్చు. మరి ఈ వరిచేల మాటేమిటి? మద్రాసు శాసనసభలో మంత్రిగారుచేసిన ప్రకటనని పరిశీలిస్తే వరిచేలను బొత్తిగా అంత అనలేము. కొంతలో కొంత గడ్డి దిగుబడి పెరిగింది. నయం కాదూ, లేకపోతే మన ఆవులూ, గేదెలూ, చెత్తకాగితాలూ, గుడ్డపీలికలూ తిని నాసిరకం పాలీయగలవు!

...ంత మెరుగుదల కనబడుతూన్నదనీ, మరో అయిుదారు పేజన్లు వరిచేలపై సంగీత ప్రయోగాలు కొనసాగించి చూడాలని వ్యవసాయశాఖా మంత్రి తన శాఖకు ఆదేశాలు పంపారట.

తమ జాతిని గూర్చి శాస్త్రకారుడు పేర్కొనక పోవడం దారుణం అని కోయంబత్తూరు వరిచేలు వ్యాకులపడేటట్టయితే ఆ సిద్ధాంతంలో చేర్చబడని అనేక వృక్షాలూ, ఇతర చరస్థిర పదార్థాలూ సంగీతానికి ఎట్లా చెవోగ్గుతున్నవీ అనే ప్రశ్న ఉదయించడం సహజం. గోపాలకృష్ణుడు యమునానదీ సైకతాలమీద విహారంచేస్తూ, వేణువుమీద లలిత లలితమైన గానాన్ని ఆలాపిస్తూంటే తీరాన ఉన్న మొక్కా మొటికా పులకరించి మొలకెత్తేవనీ, మొలకలెత్తినవి మొగ్గ తొడిగేవనీ, మొగ్గ తొడిగినవి సువాసనలు గ్రుమ్మరిస్తూ పుష్పించేవనీ మనం వినే ఉన్నాము. అదే గానం విని యమునానది గలగలా వంత పాడుతూ, మరింతసేపు ఆ వింత దివ్య సంగీతాన్ని ఆలకించేందుకా అన్నట్టు అతి మెల్లగా, అడుగులో అడుగు వేసుకుంటున్నట్టు ప్రవహించేదనీ కూడా మీరూ, నేనూ వెరశి మనందరమూ వినే ఉన్నాము. నౌకావిహారం సాగించే వేళలో అలలు లయబద్ధంగా, పడవను వూగించి తూగించేవనీ విన్నాము.

సరే కృష్ణుడు ఎప్పుడూ మాయలాడివాడు. సమస్త చరాచర జీవరాశులను తనకు ఇష్టం వచ్చినట్టు కీలుబొమ్మలను చేసి ఆడించగల చతురుడు. అతడికి సంగీతమనే ఏమిటి ? ఏవిధంగానైనా అవతలివారినీ, వాటినీ లొంగదీసుకోగలడంటారా, సరే ననుకొందాము. అంతా నిన్న మొన్నటివాడు, సంగీత సమ్రాట్టు అనిపించుకొన్నవాడు, అక్బరు చక్రవర్తి దర్బారులోని నవరత్నాల్లో ఒకడూ మకరంద్‌పాండే అనే మియా తాన్‌సేన్ ఉన్నాడు. ఆయన మాయా మర్మం తెలిసినవాడు కాడు కద ! ఆయనకు అతీతశక్తులేమీ లేవుగద ! (హరిదాసస్వామి ఏమి యోగవిద్యలు ప్రసాదించాడో మనకు తెలియదాయె మరి !) ఆయన దీపక్‌రాగం ఆలాపించి దర్బారులో ఉన్న లాంతర్లన్నీ వెలిగించేశాడట ! ఎప్పుడో పురాణకాలంలో రుష్యశృంగుడు ఏ దేశంలో అడుగుపెడితే ఆ దేశంలో సకాలానికి వర్షాలు పడేవని చెబుతారు. మరి తాన్‌సేన్ మల్హార్ రాగం ఆలాపించేసరికి—బహుశా ఆలాపన అలా ముగిసేసరికి—ఇలా వర్షాలు పడేవట. కాని తాన్‌సేన్‌గారు చాలా వినయం గలవారు గనక తన సంగీతానికి అతీతశక్తులున్నయ్యని బాజా వాయించుకొనడం ఇష్టంలేక కాబోలు ఒకేఒకసారి 'మల్హార్' వర్షం కురిపించేటంత ఆవేశంతో పాడారట !

''మా వంశంమీద సంగీతం ప్రభావం గురించి ఇంత చర్చ చేస్తారుగాని, మీ మనిషి జాతిమీద గాంధర్వ విద్యాప్రభావం గూర్చి మాట్లాడరేం'' అని ఏ కోయంబత్తూరు వరిమొక్కో లేచి మాటిగా ప్రశ్నిస్తే, పరిస్థితి కొంచెం ఇరకాటంగా ఉండొచ్చు. పూర్వజన్మలో సరస్వతీదేవికి తేనె అభిషేకంచేసి పుట్టాడన్న చెంబై వైద్యనాథ భాగవతారు 'సావేరి' ఆలాపించనీండి, 'ఇశైవాణి' ఎం. ఎస్. సుబ్బులక్ష్మి 'బృందావన సారంగ' పాడనీయండి, బాలమురళీకృష్ణ 'మహతి' మధురంగా ఆలాపించనీండి, ముందు వరుసలో కూర్చుని 'ఆహా', 'హాహా' అని 'చ్చ, చ్చ, చ్చ' అని తలలూపే రసికాగ్రణులమాట అటుంచి, జరీ చీరెల్లో ముస్తాబై, పాటకచేరీలకీ, నృత్యప్రదర్శనాలకీ వెళ్లడం ఒక హోదా చిహ్నంగా, ఒక ఫాషన్‌గా భావించి వచ్చే ''ఆధునిక అమ్మలక్కలు'', మహిళా మండలి ఎన్నికల రాజకీయాలూ, పెద్దాఫీసరుగారి భార్య తలబిరుసుతనమూ చర్చిస్తూనే, లేగిచెట్టు భాగవతంలా మధ్యమధ్య నలుగురితోబాటూ చప్పట్లు కొడుతూ 'ఎంతబాగా ఉందీ కచేరి !?!' అన్నట్లు బాగావుందీ కచేరి !?!' అన్నట్టు మెరిసే కళ్లతో ఒకళ్ల నొకళ్లు చూసుకోవడం నాకు తెలియదనే మొక్కలతో కల్లబొల్లిమాటలు చెప్పగా ? ఆడవారి సంగతి ఇలా ఉంటే, కేవలం స్నేహితులను కలుసుకోడానికిదో అవకాశం అన్నట్టు వచ్చే సంగీత సభ సభ్యులైన మగ మహారాజులున్నారు. 'వాడికి ప్రమోషన్ వచ్చిందీ, వీణ్ని ట్రాన్స్‌ఫర్ చేశారా' అనుకోడంతో మొదలై 'ధరలిలా మండిపోతున్నై, ఏం గవర్నమెంటులెద్దూ, ఏం చేస్తారో గాని' అనే చర్చలతో కొనసాగి, సరే, పద, ఓ కప్పు కాఫీ తాగి వద్దాం !' అనుకోడం – నాకు తెలిదనే మొక్కల్ని బుకాయించనా ? ఇలాంటి జట్టునే ఇటీవల 'కచేరి ఎలా జరిగిందోయ్ ?' అని అడిగితే ''బాగానే జరిగింది. మేము బయటనే ఉన్నాము కనక ?'' అన్నారట.

ఇంతకూ చెప్పొచ్చేదేమంటే, సంగీతానికి వళ్లుమరచిపోయేటంత ప్రభావం పొందే మనుషులు ఎలా ఉన్నారో, మొక్కలూ అలానే ఉన్నయి. శాస్త్రీయ సంగీతంలో కొంత ప్రవేశం కలుగజేస్తే మనుషులు ఎలా ఆనందించగలరో మొక్కలకు కూడా అలానే సంప్రదాయ సంగీతంలో కొంత పరిచయం కలుగజేస్తే అంటే 'మాయామాళవగౌళ' తో ఆరంభించి, జంట స్వరాలూ మొదలైన వివరాలన్నీ బోధపరచినట్లయితే అవి విరగబూసి, విరగ కాయగలవేమో ! ఇదేమీ కాక, జనసాధారణంలాగానే మొక్కలకి కూడా సినిమా సంగీతం తప్ప మరొకటి రుచించదేమో ? శాస్త్రవేత్తలు ఈ విషయాన్నికూడా పరిశీలించగలరు. ★

# గంధర్వ ప్రశ్నలు!

## నిర్వహణ: వి. ఎ. కె. రంగారావు

- ○ 21 బహుమతులు :: 65 రికార్డులు
- ○ ఒక మొదటి బహుమతి : 5 రికార్డులు
- ○ ఇరవై రెండవ బహుమతులు :: 3 రికార్డులు

అతి సులభమైన కొత్త పంథాలో పోటీ! అందరూ పాల్గొనవలసిన పోటీ!

డిసెంబరు 15వ తేదీలోగా మీ సమాధాన పత్రాలు పత్రిక కార్యాలయం చేరాలి. ఫలితాలు సంక్రాంతి సంచికలో. బహుమతులు రిపబ్లిక్ డే నుండీ మీ చేతిలో ఉంటాయి!

**నిబంధనలు :**

1. క్రిందటి పోటీలో బహుమతి పొందినవారు ఈ పోటీలో పాల్గొనకూడదు.
2. పాల్గొనేవారు తమ పేరు, పూర్తి అడ్రసు సమాధాన పత్రాల చివర స్పష్టంగా వ్రాయాలి.
3. జవాబులు వరుస క్రమంలోనే ఉండాలి.
4. ఇచ్చిన పంక్తుల పరిమితిని ఏమాత్రం దాటకూడదు.
5. మామూలు ఎక్సర్‌సైజు పుస్తకానికి రెట్టింపు సైజు ఉండే అరటావు కాగితాలనే సమాధానాలకు ఉపయోగించాలి.
6. జవాబులు పంపే కవర్లపైన 'గంధర్వప్రశ్నల పోటీ' అని వ్రాయాలి. అవి ఎడిటర్, ఆంధ్ర సచిత్రవారపత్రికకి పంపాలి. శీర్షిక పేరిటగాని, వ్యక్తుల పేరిటగాని పంపకూడదు.
7. మొదటి భాగంలో అన్ని ప్రశ్నలను పూర్తి చేయాలి.
8. డబ్బింగ్ చిత్రాల గురించి జవాబులు ఉండకూడదు.
9. జవాబులు మొదటి భాగానికీ, రెండవ భాగానికీ వేరు వేరు కాగితాలపై ఉండాలి.
10. ఈ పోటీలో పాల్గొనటానికి ప్రవేశ రుసుముగా మీరు ఒక రికార్డు కొన్నట్టు (ఏ భాషదైనా సరే) బిల్లు జతపరచి పంపాలి. ఈ బిల్లులు లైసెన్సు పొందిన రికార్డు డీలర్లవే అయి ఉండాలి. ఆ బిల్లుపై మీరు కొన్న రికార్డు నంబరు వ్రాసి ఉండాలి.
11. ఇందులో ఏ ఒక నిబంధనను పాటించకపోయినా మీ పత్రం రద్దు కాబడుతుంది.

**మొదటి భాగం :**

I (ఎ) ఇంతవరకు వచ్చిన తెలుగు సినిమాలలో
(బి) గత యిరవై తెలుగు సినిమాలలో

(1) సంగీతపరంగా ఏ చిత్రం నచ్చింది

(2) ఏ పాట నచ్చింది
(అ) బృందగానం (ఆ) యుగళ గీతం (ఇ) సోలో

(3) ఏ నృత్యం కంటికి యింపుగా ఉంది.
(అ) బృంద నృత్యం, (ఆ) సోలో.

(4) ఏ సంగీతదర్శకుడంటే మీకు అభిమానం కలిగింది ?

(5) ఏ నేపథ్య గాయక గాయనులంటే మీకు యిష్టం కలిగింది ?

(6) ఏ పాటల రచయితంటే మీకు అభిమానం ఏర్పడింది ?

(7) ఏ దర్శకుడు సంగీత సన్నివేశాలను అందంగా రూపొందించాడని మీ ఉద్దేశం ?

(8) ఏ పాట కేవలం రచనామాధురిచే మిమ్మల్ని ఆకర్షించింది.

(2, 3, 6, 7, 8 ప్రశ్నలకు సినిమాల పేర్లు కూడా వ్రాయాలి. పై ప్రశ్నలకు సమాధానం వ్రాసే విధానం. ఉదాహరణకి-

(1) ఎ. వరూధిని, బి. అగ్గిపిడుగు

(2) ఎ. అ. తెల్లారిందోయ్ ఆ. మంగళసూత్రం
బి. అ. ఉందిలే మంచిరోజు, రాముడు—భీముడు
ఎ. ఆ. సుందరమాలితి, వందేమాతరం.
బి. ఆ. దొంగచూపులు, కలవారి కోడలు)

II 1. పిఠాపురం, 2. స్వర్ణలత, 3. మాధవపెద్ది, 4. బి. గోపాలం, 5. వసంత, 6. ఎల్.ఆర్. ఈశ్వరి, 7. పి. సత్యారావు, 8 వైదేహి, 9. ఎ. పి. కోమల, 10. ఘంటసాల, 11. జమునారాణి, 12. భానుమతి 13. ఎస్. జానకి, 14. శ్రీనివాస్, 15. సుశీల, 16. రాణి, 17 పి లీల, 18. శాంతకుమారి, 19. ఎస్. వరలక్ష్మి, 20 జిక్కి. పాడిన పాటలలో మీకు (ఎ) బాగా నచ్చినది, (బి) ఏమాత్రం నచ్చనిది వ్రాయండి.

**సమాధానం వ్రాసే విధానం:**

(1) ఎ. పలుకు కోరకు, బి. నినునే చెలి. సోలో గీతాల గురించే వ్రాయాలి. సినిమా పాటలయినా ప్రైవేటు గీతాలయినా వ్రాయవచ్చును.)

**రెండవ భాగం :**

(1) ఈమధ్యన విడుదలయిన అశ్లీల హాస్యగీతాలకు బాధ్యులెవరు ?

(2) వాటి నిలుపుదలకు ప్రధాన కారణమేమి ?

(3) సినిమా పాటల రచయితలలో మీకు నచ్చిన వారి నొకరిని గురించి వ్రాయండి.

(4) ఈనాడు చిత్రాలలో వినిపిస్తున్న సంగీతం గురించి మీరేమంటారు ?

(5) ఈనాటి పాటల రచన గురించి మీ అభిప్రాయం.

(ఒక్కొక్క ప్రశ్నకు జవాబు పది పంక్తులకు మించకూడదు. ఒక్కొక్క ప్రశ్నకు పద్దెనిమిది మార్కులు. దస్తూరికి పది మార్కులు.)

పోటీ విషయంలో తుది నిర్ణయం నిర్వాహకునిది. ఉత్తర ప్రత్యుత్తరాలు జరపబడవు.





రాజ్యం పిక్చర్స్ 'శకుంతల' ప్రారంభోత్సవ సందర్భంలో తీసిన ఫోటో– ఇందులో శ్రీయుతులు లక్ష్మీరాజ్యం, బి. నాగిరెడ్డి, సావిత్రిగారలను చూడవచ్చును.



ఆర్. ఆర్. పిక్చర్స్ వారి సాంఘికచిత్రం 'శభాష్ సూరి'లో ఒక దృశ్యం. రాజశ్రీ వారు విడుదల చేసిన ఈ చిత్రంలోని కథానాయికా నాయకులు శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీమతి టి. కృష్ణకుమారి

# సినిమా వార్తలు

## 'పాండవ వనవాసం'

"నిలవండి !" ఖంగున వినిపించింది. ఆ ప్రదేశమంతా మార్మోగింది. వారిద్దరూ వెళ్ళబోయి తక్కున ఆగిపోయారు.

"ఇది గంధర్వ మహారాజు చిత్రసేనుల కేళీ సరోవరము" అన్నాడు మళ్ళీ.

ఆ ఇద్దరిలోను చిన్నవాడి కళ్ళల్లో కోపం ఓ క్షణం గిర్రున తిరిగి మాటల్లోకి జారింది.

"ఆఁ ప్రవేశించరాదా ?......... సైనికులారా ఈ ప్రలాపులను బంధించండి !" అన్నాడు వెనుకనున్న వాళ్లనుచూసి.

మొదటి వ్యక్తి రెండోవాణ్ణి వారిస్తూ "తొందరపడకు దుశ్శాసనా!" అన్నాడు. "మీధోరణి విద్యూరంగా ఉంది. మా కౌరవ సామ్రాజ్యంలో ప్రవేశించి మమ్మే నిరోధించటం మంచిదికాదని మా హెచ్చరిక ! వెళ్ళి మీ రాజుకు నివేదించండి."

"ఊఁ, వెళ్ళండి ! మా సంగతి మీకు తెలియదులే ! మర్యాదగా వెళ్ళకపోతే ఈ పుడుగుఁదాటి వెళ్లరు" ప్రహ్మండం ధయపెట్ట జూచాడు.

ఇంతలో మరో వ్యక్తివచ్చాడు. వట్టినేకాదు వికటాట్టహాసం చేసుకుంటూ మరీవచ్చాడు. వచ్చి "అవును, మళ్ళీ వెళ్లరు ! శకునీ, ఇది మాయాద్యూతంలో అమాయకులైన పాండవులను మోసగించటంకాదు, గంధర్వ రాజుతో కదనం ! గౌరవంగా కాలికి బుద్ధిచెప్పకపోతే గర్వభంగం తప్పదు !" అన్నాడు తన గొప్పను స్పష్టంగా చెప్పుకుంటూ.

రెండో వ్యక్తిలో సహనం సన్నగిల్లింది. తను మాత్రం ఏం తీసిపోనట్టే అన్నాడు. "గర్వభంగావితే ఈ ప్రుళ్ళిపాటు గంధర్వా ! నీ ప్రగల్భాలు భామలతో గాని కౌరవ సార్వభౌములతో కాదు".

—ఇది మాధవి ప్రొడక్షన్సువారి "పాండవ వనవాసము" చిత్రంలోనిది. మొదటి వ్యక్తి, రెండో మనిషీ శకుని, దుశ్శాసనులనీ, వికటాట్టహాసంచేస్తూ వచ్చిన గంధర్వుడు చిత్రసేనుడనీ మళ్ళీ మీకు వేరే చెప్పనక్కరలేదు. మహాభారతంలోని ఘోషయాత్రలో ఒక దృశ్యమిది.

వాహినిలో మూడో ఫ్లోరులో ఈ చిత్రం షూటింగు జరుగుతూంది. పాండవ అగ్రజులైన ధర్మ, భీమ, అర్జునులుగా— గుమ్మడి, ఎన్. టి. రామారావు, బాలయ్య, శ్రీకృష్ణ, అభిమన్యులుగా— కాంతారావు, హరనాథ్; దుర్యోధన, కర్ణ, విదుర, దుశ్శాస, సైంధవ, లక్ష్మణకుమార, ఘటోత్కచులుగా ఎస్. వి. రంగారావు, ప్రభాకరరెడ్డి, నాగయ్య, ముక్కామల, రాజనాల, పద్మనాభం, సత్యనారాయణ; ద్రౌపది, శశిరేఖ, భానుమతి, గాంధారి, సత్యభామలుగా—సావిత్రి, ఎల్. విజయలక్ష్మి, సంధ్య, ఋష్యేంద్రమణి, వాణిశ్రీ నటిస్తున్నారు. ఇంకా రాజసులో

శన (గెస్ట్), పసిబాలదేవి, రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, సీతారాంకూడ తారాగణంలో ఉన్నారు. రచన : సముద్రాల (సీనియర్) సంగీతం : ఘంటసాల, కెమెరా: సి.నాగేశ్వరరావు, ఆర్ట్: ఎస్. కృష్ణారావు నృత్యాలు : పసుమర్తి, ఎడిటింగ్ : సంజీవి, నిర్మాత : ఏ.ఎస్.ఆర్. ఆంజనేయులు. కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో రూపొందుతున్న ఈ భారీచిత్రం ఇంతవరకు పన్నెండు రీళ్ళు పూర్తి అయింది. జనవరి మొదటి తేదీన విడుదలచేయాలని అనుకుంటున్నారు.

## ప్రమీలార్జునీయం

ప్రమీల ! వింత కాంతులీనే పసిడిమేను, పరువం పొంగులెత్తుతున్న అవయవ సౌష్ఠవం— అనురూప సౌందర్యంతో అద్భుతంగా వెలిగిపోతున్నది ప్రమీల. కన్నులు నింపుతున్న వెన్నెల......... కోరికలు చిగురింపజేస్తున్న పచ్చని లతలు, వెచ్చదనం తెచ్చి గొడుతున్న పూలు ......... చెలికానితో పొత్తు కలపాలని......మత్తుగా చూస్తున్నది. చెలికాడు అర్జునునిలో భావుకత పెల్లుబికింది. అతని భాష, భావము ఆమెను గిలిగింతలు పెట్టినవి. ఆనందం వెల్లువలై పారి హృదయాన్ని వూపినది. తన్మయత్వంతో మారు పలుకలేక చెలికాని విశాల వక్షంపై సోలిపోయినది ప్రమీల.

—ఈ శృంగార సన్నివేశాన్ని రసవత్తరంగా రమణీయంగా చిత్రీకరించరు యువ దర్శకులు ఎం. మల్లిఖార్జునరావు. ఇది ఎస్.ఆర్. మూవీస్‌వారి "ప్రమీలార్జునీయం" చిత్రంలోనిది. మల్లిఖార్జునరావు పేరు పాఠకులకు కొత్తగా వినిపించవచ్చును. ఆయన తొలిసారిగా దర్శకత్వం వహిస్తున్న చిత్రం ఇది. చాలాకాలం సహాయ దర్శకునిగా పనిచేసి, విశిష్టమైన అనుభవం గడించి స్వశక్తితో పైకి వచ్చిన వ్యక్తి. ఈ సన్నివేశ చిత్రీకరణలో ఆయన ప్రతిభ ద్యోతకం అవుతుంది. ఎన్.టి.రామారావు, బి.సరోజాదేవి, రేలంగి, బాలకృష్ణ, గిరిజ, రాజశ్రీ, వాణిశ్రీ, మీనాకుమారి మొదలైనవారు నటించే ఈ చిత్రానికి రచన : పింగళి నాగేంద్రరావు, సంగీతం : పెండ్యాల. కళ : గోఖలే, కెమెరా : రవికాంత్ నిర్వహిస్తున్నారు. నిర్మాతలు : నాగమణి, ఆదిబాబు. నాలుగో ఫ్లోర్‌లో షూటింగు జరుగుతూంది. ఇంతవరకు పది రీళ్ల చిత్రం తయారైంది.

## 'వాహిని'లో పౌరాణిక చిత్రాల సంరంభం !

వాహినీ స్టూడియోలో ప్రస్తుతం పౌరాణిక చిత్రాల నిర్మాణం జోరుగా, సాగుతూంది. పాండవ వనవాసము, ప్రమీలార్జునీయం, హరిశ్చంద్ర, వీరాభిమన్యు చిత్రాల షూటింగులు జరుగుతున్నవి. ఇవన్నీ భారీ చిత్రాలే ! అధిక వ్యయంతో వేసిన సెట్స్, విలువైన కాస్ట్యూమ్స్, అనుభవజ్ఞులైన సాంకేతిక నిపుణులతో నిర్మిస్తున్నారు. హేమాహేమీలైన నటీనటులు పాల్గొంటున్నారు. ఈ కోవకే చెందిన 'బభ్రువాహన' చిత్రం ఇటీవలే షూటింగు పూర్తిచేసుకుని ఇపుడు విడుదలయింది. డిసెంబరునుంచి ఎన్.ఏ.టి.వారి 'శ్రీకృష్ణ పాండవీయం' ఆరంభించగలరని తెలుస్తున్నది.



'బభ్రువాహన'లో ఎన్. టి. రామారావు, ఎస్. వరలక్ష్మి!



జాన్సన్ అండ్ జాన్సన్ కంపెనీవారు నిర్వహించిన "ఫ్రీ హాలిడే ఇన్ ది హిల్స్" పోటీకి సంబంధించిన తుది నిర్ణయాలు జరిగిన సందర్భంలో తీసిన ఫోటో యిది. బహుమతి పొందిన 'ఎంట్రీ' తో బాటు, న్యాయ నిర్ణేతలైన (ఎడమనుంచి కుడికి) శ్రీమతి నార్త్, శ్రీమతి ఝుంఝున్‌వాలా, శ్రీమతి పలేకర్, డాక్టర్ అగర్వాల్ శ్రీమతి దేశాయ్‌లు యీ ఫోటోలో ఉన్నారు. అస్సాంకు చెందిన శ్రీమతి రోషనీ, ఎన్. తంకారీవాలా తీసిన ఫోటోకు బహుమతి వచ్చింది. ఇండియాలోని ఒకానొక పర్వతప్రాంతానికి వెళ్లేందుకు ఇద్దరు పెద్దవారికి, ఇద్దరు పిల్లలకూ అయ్యే విమానపు టిక్కెట్లు, ఐదువందల రూపాయలు రొక్కమూ బహుమతి విజేతకు లభిస్తాయి.



'వివాహబంధం'లో భానుమతి.



'రాముడు–భీముడు' చిత్రం శతదినోత్సవం జరిగిన సందర్భంలో నిర్మాత శ్రీ రామానాయుడుకు విజయా అధిపతి శ్రీ నాగిరెడ్డి షీల్డు బహూకరిస్తున్న దృశ్యం.

# సినిమా వార్తలు

## కొత్త తరహా 'సస్పెన్సు' చిత్రం

'క్రైమ్, సస్పెన్స్ ఉన్న చిత్రాలు తీస్తే తెలుగు నాట చూడరు !' అనే అపవాదు ఒకటి ముక్కోటి ఆంధ్రులమీదా ఉంది. అది ఎలా వచ్చినద్దో ఏమోగాని, మొత్తానికి వచ్చింది. హేమంతకుమార్ హిందీలో నిర్మించిన 'బీస్‌సాల్ బాద్', 'కోహ్రా' వంటి చిత్రాలు ఆంధ్ర ప్రజ మరి విరగబడి చూడ లేదా ? అంటే— వెంటనే ''అలా మనవాళ్లు చూస్తే తియ్యలేరు !'' అనేవాళ్లు కొంతమంది ఉన్నారు వాళ్లు తీసిందే చిత్రమనీ, మనవాళ్లు తీసింది చెత్త అనీ చెప్పేవాళ్లూ ఉన్నారు మనలో. నావెల్టీగల కథ తీసుకుని, చక్కని ట్రీట్‌మెంట్ ఇస్తే మన ప్రేక్షకులు— మన చిత్రాలపట్లకూడా ఆదరణ చూపుతారు. చూపరని ఎందుకు అనుకోవాలి ? అలా తీసిచూపితే, చూసి చెబుతారు, బాపున్నదని. మంచి రెస్పాన్సూ ఇస్తారు. అప్పుడు నిర్మాతల అంచనాలకు దెబ్బతగులదు..........

భట్టివిక్రమార్కలాంటి విజయవంతమైన చిత్రం నిర్మించిన పి.వి.వి.ఎస్.ఎం. అధినేత పి.వి.పి. సత్యనారాయణమూర్తి సస్పెన్సుతో నిండిన చిత్రం ఒకటి నిర్మిస్తున్నారు. ఈ చిత్రం పేరు ''అయినవారు—కానివారు'' నవంబరు నుంచి షూటింగు ప్రారంభించి మూడు మాసాల్లో పూర్తి చేసి విడుదలచేయాలని అనుకుంటున్నారు. అందుకు ముందుగా పాటల రికార్డింగ్ కార్యక్రమం జరుపుతున్నారు. ఇందులో మొత్తం అయిదు పాటలు ఉన్నాయి. వాటిలో మూడు గీతాలు వేల్పూరి కృష్ణమూర్తి సంగీత దర్శకత్వంలో ఏ.వి.ఎం స్టూడియోలో రికార్డ్ చేశారు. ఘంటసాల, సుశీల, శ్రీనివాస్ గాత్రధారులు. జమున, జగ్గయ్య, గుమ్మడి ముఖ్య పాత్రధారులు. చాలామంది కొత్త వారికికూడా నిర్మాత ఈ చిత్రంలో అవకాశం కల్పిస్తున్నారు. కళ : ప్రభాకర్, కెమెరా : మల్లి బాబు, కథ, మాటలు, పాటలతోపాటు దర్శకత్వపు బాధ్యతకూడా అనిసెట్టి చేపట్టారు.

## జయభేరి పిక్చర్సు!

''కిన్నెరా, ఆగు!'' అన్నాడు సింగన్న. వయసులో ఉన్న కుర్రాడు పాపం ! వెర్రి అభిమానం కిన్నెర అంటే.

''ఏం సింగన్న మామా !'' అంది చలాకీగా కన్నె కిన్నెర.

సింగన్నకి ఎంతో ముచ్చట అయింది ఆమె పిలుపు. 'నీ వలపు నాపై నిలుపే !' అని చెప్పాలనిపించింది. చిన్నపిల్ల, వెర్రిపిల్ల, పైగా మేనమామ కూతురు. అంతా ఒక్కమాటే చెప్పేస్తే ఇంకేమయినా ఉందా, బెదరిపోదూ ? మెల్లగా బోధ పరచాలను కొని ''నీతో ఒకమాట చెబుతాను, మనసులో ఉంచు కుంటావా ?'' అన్నాడు సిగ్గుపడిపోతూ.

పొగరూ, వగరూ కలసిన వయసు ఆ చిన్నదానిది! ''వద్దులే, నీ మాట నీ మనసులోనే దాచుకో !'' అంటూ ముందుకు సాగింది.

నిరాశపడిపోయి 'ఈ బ్రతుకు చేదు' అనుకో లేదు సింగన్న. మరికాస్త మృదువుగా చెప్పాలనుకొని



'రామదాసు'లో నాగయ్య



'శభాష్ సూరి'లో రామారావు, వాసంతి

# సినిమావార్తలు

"కిన్నెరా! కిన్నెరా ఆగు! ఏమిటా లేడి పరుగు?" అన్నాడు.

లేడి ఏమిటి? లేడికన్నా వేగంగా పరుగెత్తింది కిన్నెర, వలచిన ప్రియుడు తలపుకువచ్చి.— ఈ సన్నివేశం జయభేరి పిక్చర్స్‌వారి 'తాళిచిత్రం' లోనిది. సత్యా స్టూడియోలో నిర్మాణం అవుతున్న ఈ చిత్రంలో రాజసులోచన, కాంతారావు, బాలయ్య, సత్యనారాయణ మొదలైనవారు నటిస్తున్నారు. మాటలు, పాటలు: ఆరుద్ర, సంగీతం: పెండ్యాల, కళ: వాలి, నృత్యాలు: పసుమర్తి, దర్శకుడు: సి.ఎస్.రావు. నిర్మాతలు టి.రంగారావు, టి.త్రివిక్రమరావు.

## నాదీ ఆడజన్మే

శ్రీ వాణీ ఫిలింస్‌వారి "నాదీ ఆడజన్మే!" చిత్రం ఇన్‌డోర్ షూటింగ్ ముగిసింది. అవుట్‌డోర్‌లో నాలుగు పాటల చిత్రీకరణమాత్రం మిగిలి ఉన్నది. ఈ కార్యక్రమం జరిగితే నిర్మాణం పూర్తి అయినట్టే! ఎన్.టి.రామారావు. ఎస్.వి.రంగారావు, హరనాథ్, రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, పేరుమాళ్ళ, మాస్టర్ బాబు, సావిత్రి, జమున, సురభి బాల సరస్వతి, ఛాయాదేవి మొదలైనవారు నటించే ఈ చిత్రానికి మాటలు— డి.వి.నరసరాజు, పాటలు— దాశరథి సమకూర్చారు. జగ్గయ్య ఇందులో గెస్ట్‌గా నటిస్తున్నారు. సంగీతం: సుదర్శనం, నృత్యాలు— చోప్రా, కళ— ఏ.కె.శేఖర్, కెమెరా, ముత్తుస్వామి, ఎడిటింగ్: గోపి, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ఏ.సి. త్రిలోక్‌చందర్. నిర్మాత— ఎస్. వి. రంగారావు స్టూడియో ఏ. వి. ఎం. డిసెంబరు రెండవవారంలో విడుదల చేయాలని అనుకుంటున్నారు.

## కొత్త జానపద చిత్రం

విఠలాచార్య మరో 'క్విక్ మూవీ'కి దర్శకత్వం వహిస్తున్నారు. అది విజయలక్ష్మి పిక్చర్స్‌వారి చిత్రం జానపదం. షూటింగ్ నిర్విరామంగా జరుగుతూంది. కాంతారావు, రాజనాల, బాలకృష్ణ, లంకసత్యం, ఎస్.వరలక్ష్మి, రాజశ్రీ, వాణిశ్రీ గీతాంజలి మొదలైనవారు నటిస్తున్నారు.

"మరి మరి రాదు ఈ మధుర క్షణము
ఉందోయి నీ ముందే ఆనందించుము"—

జి.కె.మూర్తి వ్రాసిన ఈ గీతం జానకి పాడగా నటేశం వీనస్ స్టూడియోలో గీతాంజలిపై చిత్రీకరించారు.

మహారథి సంభాషణలు, సి.నారాయణరెడ్డి, జి.కె. మూర్తి గీతాలు వ్రాశారు. సంగీతం: రాజన్, నాగేంద్ర, కెమెరా: వెంకటరత్నం, నృత్యాలు: చిన్ని సంపత్, కళ: బి.సి.బాబు, కో—డైరెక్టర్స్: ఎస్.డి. లాల్, శర్మ.

మోహన్‌కుమార్. ★

# బభ్రువాహన

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు తెలియక తన కన్నబిడ్డలయిన లవకుశులతో పోరుకు దిగాడు. కాని పరిస్థితి తీవ్రరూపం దాల్చకముందే ఒకరి నొకరు తెలుసుకుని శాంతించారు. కాని ద్వాపర యుగంలో తెలిసి, పౌరుషానికిపోయి తండ్రి కొడుకు యుద్ధానికి దిగారు. వారే అర్జున బభ్రువాహనులు.

పురాణ ప్రసిద్ధమయిన ఈ రెండవ గాథనే నేషనల్ ఆర్ట్సు పిక్చర్సువారు తెర కెక్కించారు. ఆంధ్రలో ఈనెల 22 న విడుదలయిన ఈ చిత్రాన్ని మద్రాసు వాహినిలో 20 తేదీన పత్రికలకు ప్రదర్శించారు.

ధర్మరాజు—ద్రౌపది ఏకాంతంలో ఉండగా పొరపాటున చూసిన అర్జునుడు ప్రాయశ్చిత్తం నిమిత్తం భూప్రదక్షణకు బయలుదేరాడు. మార్గ మధ్యంలో నాగరాజు కుమార్తె ఉలూచిని ప్రేమించి వివాహమాడాడు. ఆ పిదప మణిపుర మహారాజు కుమార్తె చిత్రాంగదను వరించి పరిణయమాడాడు. ఆమె గర్భవతిగా ఉండగా వదలి తిరిగి ప్రయాణం సాగించాడు. ద్వారక చేరుకుని సన్యాసి వేషంలో శ్రీ కృష్ణుని సహాయంతో తన మేనమామ కూతురు సుభద్రను చాటుగా పెండ్లి చేసుకుని బలరాముని కోపాగ్నికి ఆహుతి కాకుండా ఎలాగో బయటపడ గలిగాడు. ఆ తరువాత కురుక్షేత్ర మహా సంగ్రామం జరిగింది. అందులో అర్జునుని గంగ శపించిన ఫలితంగా చిత్రాంగద తన నేర్పు నుపయోగించి అర్జునునికి నరకం తప్పించాలని నిశ్చయించి, తిరిగి గంగనే ప్రార్థించి ఆమె వలపోస్తే, అర్జునునికి బభ్రువాహనునికి అచిరకాలంలోనే అశ్వమేధయాగం సందర్భంలో యుద్ధం సాగేటట్లు ప్రయత్నించి, కృతకృత్యురాలయింది. ఆ యుద్ధంలో అర్జునుడు వధింపబడుతాడు. బభ్రువాహనుడు తన తండ్రిని సంజీవి రత్నంతో బ్రతికించుకుంటాడు.



'బభ్రువాహన'లో యస్. వరలక్ష్మి.

అర్జునుడుగా ఎన్. టి. రామారావు ప్రతిభావంతంగా నటించాడు. సుభద్రగా ఎల్. విజయలక్ష్మి సముచితంగా నటించింది. ఉలూచిగా రాజసులోచన నృత్యం ఆకర్షించింది. చిత్రాంగదగా ఎస్. వరలక్ష్మి ఆ పాత్రకుగల ప్రాముఖ్యాన్ని బాగా అర్థం చేసుకు చక్కని నటన కనబరచింది. విశారదుడుగా పేకేటి హాస్యం అందించాడు. రేలంగి మహారాజుగా సహజమయిన మామూలు హాస్యాన్ని ప్రసాదించాడు. శ్రీకృష్ణుడుగా కాంతారావు సమర్థతతో తన పాత్రను పోషించాడు.

రచనలో చమత్కారం గోచరించింది. నృత్యాలు బాగున్నాయి. కథ నడిపించిన తీరు చూడగా ఇక అంతకంటె అవకాశంలేదా? అనిపించినా అక్కడ విసుగు కలిగించదని మాత్రం చెప్పవచ్చు. టైటిల్ పాత్రకు బభ్రువాహనుడు సరయిన నటుని ఎన్నిక జరగలేదని స్పష్టమయింది.

(ఆంధ్రపత్రికనుంచి)



'వివాహబంధం'లో భానుమతి, నాగయ్య.

## అవీ - ఇవీ - అన్నీ

### ఆఫ్రికా లో—

ఇటీవలే ఆఫ్రికా దేశాలు పర్యటించిన భారత వాణిజ్య ప్రతినిధి వర్గం నాయకుడు శ్రీ ఎ. ఎం. మురుగప్ప చెట్టియార్ 16 అక్టోబర్‌కి మద్రాసుకి తిరిగి వచ్చేశారు.

పర్యటన వల్ల కలగబోయే లాభాలు గురించి చెబుతూ కెన్యాలో తను అనుభవాలు ప్రత్యేకంగా లాభవంతంగా ఉండవచ్చునన్నారు. శ్రీ చెట్టియార్ ఇంకా ఇతర విషయాలెన్నిటిని గురించో చెప్పారు.



'మంచి మనిషి'లో జమున.

### హుబ్లీ ఆంధ్ర కళా మండలి

హుబ్లీ ఆంధ్ర కళామండలి వారు 15 అక్టోబర్ తేదీన ఘనంగా దసరా మహోత్సవాలు జరుపుకున్నారు. కోలాటం పోటీలు, నాట్య ప్రదర్శనలు ఇంకా ఎన్నో వినోద కార్యక్రమాలు జరిగాయి.

### కొత్త సైకిళ్లు

హెర్క్యులిస్, ఫిలిప్స్ సైకిళ్ల తయారు కర్తలయిన "టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా" 'ఓ. యస్. ఏ' అనే కొత్త సైకిలును ప్రవేశ పెట్టినట్లు ఆ కంపెనీ వారు ఇటీవలనే పత్రికా ప్రకటన వొకదానిని విడుదల చేశారు.

### 'మీ స్వగృహం' పథకం

ఎల్‌ఐసి వారి 'మీ స్వగృహం' పథకం 1964 అక్టోబరు 14వ తేదీ నుండి మరికొన్ని కేంద్రాలకు విస్తరించబడును. ఇవి : కోల్హాపూరు, సాంగ్లి, అమరావతి, భావనగర్, జామ్‌నగర్, తూత్తుకోడి, గుంటూరు, విశాఖపట్నం, మంగుళూరు, కాలికట్, ఫరీదాబాద్, కోట, ధనబాద్, రాంచీ, దుర్గ్, ఘజియాబాద్, గోరక్‌పూర్" అని అధికార వర్గం వారి వర్తమానం.

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో శాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

నం॥



విజయవాడలోని అజిత్‌నగర్‌లో విజయదశమినాడు ఒక దుకాణం ముందు బియ్యంకోసం పడిగాపులు కాస్తున్న జనం.

# తీవ్రరూపం ధరిస్తున్న ఆహారసమస్య !

తింటానికి తిండీ, కట్టుకోడానికి బట్ట, వుంటానికి ఇల్లూ మానవుని కనీసపు అవసరాల్లోనివి ఈ మూడిట్లో అతిముఖ్యమైనది ఆహారం.

ఈనాడు భారతదేశాన్ని, ముఖ్యంగా దక్షిణాది రాష్ట్రాలను సతమతం చేస్తున్న సమస్యలలో ప్రధానమైన సమస్య ఆహార సమస్య. ముఖ్యంగా ఈ సంవత్సరం (1964)లో దేశంలో వుంటున్న 'ఆహార కొరత' మరీ విషమ పరిస్థితిని దాల్చింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఎన్నడూ లేనంతగా యీనాడు ఆహార కొరత ఏర్పడింది.

దక్షిణాదిన వున్న నాలుగు రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్, అధికమైన పంటను ప్రసాదిస్తున్న సంగతి తెలిసిందే. మద్రాసు, మైసూరు రాష్ట్రాలలో పండే పంట ఆయా రాష్ట్రాలకు సరిపోతుందని ప్రభుత్వపు అంచనా. ఎటొచ్చీ, కేరళ రాష్ట్రం, నాలుగింటిలో చిన్నదయినా, ఆహార ధాన్యాల ఉత్పత్తిలో చాలా వెనుకబడి వుందని అధికార వర్గాల కథనం.

కాని, వున్న పళాన ఆహార పరిస్థితిని అంచనా వేస్తే, యీనాటి స్థితి ఏ మాత్రం ప్రోత్సాహకరంగా లేదు సరిగదా, మరోవైపు నిరుత్సాహంగా అల్లుకపోతున్నది.

ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ అంతటా విరివిగా ఆహారధాన్యాలు పండుతున్నా, రాయలసీమ మొదలైన జిల్లాలలో 'క్షామం' లో మార్పు లేదన్న ఆక్రందనలు వినిపిస్తున్నాయి. మిగతా జిల్లాలలో కూడా పరిస్థితి ఏమాత్రం ఆశాజనకంగా లేదు. ప్రతిచోటా బియ్యం కోసం పడిగాపులు తప్పనిసరి అయిపోతున్నట్లు వార్తలు అందుతున్నాయి. హైదరాబాదు నగరంలో చౌక దుకాణాల పరిస్థితి నానాటికీ హాస్యాస్పదంగా మారుతున్నది.

మద్రాసు నగరం మరీ విషమంగా తయారయింది. రాత్రింబవళ్లు 'క్యూ'లో నిలబడ్డా గుప్పెడు బియ్యం దొరకకపోగా - మరోవైపు పరిస్థితి 'సంతృప్తికరం'గా వున్నట్లు ఆ రాష్ట్రపు ఆహారమంత్రి బహిరంగంగా ప్రకటించారు.

మైసూరు పరిస్థితి అంతే. కేరళ సంగతి అగమ్యగోచరంగా వుంది.

'ప్రణాళికాయుతమైన అభివృద్ధి' ని ఇండియా సాధిస్తూన్నదని మన నాయకులు విదేశాలలో చేసుకొంటున్న ప్రకటనలకూ, నేటి పరిస్థితులకూ పోలికలు ఎక్కడా కనుపించవు !

ఎన్ని సమస్యలొచ్చినా, ఎన్ని బాధలు వచ్చినా ప్రజలు భరిస్తారు. కాని 'ఆహార కొరత' ను మాత్రం భరించేటంత ఓర్పు సామాన్యునికి ఇంకా రాలేదేమో! [వా.ప్ర.] ★

Edited. Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'మజ్బూర్' లో విశ్వజిత్

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



ప్రఖ్యాత నేపథ్యగాయకుడు
టి. ఎం. సౌందరరాజన్